# SĀRANGAPĀNI PADAMULU

First Edition – October 1963 – Price Rs. 5/–

Printed at Saraswathi Power Press, Rajahmundry



PRACHEENA GRANDHAVALI
SARASWATHI POWER PRESS
R A J A H M U N D R Y
Editor : PURIPANDA APPALASWAMY

# ప్రకాశక విజ్ఞప్తి

ప్రాచీన గ్రంథావళిలో పదవ సంపుటముగా ఈ ‘ సారంగపాణి పదములు ’ ప్రచురించుచున్నాము. ఇటీవల మాచే వెలువరింపబడిన ‘క్షేత్రయ్య పదములు’ తెలుగు పాఠకులు చూచియే యుందురు. మఱియు, శృంగారపదములు, కలాపములు, త్యాగరాజు సంకీర్తనలు అన్న మూడు సంపుటములు త్వరలో ముద్రింపబడగలవు.

క్షేత్రయ్య పదములకు వలెనే సారంగపాణి పదములకు గూడ పదవాఙ్మయములో మంచి స్థానమున్నది. దీనిని గుర్తించియే యిట్లు సంకలనముచేయుట జరిగినది. ఈ సంకలనమును సముచితముగా నిట్లు తయారుచేసిన శ్రీ నేదునూరి గంగాధరంగారికి మాహృదయపూర్వకమైన కృతజ్ఞత తెలుపుచున్నాము.

‘సారంగపాణి పదములను’ గూర్చి విపులమైన సమీక్ష శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు వ్రాసినది ఈ గ్రంథాదిలో ముద్రించితిమి. ఈ రచన శ్రీ తెలికచర్ల వేంకటరత్నముగారి సంపాదకత్వమున వెలువడిన “ప్రతిభ” పత్రికలో ప్రచురితమైనది. దానిని మేము ఈ సంకలనమునకు భూమికగా ప్రచురించుకొనుటకు సౌజన్యముతో అనుమతించిన శ్రీ వేంకటరత్నముగారికి కృతజ్ఞత తెలుపుచున్నాము. మఱియు వారు అనేకవిధముల ఈ గ్రంథ ముద్రణమున సహకరించినారు. మరల మరల వారికి ధన్యవాదములు తెలుపుచున్నాము.

ఈ ‘ సారంగపాణి పదములు ’ తెలుగువారి ఆదరణమునకు పాత్రమగునని ఆశించుచున్నాము.

రాజమహేంద్రవరము
2 – 10 – 1963

ప్రకాశకులు
ప్రాచీన గ్రంథావళి

# సారంగపాణి పదములు

## మండపాక పార్వతీశ్వరశాస్త్రి

నాచిన్నతనములో, మాబొబ్బిలిలో ఉన్న వేణుగోపాలస్వామివారి ఆలయానికి తరుచుగా రాత్రిళ్ళు వెళ్ళుతూ, ప్రసాదాల వినియోగం పూర్తి అయ్యేదాకా కనిపెట్టుకొని ఉండేవాణ్ణి. నన్ను ఆకర్షించింది ప్రసాదాల వినియోగమే కాదు; అంతకన్నా మరొక విశిష్టవిషయం ఉండేది. అక్కడ కీర్తన భాగవతులు పవ్వళింపుసేవలు పాడేవారు. అందులో ఒక ముసలాయన "లాలనుచు వూచేరు లలన లింపునను, శ్రీలచెన్నలరు నుయ్యాలపాన్పుననూ" అని పూర్వకాలపు బాణీతో లాలిపాట పాడుతూ ఉండేవాడు. ఆపాట నాకు చాలా ఆనందం కలిగిస్తూ ఉండేది. కాబట్టి రోజూ వింటూన్నా, తనివితీరేది కాదు. ఆపాట విందామనే తరుచుగా వెళ్ళుతూ ఉండేవాణ్ణి. మాయింట్లో ఉన్న పిల్లల కందరికీ సంగీతం – స్వరాలు, కృతులూ, వీటిమీద చాలా మక్కువ. కాని, నాకుమాత్రం సంగీతం అబ్బిందికాదు. అందుచేత, పల్లవిసంప్రదాయం, కృతిసంప్రదాయం పాటలకన్న, భక్తిగనో. రక్తిగనో, పాడే కీర్తనలే నామనస్సును ఆకర్షిస్తూ ఉండేవి. ముఖ్యముగా, ముసలమ్మలు పాడుతూ ఉండే భజనకత్తు కీర్తనలు, బందిఖానా వగైరాలలోవి చాలా ఇష్టంగా ఉండేవి. మా నాయనమ్మగారు కొన్ని చక్కని పాటలు పాడేవారు. ఆవిడకు సంగీతం రాకపోయినా, మహాగాయకుల ఇంటి ఆడబడుచు కావడంచేత, ఆవిడ శ్రావ్యమైన కంఠంతో భక్తిరసమైన పాటలు చాలా పాడుతూ ఉండేవారు. అందులో, ముఖ్యముగా,

హరినారాయణ గోవిందా యని
స్మరణసేయవే వోమనసా
పురుషోత్తమ దామోదర కేశవ
భోగిశయన వేణుగోపాల హరి

అనిన్నీ, ఎంతపేదవాడే – వేణుగోపాలు
డెంత పేదవాడే –
అంత పేదగాకుంటే – అలనాడు కుచేలుని
అటుకులకు చే సాచునా – ఓ చెలులారా
ఎంతపేదవాడే –

పండ మంచమే యుంటే – భావజజనకుడూ
పాముపై నిద్రించునా

అని పాడుతూ,

పొట్టనిండితే శౌరి – పొరుగిండ్ల చొరబడి
పొంచి వెన్న మ్రుచ్చిలుటా – ఓ చెలులారా –

అన్న మాటలు వచ్చేసరికి, నాకు ఒళ్ళు గగుర్పొడిచి తిరిగి, మరొకసారి పాడమంటూ ఉండేవాణ్ణి.

ఆవిడ పాడుతూ ఉండే పాటలలో. నాకు ఎక్కువగా మనసుకు ఆనందం కలిగిస్తూ ఉండే పాట యేదంటే,

కఱ్ఱపూనుకొని తిరుగక మునుపే
కంఠధ్వని తగ్గిపోవక మునుపే
అఱ్ఱు ముందరికి వంగక మునుపే
అంగము, తల, వణకెత్తక మునుపే
హరినామస్మరణ సేయకవుంటే
అవతలగతి యేమీ –

అప్పుకాపులు కదియక మునుపే
అన్న మొకరు తినిపించక మునుపే
దొప్పలోన చై గడగక మునుపే
దోవతి బరువై తోచక మునుపే
హరినామస్మరణ సేయకవుంటే
అవతల గతి యేమీ –

ఈ పాట పాడుతూఉంటే, ఇంట్లో ఉన్న ముసలమ్మల అంస్ధ కళ్ళకు కడుతూ ఉండేది. మావూళ్ళో సాతాన్లు అక్షయ పాత్రకు చాలామంది వచ్చేవారు. వాళ్లు పాడే పాటలు నాకు అప్పటికీ, ఇప్పటికీ కూడా ఆనందం కలిగిస్తాయి. మావూరి సాతాను లలో ఒకాయన నామాలు బాగా దిద్ది, యెఱ్ఱని గుమ్మడిపండువాటం అక్షయ పాత్ర పట్టుకొని, ఈక్రిందిపాట పాడుతూ ఉండేవాడు.

అక్షయపాత్రకుపోతే – కలదని – వాక
భిక్షము వేయరయా – మూల
నిక్షేపము త్రవ్వి నెత్తిన బెట్టేరా

ఈ పాట నాకు చాలా ఆనందం కలిగించేది.

ఇందులో. "నిందుకొన్నదని కొందరు, అరువు, నీయబ్బతోడని కొందరు" అనిన్నీ, "పెద్దలులేరని కొందరు. నేను తద్దినమనేవారు కొందరు" అనిన్నీ పాడుతూఉంటే నాకు చాలా ఆనందంగా ఉండేది. సాతాన్లుపాడే పాటలో, "కడుపా నీవింత ఘనమైతివా" అనేపాట ఒకటినాకు చాలా ఇష్టంగా ఉండేది.

"భక్తిలేని వ్రతము లెన్ని చేసిన. ఫలములేదుసుమ్మీ" అనే పాట అంతా సరదాగానే ఉండేదిగాని, ఆపాటలోఉన్న,

కావివస్త్రములు గట్టిన నేమి కండ్లు మూసుకొని గొణిగిన నేమి
లావుగ తిరుమణి మెత్తి న నేమి లక్షతులసి సర్పించిననేమి"

ఆమాటలు వచ్చేటప్పుడు చెవులు రిక్కించుకొని. జాగ్రత్తగా వినేవాణ్ణి. కారణమేమంటే, అలాంటిభక్తులు కొందరు మావూళ్ళోవాళ్ళు నాకు కళ్ళకు కట్టినట్లు ఉండేవాళ్ళు.

అయితే, క్రమక్రమంగా నాకీపాట ఆపైని నజరు తగ్గిపోయింది. వసుచరిత్రాది ప్రబంధముల పఠన పాఠనములు చిన్నప్పుడే అభ్యాసం కావడంచేతనూ, చిన్నయసూరిగారి దబ్బాభాషలో ఏదో మాధుర్యం ఉందని నలుగురితోపాటు నేనూ అనుకోవడం చేతనూ, మధురమైన భాషగల ఈపాటలపైని నజరు తగ్గిపోయింది. "కబ్బంబులయందుబోలె నపశబ్దోచ్చారణం బెన్నఁడున్ లేకుండన్" నియమముతో సంభాషించడానికి అలవాటుపడ్డ కొక్కొండ వేంకటరత్నశర్మగారు అవతార పురుషుడువలె కనబడుతూ ఉండేవారు. మాతాతగారు పార్వతీశ్వరకవిగారు తాము రచించిన పద్యాలలో "బుధులక్షుల్ మూసుకోలేదు" అన్నప్పుడు, "కుదరకనా, ఇముడకనా." అన్నప్పుడు, నాకు అసహ్యంగా ఉండేది. బాల్యంలో పద్యరచనకు మాత్రమే అలవాటుపడ్డవాణ్ణి గనుక, చిన్నప్పటి పద్యాలలోనూ, కొద్దిగా తరువాత వ్రాసిన నవలలోను "దబ్బాభాష" చాలా ప్రీతితో వ్రాసేవాణ్ణి. ఆరోజులలో పదకవిత్వమంటే చేతగాని పామరులు వ్రాసేదని నాకు ఉద్దేశంగా ఉండేది. తరువాత తరువాత రావుసాహెబ్ గిడుగు రామమూర్తి పంతులుగారి దయవల్ల, వాడుకభాషలోకి దిగి, గ్రంథాలు తిరిగి తాళపత్రప్రతుల సహాయంతో చదవడం ఆరంభించిన తరువాత, చిన్నయసూరి ఆంధ్రదేశానికి చేసిన గొప్ప ద్రోహము హృదయములలో గట్టిగా నాటుకొనిపోయింది. అప్పుడు తిరిగి చాలా వెనకకు వెళ్ళవలసి వచ్చింది. శ్రీరామమూర్తి పంతులుగారు నాకు తిరిగి ఓనామాలు చెప్పి, అక్షరాభ్యాసం చేయించినారు. క్రొత్త దృష్టితో తిరిగి గ్రంథాలన్నీ చదువుకొన్నాను. ఆచదవడంలో పూర్వం నాకు అసహ్యములుగా ఉండిన కొన్నిగ్రంథాలు అప్పుడు సహ్యములుగా

ఉండడమే కాకుండా. గౌరవించదగినవిగా కూడా ఉండ సాగినవి. అందులో, పద కవిత్వాలు, ద్విపదకవిత్వాలు, ముఖ్యమైనవి. ఇప్పుడు ప్రబంధాలకన్న వీటిపైన నాకు ఎక్కువ గౌరవం. నిజమైన తెలుగుకవుల నిజమైన కవితాశక్తి అంతా ఈరెండు రకాల కవిత్వాలలోనే ఉంది.

పదకవిత్వాలలో, రెండు పుస్తకాలు నాకు చాలా ప్రీతి కలిగించేవి కలవు:

(1) క్షేత్రయపదములు.

(2) సారంగపాణిపదములు.

క్షేత్రయపదములు ఆంధ్రవాఙ్మయానికి మాత్రమే చేరవలసినవి కావు. అమరుకకవికి గల భావనాశక్తియును, జయదేవకవికిగల పదగుంభనసామర్థ్యమును గలసి, క్షేత్రయలో మూర్తీభవిస్తూ ఉన్నవి. తగినవారెవరైనా, ఆంగ్లేయభాషలోనికి తర్జుమా చేసి చూపితే, పాశ్చాత్యులుకూడా ఆమోదించవలసినంత భావనాబలము కలదు క్షేత్రయ కవిత్వములో,

అందులోనూ, అడుగరమ్మా – అతనిపైనూరక అలిగినానటరే –

అనేపదంలో

"పొలుపుమీర దానిరూపు పలకమీద వ్రాసి పాణి
తలముననుంచి కనుగొనుచున్నది తానో నేనో"

అనే వాక్యంలోఉన్న రసపుష్టి అమరుకుడికి జయదేవుడికీ కూడా సాధ్యం కాదనే నానమ్మకం.

ప్రబంధాలు తెలుగును విశ్వవాఙ్మయమునుంచి తప్పించినవి. విశ్వవాఙ్మయములో చేర్చి, తెలుగును ఉన్నతస్థానం ఇప్పించగల పదద్విపద కవిత్వాల నిజమైన స్థానం గమనించవలసిన భారం ఆంధ్రులపైన కలదు. క్షేత్రయ రచించిన ఈక్రిందిపదం చూడండి.

కళ్యాణి – త్రిపుట.

పల్లవి – ఇంతమేలుదానవా, ఓచెలియ, నీ
వింతమేలుదానవా –

అనుపల్లవి – ఇంతి మువ్వగోపాలు నింటికేలపొమ్మంటివే,

చరణములు.

చెలులొక్కరును లేరు, చిలుక పంజరమున
పలుకకున్నది, యల్లభావ మేమో,
తెలుసుకొందా మని తెరచాటుననుండిన
కలికిరో, వాడె చక్కనివా డంటివి - ఇంత -
మరి యే మందువోయని, మాటాడు నీగుట్టు
నరసె ననఁగేల నద్దము వూని,
మురిపెముతో నీదు మోవి విరుచుకొని,
నెరజాణ డైనవానికి నీడు లే దంటివి - ఇంత -

ఈ పాటలో కవి చూపించిన సామర్థ్యము సుప్రసిద్ధమైన ఏ సంస్కృత కావ్యంలో కూడా లేదనే నా ఉద్దేశం. ఆంధ్రుణ్ణి కావడంచేతనేమో-క్షేత్రయ్యనుగురించి ఎవరో కొంచెం వ్రాసినారుగాని, ఇంకా విపులంగా తద్జ్ఞులెవరైనా వ్రాస్తే సంతోషిస్తాను. ఇక సారంగపాణిపదాలనుగురించి వ్రాస్తాను.

శ్రీరామమూర్తి పంతులుగారి ఉపదేశానుసారంగా పాతపుస్తకాలు తిరగవేస్తూ ఉండడంలో, సారంగపాణిపదా లనే పుస్తకం ఒకటి నాచేతుల్లో పడ్డది. నా మామూలుప్రకారం, తురకవానివలె, పుస్తకంపత్రాలు వెనకనుంచి తిరగవేయడం ప్రారంభించాను.

అందులో, మొదటనే - అనగా చివరనే -

* లా లెనుచు వూచేరు లలన లింపునను .
శ్రీలచెన్నలరు నుయ్యాలపొన్పునను -

అన్నపాట కనిపించింది. అందులో

జోల బాడెద మనుచు, జోడు గూడుకొని,
బాలికలు తమలోన పంతమాడుకొని,

---

* లాలి + అనుచు - ఇది ఇప్పుడు "లాలనుచు" అని వ్రాస్తారు. పూర్వం - "లాలెనుచు" అని వ్రాసేవారు. ఇ + అ - ఈ సంధికి ఫలితము ఆ గాని, ఎ గాని కాదు ఇంగ్లీషులో Back - Mat అనే వాటిలోని అకారధ్వని వంటిది. మనము తాటాకు - చెప్పాడు - అనేవి ఎలాఉచ్చరిస్తామో అది దీనికి ప్రత్యేకగుర్తు కావలెను. గ్రాంధికులు తోసివేద్దా మన్నా పోరిపోదు.

మేలిమిగ నిన్ను యేవేళ పాడుకొని,
తాళిమితో వచ్చెరు దయను వేడుకొని –

ఆనేమాటలు పూర్వపు మా బొబ్బిలికోవెలలో ముసలికీర్తనభాగవతుణ్ణి జ్ఞాపకము చేసి నన్ను బాల్యావస్థలోకి క్షణకాలం మార్చి వేసినవి.

అలాగు పత్రాలు తిరగవెయ్యగా వెయ్యగా చిన్నప్పుడు నేను వింటూఉండిన మా నాయనమ్మగారి పాటలు, సాతానులపాటలు చాలా కనబడ్డాయి. బహుశా యీ పుస్తకం బొబ్బిలిప్రాంతాలలోదేమో అని భ్రమపడి ముఖపత్రం తీశాను.

చెన్నపురిలో 1867 వ క్రీస్తుశక సంవత్సరములో అచ్చుపడ్డది. కార్వేటి నగరాధీశ్వరుల ఆజ్ఞచే గ్రంథకర్తయగు సారంగపాణిగారి దౌహిత్రుడు గరిమెళ్ళ వెంకటసుబ్బయ్యగారిచే నేలటూరి సుబ్రహ్మణ్యముగారి విద్యావిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపింపబడినది. కార్వేటి నగరాధిష్ఠిత శ్రీమద్వేణుగోపాల నామాంకితమైనది. కాబట్టి గ్రంథకర్త 1830 సంవత్సరపు ప్రాంతములలోనివాడై చిన్నయసూరిగారికి సమకాలికుడై యున్నాడు. ఎక్కడి కార్వేటినగరము – ఎక్కడి బొబ్బిలి? రైళ్ళులేని కాలంలో ముసలమ్మలు, బిచ్చగాండ్రుకూడా పాడుకొని, ఆనందించేటంత ప్రజామోదమును పొందగల మాధుర్యము కలిగిన ఈగ్రంథమును ఆమూలాగ్రంగా చదవడం ప్రారంభించినాను. గ్రంథమంతా నాలుగు భాగాలుగా విభజింపబడ్డది.

మొదటిభాగంలో శృంగారమున్నూ, రెండవభాగంలో దేశీయమున్నూ, మూడవభాగంలో జాతీయమున్నూ, నాలుకవభాగములో భక్తి వైరాగ్యములున్నూ కలవు. గేయకవిత్వములో సార్వభౌమ పీఠమును అధిష్ఠింపవలసినవాడు త్యాగరాజు. త్యాగరాజుగారి ప్రతిభ అంతా ఆయన పల్లవులలో ఉన్నది. ఆయనకు ఉండిన సంగీత సాహిత్యముల సామర్థ్యమంతా ఆయనపల్లవులలో కనిపిస్తుంది. యితే ఆయన చరణాలుమాత్రం ఆయనపల్లవులకు తీసి కట్టుగానే ఉంటాయి. కవితాదేవత తన్నావేశించిన నిముసములలో పల్లవులు అవ్యక్తముగా ఆయనకు స్ఫురిస్తూఉంటే తరువాత పాతపురాణానికి చరణములు పూరిస్తూ ఉండేవాడేమో అని నా అనుమానం. అనగా ఆయన పల్లవులలో దేవత్వమున్నూ చరణములలో మానవత్వమున్నూ నాకు కనిపిస్తూ ఉంటుం దన్నమాట. త్యాగయ్యగారి పల్లవులలో ఉన్నంత దివ్యప్రతిభ క్షేత్రయ్యగారి పల్లవులలో కనబడదు. కాని పల్లవి మొక్క మొలిచి నట్లుంటుంది. పల్లవిలోనుండి అనుపల్లవి దానినుండి చరణములు క్రమక్రమముగా వికసించి, ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయం అనే గీతావాక్యమును నాకు ప్రత్యక్ష

ముగా చూపిస్తూఉంటాయి. త్యాగయ్యగారి కీర్తనలలో పల్లవి ముందుపుట్టి చరణములు పూర్తికోసం ఏర్పడ్డట్టు కనిపిస్తూఉంటుంది. కాని క్షేత్రయ్యగారి కీర్తనలలో పల్లవి ముందుపుట్టి తరువాత చరణాలు పుట్టినవా లేక చరణాలు ముందుపుట్టి తరువాత పల్లవి పుట్టినదా అనే విచారణకు అవకాశం కలుగుతూ ఉంటుంది. అనగా, ఒకదాని కొకటి ఈడుదీయ వన్నమాట. *

మచ్చుకు ఒక్కొక్కటిమాత్రమే చూతాము :

– త్యాగయ్య –

కళ్యాణిరాగము – చాపుతాళము.

పల్లవి – నిధి చాలాసుఖమా, రామునిసన్నిధి చాలాసుఖమా –
నిజముగఁబల్కుమీ మనసా –

అను...దధినవనీతక్షీరములు రుచో, దాశరథిధ్యాన భజన అను
సుధారసములు రుచో,

చర...దమశమమను గంగాస్నానము సుఖమా, కర్దమదుర్విషయ
కూపస్నానము సుఖమా,
మమతబంధనయుత నరనుతి సుఖమా, సుమతిత్యాగరాజ
నుతుని కీర్తన సుఖమా

క్షేత్రయ్య

ముఖారిరాగము – చాపుతాళము

పల్లవి – అడుగరమ్మా, అతనిపై నూరక – అలిగినానటరే –

అను...పడుచుదనముమాని, మువ్వగో – పాలరాయనియాన బెట్టి
మీ – రడుగ

చర ..పూని, దానింటికిపోగాను మా – పొలతి చూచి బెదిరించిన
దానికి లంచమిచ్చెద నన్నది తానోనేనో,
వానిపై లేనివి కల్పింపరాదు, వాడవనిత లెల్ల వినగ
దాని నేఁజూడక – తాళలేనన్నది తానో, నేనో – అడుగరమ్మా
అలుకుదీరి దానివాకిటనిలచి. వీధిలో నన్నుఁజూచి,

---

* ఈ విషయమునుగురించి ప్రత్యేకంగా వ్యాసం వ్రాయవలసిఉంటుంది గనుక ఇక్కడ విస్తరించి వ్రాయలేదు.

తలుపుమూల దాగియున్నది తానో నేనో;
అలసివచ్చెననుచుఁ జక్కఁ రానవాలిచ్చిన నారగించి,
తలిరుబోణిమోవిరుచికి రా దన్నది తానో నేనో,
అనబెట్టి మీ - రడుగరమ్మా॥

త్యాగయ్యకును, క్షేత్రయ్యకును, పల్లవి - అనుపల్లవి - చరణముల పరస్పరాను సంధానములలో గల తేడా పైరెండింటివల్ల కొంతపోల్చుకోవచ్చును. నాదృష్టిలో త్యాగయ్య నారదునివంటి దేవఋషివలెనూ, క్షేత్రయ్య వాల్మీకివంటి మనుష్యఋషి వలెనూ, కనబడుతూఉంటారు.

సారంగపాణిగారి పాటలలో, త్యాగయ్యగారి నారదత్వముగాని, క్షేత్రయ్యగారి వాల్మీకిత్వముగాని, కనబడపోయినా, పల్లవి అనుపల్లవి చరణములు పరస్పరానుబంధముకలిగి, ఆయన సహజకవితా సామర్థ్యమును వెల్లడిచేస్తూఉంటాయి.
మచ్చుకు ఒకటిమాత్రం చూపిస్తాను.

శంకరాభరణము - త్రిపుట

పల్లవి - ఇంతమోహమేమిరా, ఇందరికన్న, ఇంతి చక్కనిదేమిర,

అను...సుంతసేపు దానిఁ జూడకుండలేవు
అంతరంగము తెలుప వదియేల, వేణుగోపాల, ఇంత -

చరణము...నీ కెదురుగావచ్చునా నెనరుగ నిండుకౌఁగిటఁ గ్రుచ్చునా
అకుమడుపు లందిచ్చునా, తన చెలిమికి - నైనవాడని మెచ్చునా,
తమి హెచ్చునా -

ఏకచిత్తమున మీరిద్దరు ఇంపుసొంపులనున్న ముచ్చట
నాకు వినవిన వేడుకయ్యారా ఇపుడానతీరా-
ఇంత మోహమేమిరా -

నేను సంగీత విద్వాంసుడను కాకపోవడంచేత సారంగపాణిగారి కీర్తనలలోని సంగీతశాస్త్రవిషయములు విమర్శింపదలచుకోలేను. శక్తిలేదు కూడాను. కాబట్టి ఆయనను కవిగా మాత్రమే భావించి విమర్శిస్తాను.

క్షేత్రయ్యగారి పదములలో భావమునకు తగిన రసమును తగిన భావమును, ఒకదానిలో ఒకటి ఇమిడి శివశక్తుల సామరస్యమువలె యర్ధనారీశ్వరత్వమును ప్రత్యక్షము చేయు చుండును. ఈక్రింది వాక్యాలు చూడండి.

మధ్యమావతి – ఆది

పల్లవి – తెలిసి తెలియలేక పలికేరు చెలులు
అను...కలసియున్న సామిపై – కాకసేయ వశమా –
చర...కొనకంటఁ దను గను–గొన దదింతైనగాని
నెనరులేని దాయెనంచు నిందించేరు
ఘనమైన సామిరూపు కనులు నిండియుండగ
కనకాంగి, యితరులు కానవత్తురటవే.

కళ్యాణి – ఆది

పల్లవి – నామనసువంటిది నీమనసైతే. నానోముఫల మీడేరరా –
అను...వేమారు, చెరకున పండు పండినట్లు వేడుక లినుమడించుర ఓరి వరద
చర...ఊరకుండగలేక, గోరనేమి వ్రాసిన, నీరూపుగా దోచురా
ఏరా కనుగూరి మేల్కాంచినంతనే నీవు నా
చేరువ నున్నట్టుండురా –
ఈరీతి నామోహ మున్నది నీకే తెలుసు
ఎవరితో విన్నవింతురా – ఓరీ వరద

మేడ యెక్కుచు తిరిగి. నీడ చూచిన నీవు
కూడ వచ్చినంట్లుండురా – శ్రుతి
కూడి యునిచికొని, పాడినంతనె నీవు నా
తోడ పాడిన ట్లుండురా –

ఆడినమాటకు ధ్వని నీవు ప్రతిమాట
లాడినయ ట్లుండురా –
ఈడు లేనినాదువలపు ఇది నీకు తెలుసు
నెవరితో విన్నవింతురా – ఓరి వరద

ఈ పైవాక్యములలోఉన్న రసభావసమ్మేళనము సంస్కృత పారశీకకవుల రసభావ సమ్మేళనమును మించి యున్నదని నాయుద్దేశము.

సారంగపాణిపాటలలో క్షేత్రయ్యగారి ప్రౌఢిమ కనబడకపోయినా మనోహరములైన భావములు విపులముగా కనిపిస్తూ ఉంటాయి. మచ్చుకు ఒక్కటి

కేదారగౌళ – ఆది.

పల్లవి – నేడు నీవు విన్నవించినందుకు నెనరు పుట్టరాదా – ఎంత
అను... వేడుకై తోచెనో నాఉనికి – కెలది వేణుగోపాలదేవునికి –
చర... నిన్నుఁ బాసి నిమిష మోర్వదంటివి, నీసొమ్మంటివి
కన్నీరున పైట దడిసె నంటివి – కారా దంటివి
ఉన్నతావుననుండదంటివి – ఉలికే నంటివి
చిన్నబుచ్చితే దోస మంటివి, చిత్తానికి సరిపోయిన దంటివి నేకు నీవు

పంతువరాళి – చాపు.

పల్లవి – కరుణ నీకు నామీద గలుగుటకు కారణ మే మయ్యా
అను... పరమాత్మ వేణుగోపాల నీదు నామ
స్మరణైన చేసితినే, యేవగనైన – కరుణ నీకు
చర... అలకుచేలునివలె, నటుకులు తెచ్చి మి మ్మారగించ మంటినే
చలువగంధము కుబ్జవలె దేవరవక్షఃస్థలమున నలదితినే
విలసితముగ నా విదురునివలె మీకు, విం దొనరింతినే
కులుకుచు నారదువలె పారిజాతకుసుమ మర్పించితినే
యేపగనైన – కరుణ

ఈభావములు సహృదయులకు హృదయంగమములుగా లేవా ?

ఈరచనావిశేషమే కాకుండా సారంగపాణిగారి కీర్తనలలో నా హృదయమును ఆకర్షించినవి మరికొన్ని విషయములు కలవు. అవి ప్రత్యేకముగా వివరిస్తాను.

సారంగపాణిగారు తన గ్రంధమును నాలుగు భాగములుగా చేసినారని ఇదివరకే చెప్పినాను. అందు మొదటిభాగమున స్వీయా పరకీయా సామాన్యాది వివిధ శృంగారమును, ద్వితీయభాగమున కేవల సామాన్యా శృంగారమును, తృతీయభాగమున జాతీయ (అనగా పామరజనుల) భావములును, చతుర్థభాగమున భక్తివైరాగ్యములును, హృదయంగమములుగా వర్ణించినారు.

మూడవభాగము చాలా విశిష్టమైనది. దీనికి జాతీయ మని పేరుపెట్టినారు. ఈ కాలములో "ఎంకిపాటల"ను స్వర్గలోకములకు ఎక్కించిన రసికశిఖామణు లందరూ గమనించవలసిన విషయము. నీచపాత్రలు నీచభాషలో, ఉత్తమపాత్రల భావాలు

ఉత్తమపాత్రల సంగీతంతో వ్యక్తము చేయడము ఎంతరసికతో, అందులో రసమున్న దనీ అనుభవిస్తూఉన్నామనీ అనుకోడము ఎంతరసికతో నావంటి అల్పజ్ఞుడు చెప్పగలిగినవిషయం కాదు. సారంగపాణిగారికిమాత్రం ఈభావము స్ఫురించినట్లు కనబడదు. కళాప్రపూర్ణులు సృష్టించిన ఎల్లి పేరిగాళ్ళ ప్రేమోదంతము ఎంకి నాయుడుబావల ప్రమోదంతంతో సంప్రతించి చూస్తే కళాప్రపూర్ణుల నామసార్థకత్వము గోచరిస్తుంది. అంతే కాక

నీమణుచు నామణుచు, నిరకు తప్పకుంటే
ఎన్నాళ్ళు ఎడబాసి తేమోషె నెంచు
ఏమూల ఏసోల ఏమి కన్నేసినవో
యెంటా నన్రా నీవు తుంటరిమామ –

అనేమాటలలో గలభావపారిశుద్ధ్యముగాని,

రైకా సూసి మోగించినడు రాసావోరిపడుచు
కోకా సూసి మోగించినడు గోసాసింగుపడుచు

అనేమాటలలో గలభావయాథార్థ్యముగాని, ఎంకి నాయుడుబావల ప్రేమోదంతములో ఎంతవరకు ఉన్నదో తద్జ్ఞులూహింతురుగాక. సారంగపాణిగారి నీచపాత్ర ప్రసంగాలు చిత్రంగా ఉంటాయి. మచ్చుకు కొన్ని మాదిరీలు చూపిస్తాను.

మోహన – చాపు.

పల్లవి – ఇసబోనంమ్మ్రోన – యీదెంబ డెల్లొచ్చే
దిష్టిగ్నమో యీస్పృడో బొమ్మ్రో లేక యిగనేసుడ్డో సిముడ్డో

అను... నొసలి బూది గొట్టి నొష్ట గంధం మెత్తి
కుసుని కుండాడోడు గుండా ముంగాల – ఇసబోనం

చర... గొడుగు లంట శింపి – గిడుగుల్నే యుండాయి
అడుగున పబ నో రట్లల బెట్టింది
తడిగవేనటుంది, అడిగే పేరెటమను
పడుసూపిన్నో లేందో పక్కలా యిసరగా – ఇసబోనమ్మ్రో

తాలాలువాసగ - మేలాలాగుతుండాగ
సివేడికలు సూడ - శిత్రాలాడ
పూవుంట సెదుగాలు - పుట్టుగిచ్చాల్లోనో
తావేనగారిందాంయి తలమంటేకంబోయి - ఇసబో

మరొకటి

పంతువరాళి - ఆది.

పల్లవి - సంగనాకమను - బీమెడుండాయి - బింగరమోయి బాపనోల్లకు
అను...అంగల్లో అచ్చింత్లోగింజలె - చంకటి కిసిరిన పిండిసమైతే
చం...యేదొల్లోపరచి చెంతుంటే
యేయిటాకీణ్ణే గోరస్తపడుండపె
గోదారైతే గుడ్డెల్లిందేమీడ
గొండపొమ్మను పిండోల్నంటి నాలెంజ - సంగ

ఇంకొకటి

నాదనామక్రియ - చాపు.

పల్లవి - మనుషా - నొమ్మబాకే - యీాద్రేగాము కళేభారం
మనుషా - ణమ్మబాకే

అను...మనుషా యీాద్రేగాము మట్టి సెట్టింటుది
పనిశేటిలోనుండె - పరమాత్ముడు చెల్నంటే - మనుషా

చర...1. త్రొమ్మిదిసారంఘూళ - త్రోశేనరమాసిగ
బెమ్మ గాయించిది - బెష్టకారికట్టె - మనుషా

2. ఎన్నెంటాయెమికెలు - యెనకముంగ లెంటికెలు
కన్నయాదులబుట్టు - గడగకుంటె గబ్బు మనుషా

3. పయియెన్నె లడుగున - పరమశాంథలము
మయిదు యీాస్మృడుశేగి - మబ్బిగప్పింఘాడు మనుషా

4. తనవోణశెత్తి - ధరమధాణంశేశి
యినవలెరామేంథం - ననమోచ్ఛము - మనుషా

5. ఎంటవంగిటిలాపు – యేనుగోపాలుని
బంగ్లై పాదకవళం బట్టావే ఘట్టిగ – మనుషా

మరొక్కటిమాత్రం

ఆరభి – చాపు

పల్లవి – అగ్గితిరునుళ్ళంట – అజ్జునికతులంట
అవురా – యెంతసోద్దెమే – బారతకత
ఔరా – యెన్నెన్నింతలే

అను... నుగ్గిజయము నీని – సుట్టుబలాదురు
అగ్గురోరపు అయ్యోర్న ఒగో నీసాచ్చిగ అగ్గి

చర...1. యిగనేసుపైకెక్కి – యీబీసనూడొచ్చి
బగుపెగ్గిల్నెన్నో – బలికిదుశ్శానూని
మొగముచూడగనే – మొర్ర నాయాలట్టి
గుగుసుమిగువనకుండ – గుండెల్లగుక్కవే అగ్గి

2. అనుమం తెనకటోడు – అభిమన్నుడంటానే
సనియనోలె బట్ట – సాము సేయును అట్టె
యినయోయో బద్రు – నిసన కాయలు దొక్కి
కనురెప్పె సా తక్కి – కర్ణునిసించనె – అగ్గి

3. యిరన్నెచ్చు సడ్డకు – డింద్రజిత్తోకరెయ్యి
దురివోదనునిసెయిలో – దూరి ముక్కున నెల్లి
అరిసి పిసాసోలె – అశ్వద్దామను మింగి,
సారివోదమాయెనే, సాడయేడిగున్నె – అగ్గి

నీచపాత్రలలో కలుగుతూఉండే భావాలు వాటితబ్బిబ్బులూ పైపాటలలో యెంత స్వభావసిద్ధంగా ఉన్నవో పరిశీలిస్తే తెలుస్తుంది. పాత్రకు తగినభాష – భాషకు తగిన భావము భావానికి తగినపాత్ర పరస్పర పోషకములై జీవకళతో ఉన్నవి.

అయితే, ఈభాషలో పెద్దచిక్కు కలుగుతూఉన్నది. పేరిగాడి ఉదంతంగాని కన్యాశుల్కంగాని యెంకినాయకురాలి ప్రణయవిభ్రమముగాని, సారంగపాణిగారి జాతీయంగాని, ఛాయాపేక్షకములైయే యున్నవి. సమకాలికులగు సమదేశికులకే సుబోధములుగాని ఇవన్నీ దేశకాల భేదములవల్ల దుర్బోధములైయే యున్నవి.

పామరజనవ్యవహార సిద్ధమైనభాష తద్దేశ తాత్కాల తత్పాత్రలకు మనోరంజకము గాను సుగమము గానుఉన్నా, సర్వ దేశసర్వ కాలసర్వ పాత్రమనోరంజకము గాఉండదు. బహుదూరత్వమువల్ల అన్ని భాషలకు ఈగతే పట్టవచ్చును గాని అవకాశమైనంతవరకు దేశకాల పాత్రల సార్వత్రికత్వము కావ్యరచనలో గమనించవలసిన అంశము కాదా? ఏది ఏలాగుఉన్నా నీచపాత్రల భావాలు నీచభాషలో చెప్పితేనే హృదయములను ఆకర్షించునుగాని ఉత్తమభాషలో చెప్పిన ప్రయోజనములేదు. చిత్రనలీయములో ఎరుకువాళ్ళ సంభాషణ స్వభావసిద్ధము కాదని వేఱే చెప్పనక్కరలేదు. కాబట్టి సారంగపాణిగారు తృతీయభాగరచనకు ప్రశంసాపాత్రులై యున్నారు.

ద్వితీయభాగమునకు దేశీయమని సారంగపాణిగారే పేరుపెట్టియున్నారు. ఇందులో సామాన్య శృంగారము వర్ణించి ఉన్నారు. ఈభాగంలోఉన్న పాట లన్నింటి లోను భావము, భాషా, చాలా ఒప్పిఉన్నవి. శిష్టజనులు సంప్రదాయంగా మాట్లాడు కొనే వ్యవహారభాషలో మనోహరములై సముచితములైన భావములతో ఈభాగ మంతా చాలా శ్రావ్యంగా ఉన్నది. భాష అతి సులభము అతిలలితము. భావములు అతి కోమలములు. సామాన్యభావమునకు మిక్కిలి ఒప్పియున్నవి. మచ్చు చూదాం. మొట్టమొదటనే

భైరవి – త్రిపుట

పల్లవి – నీపొందు సేయక విడిచేనా – వేరే
నెలతకొప్పున విరులు ముడిచేనా – అరే

అను... బాపురే నే చేయు – ప్రతిన చెల్లక పోతే
నా పేరు యిక వేణు – గోపాలుడనవలెనా – నీపొందు

చ... 1. మరునిగూర్చి తపము చేయనా – యీాడా
మనసులేదంటే నే ఆయెనా
మరులునిలుపలేక – మరిమరి వేడితే
కరుణమాలి యట్టె – కండ్లెఱ్ఱచేయగానే – నీపొందు

2, పాటపాడి మెప్పించనా – నీపై
పదము చెప్పి వలపించనా
బూటకాలమాలి – నీపుణ్యమునేకొద్ది
మోటుబారుకొని – మొగము చిట్లించగానే – నీపొందు

3. కూనలమ్మకు వేట గొట్టినా - నిన్ను
గూడితే పొంగళ్ళు బెట్టనా
చానరో బతిమాలి సరసకు రమ్మంటి
కానిలేలెమ్మని కనరిపొమ్మనగానె - నీపొందు

ఇంకొకటి

భైరవి - ఆది.

పల్లవి - నీకూతురినడతలు - నీకే సరి - లోకులెవరు మెచ్చరమ్మా
అను...ఈకాడికి తెల్లవారెగద - నన్నికను వేణుగోపాలుడనదట - నీ

చర...1. నిదురబోతె - లేవ మనసుబుట్టదు - నుదుటయేనాడు బొట్టుపెట్టదు
ఇదియుగాక - తమలపాకుముట్టదు - ఏడాదికికొప్పువిడిచికట్టదు - నీ

2. వీణె చేత వక నాడుముట్టదు - వింతచూచినా - నవ్వుపుట్టదు
రాణివాసముట అడుగలుపెట్టదు - రామరామ - సొగసనేది గిట్టదు-నీ

3. నేనుగూడేది తనకుకూడదు - నెనరుగూర్చి నాతో పలుకాడదు
పూనినట్టి మంకుగుణము వీడదు - బుద్ధి వారు చెప్పేరనిచూడదు-నీకూతు

ఇంకొకట

మాధ్యమావతి - చాపు.

పల్లవి - ఇప్పుడు గాక యింకెప్పుడు బెదరించే వింతి నిన్నదోసమా

అను...చప్పుడుచేయక - వేణుగోపాలుడు
చంకబెట్టుకొన్న సలి గాదటవేమే - ఇప్పుడు

చర...1. చుట్టు కొల్లారిండ్లు - సుంతలో విడిదాయె
పట్టిమంచము దూదిపరుపులాయె;
పెట్టెలకొలది కట్టువర్గములాయె - పెరిమెలదనమాయె;
కట్టివిడువచేత కాసువీసమాయె; వుట్టిమీద నేతివుగ్గాలాయె
పట్టినపనులెల్ల బంగారుచెరుగాయె
వట్టాకు వుడికించే చట్టి దూరమాయె - ఇప్పుడు....

2. పడతీరో - పూరూరు పైరుపచ్చలాయె
కడలేని ధాన్యాల - కణజలాయె;
మెడదిప్పరాకుండ - మినుకుసొమ్ములాయె
మెరుగుటద్దములాయె;

నడితీలో యిప్పుడు - నాగరీకమాయె నానాటికీ పని
నాణ్యమాయె;

వడినిండా తరగని - వక్కలాకులాయె;
ముడికే చాలనిగుడ్డ ముచ్చటమరుపాయె - ఇప్పుడు -

ఇంకొక్కటిమాత్రం

గౌళిపంతు - ఆది.

పల్లవి - అంతమాత్రము నే నీయనటే - అజ్ఞానురాలా - నే

అను...యెంత పిలిచిన ససేమిరా యని - గంతులువైచుచు పరిగెత్తేవు

చర...1. శేవాకాలము రాతిరిగుళ్లో - అవేళాదాకా నిలుచుంటి
తేవాకులమువారొకదోశ - నీవొళ్ళోవేసె మూసుకొమ్మని - అంత

2. గద్దగూడువలె తలబెట్టుకొని - సుద్దులాడవచ్చితె సాతాని
పెద్దవెలగచిప్పదెచ్చుకొమ్మని-శిద్దెలోనిచమురు వంచియిచ్చెను-అంత

3. రొయ్యదిన్ననోటికి పొవ్వాకిం - తియ్యమనుచు యెడమచెయ్యిసాచితే
అయ్యతోడె లేదని తనచాటెడు బియ్యమిచ్చె పురాణపుదాసరి - అంత

4. పాతగుడ్డ పైటకందలేదని - భంగపడితె - నాంచారుకప్పుడు
సాటియున్నచీరె గుంజి వేగమె - చేతికిచ్చె పరిచారకవైష్ణవు - డంత

ఈ భాగమంతా ఈలాగేఉన్నది. ఇందులో భావాలు చాలా స్వభావసిద్ధములు. భాష పాత్రోచితమై శిష్టజన వ్యవహారసిద్ధమైనభాష. ఈలాటిభాష చాలాకాలం వరకూ పాతబడిపోదు. స్వభావసిద్ధమైన భావానికి, మనోహరమైనభాషకూ ఈ ద్వితీయభాగరచనలో సారంగపాణిగారిని చాలా ప్రశంస చేయవలసిఉన్నది.

చతుర్థభాగమంతా భక్తివైరాగ్యములతో నిండిఉన్నది. గేయరచనలలో సామ్రాజ్య పట్టాభిషిక్తులగు త్యాగయ్యగారిని విడిచితే భక్తివైరాగ్యరచనలలో రెండవస్థానము

గోపన్న గారికే ఈయవలసియున్నది. దాశరధీ - కరుణాపయోనిధీ - అన్న మాట నోటపట్టని ఆంధ్రుడుండడు. ఆయన తాను రచించిన కీర్తనలలో - యెదుటివారిని పరవశము చేసి తాను పరవశమగును. సకలేంద్రియములార! యిపుడు సమయముగాదు, సద్దు సేయక యుండరే-అని గోపన్న గారు అంటూ ఉంటే ఇంద్రియములకు ఏకాగ్రత గోపన్న గారికే కలుగుతుందో మనకే కలుగుతుందో చెప్పలేను.

“ పలుకుతూ తిరిగేవు. ఎవరబ్బసొమ్మని ” అనిగాని, “ అడుగుదాటికదలనివ్వను, నాకభయమివ్వక నిన్ను విడువను ” అనిగాని గోపన్న గారంటూఉంటే స్వామివద్ద అంతస్వాతంత్ర్యము ఆయనకే చెల్లిందిగాని మనమనగా ఎంతవారమని తోస్తూ ఉంటుంది ఏమీవద్దు, పట్టినే “ రామచంద్రా ” అన్నమాట గోపన్న గారినోటినుండి వచ్చినప్పుడల్లా రామచంద్రుడు “ఓ” అని, గోపన్న గారికే పలుకుతూఉన్నాడో, మనకే పలుకుతూన్నాడో వివరించలేను.

త్యాగయ్య గారికుండే సర్వతోముఖప్రతిభగాని, గోపన్న గారికుండే భక్తితాదాత్మ్యముగాని, సారంగపాణి గారికి లేకపోయినా, భక్తికితగినభావన, భావనకు తగినభాష ఒకదానికొకటి తులతూగుతూ సారంగపాణిగారి భక్తివైరాగ్యకీర్తనలు చాలా హృదయంగమములుగా ఉంటాయి. మచ్చుకు

భైరవి - ఆది.

పల్లవి - భక్తితోపిలిచి పెట్టినయన్నము పట్టెడైనచాలు; చెవులకు

అను...రక్తిగా హితమైనపాట - పల్లవి విన్నాచాలు; కృష్ణా - భక్తి

చర...1. భావము తెలిసిననాయకురాలితో - భాషించినచాలు; తెలిసిన
కోవిదులకు కరుణనిచ్చుదానము - కొంచెమైనచాలు; కృష్ణా - భక్తి

2. కులము వెలయ సత్కీర్తి వహించే - కొడుకొక్కడేచాలు - ప్రజలను
అలమటపెట్టక - ఆర్జించిరధన మణుమాత్రమెచాలు; కృష్ణా - భక్తితో

3. అచ్చుదలై - తాతగట్టినజాగా - అడిగెడైనచాలు - యిది
గచ్చుగాదు - సద్గురువాక్యము లరగడియవిన్నచాలు; కృష్ణా

4. వచ్చినపుడె యాచకులకు వకతృణమిచ్చేనంటిచాలు - సతులకు
హెచ్చువలదు - భర్తదైవమని వూ-హించిరైనచాలు - కృష్ణా - భక్తితో

5. దురితములుడిగేటందుకు దామో - దరునిభజన చాలు; మీదట
పరతత్వము తెలుపుటకు వేణుగోపాలుడే చాలు; కృష్ణా! భక్తితో పిలిచి

సారంగపాణిగారు చతుర్థ పాదంలో ఉపయోగించిన భాషకున్నూ ప్రథమపాదంలో ఉపయోగించిన భాషకున్నూ తేడాలేదు. కాబట్టి భాషావిషయమై రెండున్నూ కలిపే విమర్శిస్తాను.

ప్రథమభాగం వివిధములైన శృంగారభావాలు వర్ణించినారు. ఈభాగము పూర్తిగా కార్వేటి నగర వేణుగోపాలుని కంకితము కాలేదు. ఇతర నాయకులుకూడా కలరు. ఈక్రిందివారు ముఖ్యులు - శ్రీకళ్యాణ వేంకటేశ్వరులు, చిరుతని చెంగల్వరాయడు, ప్రసన్న వేంకటశౌరి, వరదా నారాయణుడు, శ్రీమాకరాజ వీర కార్వేటిరాజేంద్రుడు ఈ నాయకులందఱూ వస్తారు.

ఏనాయకుడు వచ్చినా అతడు దక్షిణనాయకుడే, ఇతడు కవులపాలిటి కల్పతరువు కదా! నాయికలు మాత్రమే మారుతూ ఉంటారు. ఈప్రథమభాగంలో సారంగపాణిగారు తమ వైదుష్యం చూపించినారు. రచన బిగిగాఉంటుంది. అనగా పండితుడు చెప్పినట్లు చెప్పనారు. కాని ద్వితీయభాగంలో ఉండే భావసారళ్యము భాషామాధుర్యం కనబడదు. పాండిత్య ప్రకర్ష కొసం చేసిన ప్రయత్నం స్పష్టంగా ప్రత్యక్షమౌతుంది. ఇది అనేకవిధాలుగా కనబడుతుంది.

మచ్చు చూదాం.

1. (i) జిగిబిగి

పల్లవి - అలుకచేసి పలుకడేమె యా చెలివలపుమందు బలిమో

అను... వెలది వినవె శ్రీకార్వేటినగర - నిలయుడైన వేణుగోపాలుడు

చర...(1) కలికి చిలుకపలుకును పొలయుచు చెలినిగోరినాడే - నను
బలిమిచేసి, వలచియున్న బాళిని కలిసి యెంచినాడే -
తలిరుబోణులలో బలువిధముల నిటు చులకచేసినాడే - యిక
చెలిమిదలచి, కలసిమెలసి అలయక వలపునిలుపగలన లలన చెలువుడు
అలుక

(2) తెగువతోడ నాముగువకు వెలగల నగలు యిచ్చినాడే - నే
సగముశేయివేళ నగరు బంపితే అగడు జేసినాడే

పగలుజూడనే సొగసుగ బిలిచితే నగవులాడినాడే యీ
వగలు వలదు-సుగుణములుగల నగధరు దగిలి పొగడితగదను బహుఘన
ముగ - అలుక -

(3) సరసముగను ఆ - సరసిజముఖిపై - మరులు జెందినాడే - నే
సరసజేరి కరుణ జూడుమనినను - విరసమాడినాడే
తరుణి వినవె మును సురతము నేలిన - సరణి మరచినాడే యీ
మరుడు శరము చురచురమని గురుతుగ - నురము నొరయబరపె తరమ
మరిమరి-అలుక

2. అనుప్రాసము

ఆసావేరి - ఆది

1. ఏరా - ఏరామా బోధించ - రారా రారాపూ సేయవ
ద్దూరా - దూరాన నిలుచుందురా - నీమదిన
చేరా - చేరారా వేమందురా

2. నిన్నానిన్నాడుకొన్నది - విన్నా - విన్నాణగత్తెను
కొన్నా - కొన్నా పతకమిత్తురా - నేదానికంటె
చిన్నా - చిన్నా పనులు మెత్తురా

3. వద్దా - వద్దారావు వొక్క
పొద్దా - పొద్దాయినే యిట్లా
కద్దా - కద్దా చెలిమితో ఆటలు యేవేళ యిదే
రద్దా - రద్దాయె నీమాటలు

4. కానీ - కానిబోటీ సతమానీ మానీతి నీదయ
రానీ - రానీదుమాయింటికి; అదిచెప్పినట్ల
పోనీ - పోనీదుపొరుగింటికి

5. ఇందు - ఇందుముఖుల మెచ్చు - ముందుముందు గాగూడి నా
యందు - యెందుకింతకోపమూ - వేణుగోపాల
సందు సందుల ప్రస్తావము

ద్విప్రాస - త్రిప్రాస - చతుష్ప్రాసాది ప్రాసచిత్రములు చాలాఉన్నవి. ఇంతేకాక మందులపేర్లు - మానులపేర్లు - ఊళ్ళపేర్లు - ఔషధములపేర్లు ఆభరణముల పేర్లు

రాగాల పేర్లు - మొదలైనవి ఇమిడేట్లు పాటలు కూర్చినారు. ఈచిత్రాలన్నీ ప్రబంధాలలో కవీశ్వరులు అనుసరించే ప్రౌఢమార్గాలు. పాటలలో విపులంగా ఈలాటివి కూర్చిన కవి సారంగపాణిగా రొక్కరే కనబడుతూఉన్నారు. దాఖలా చూపాం చిన్నచిన్న ముక్కలుమాత్రం.

1. కొమ్మల పదం

కోమలాంగికి బోవిడిచె పెట్టెల పగలగొట్టిమ్మా - నేనా
వామాక్షివలె నేర్పరిన విభుని గెలువంగకొమ్మా
కనులజూచేనంటే దాటిరాడె దానిక డపకొమ్మా - ఆ
కనకాంగినిజూచి నేర్చుకొన్నాడింత కలివికొమ్మా

2. మందుల పదం

ఎలనాగకేసరా లిచ్చితే నీకేమి
చలపట్టియిపుడు రచ్చలకు కాచుకొన్నావు
పలుమారు వేణుగోపాలా వేరుసేయక
కలిసియుందామనుచు బిలువ వేరుజువుగా

3. మానుల పదము

పంతమున అటుదిక్కు పదినాళ్లు పోకమాను
ఇంతికిచ్చేవుసుమీ ఈతమాను
సుంతమనసు గట్టిచేసి సుదతికెమ్మో విప్మాను
చెంతదీయకది మహాజెగడగొండి - మాను etc.

4. ఊళ్ళ పదము

కోరియుంటినే గోలకొండగ యెంతోనమ్మి
ఈ రేడుజగము లెరుగ నిదివరకు
కూరిమితోనన్ను చిత్రకూటమున కూడిపాడి
పేరుచెప్పి నాముందర ఆ పెనుగొండగ భూషించెను.

5. ఔషధముల పేళ్ళు

పాలతినె మోము సంపూర్ణచంద్రోదయము
అలకాళిరుచి వినోదాంజనంబు
దాని మృదుమధురోక్తి ద్రాక్షాదిరసమెంచ
మానవతిచూపు మన్మథబాణసమము etc.

6. ఆభరణముల పేర్లు

కమ్మలుదానికి వ్రాయ కారణమేమన్నఁ దుస
సమ్మతిగాకుంటే పో చీపొమ్మనె నిరాకరించి etc.

ఈ ప్రథమభాగంలో లోకోక్తులు చాలా చాలా మార్చినారు.

1. మంచిది కానీలేవే
2. అందరానిపండ్లకాశించినట్లు
3. చెడ్డచేని కింటివద్దు పొంగలిచేసినట్లు
4. ఉడుముపోతే పోయినది చై మాత్రము విడిచితే చాలు
5. ఉసురువుంటే వుప్పుమ్మకోగలము
6. మాసిన మత్స్యమువలె
7. పదివేలు తిట్టితివి
8. అడుగులోనె అరవై యూరు గుణములైతే
9. గడినీరి తిరిగితే
10. ఇంటింటికి చంద్రుడవు
11. ఆడకాడను నీబాడలు బయలాయె
12. కొండకేగేవాని మొలను కొడవలి చెక్కినట్లాయెను

ఇత్యాదులు వందలకొద్దీ ఉన్నవి.

కేవల రసభావప్రకటనకై యే పుట్టినపదరచనలలో ఈలాంటి శబ్దచిత్రాలు ప్రదర్శించడంవల్ల ఉద్దేశభంగం కలుగుతుంది. కాని, ఆ కాలంలో ప్రబంధకవులంతా శబ్దచిత్ర ప్రధానమైన పద్యరచనలే చేస్తూ ఉన్నందువల్లను, పద్యకవులకన్న పదకవులము మేమున్నీసిపోతామా అని తమ మహత్తు నిలబెట్టుకోవడానికి సారంగపాణిగారు ఈలాంటిరచనలు చేసి తమ పాండిత్యం చూపించినట్లు కనబడుతుంది. ఈ "ణత్వం"

బాధిస్తూ ఉండబట్టే కాబోలు ద్వితీయ తృతీయభాగాలు రచించి తాను సహజకవినని లోకానికి ఋజువు చేసినారు.

శబ్ద చిత్రాలకు కక్కుర్తిపడని పాటలుకూడా కొన్ని ప్రథమభాగంలో కలవు. అవి చాలా మనోహరంగా ఉంటాయి. చూదాం.

1. కలనైన పరసతుల కన్నులజూడని
చెలువుడే నీపాద సేవ చేసేనంటే
వలదు పొమ్మనుచు అవలిమోమైతివి
చెలియరో నీకింత చెల్లుబడి యేమే

2. బొమ్మలపెండ్లికి – కొమ్మలు వేగమె
రమ్మన నే సంతోషమ్మనబోవగ
సొమ్ములివిగో కైకొమ్మని చెంతకు
రమ్మని సుంత ముద్దిమ్మని కొసరేవు.

3. అతివరో నామాట లాలకించీ ననుచు
నపుడు చిలుకను బెంచెనే – నన్ను
మతిలోన దలచునని ప్రతిమనొక్కటి చిత్ర
పటములో వ్రాయించెనే –

వ్రతమనుచు వగకాని – వద్దికే చెలుల రా
వద్దనుచు చాటించెనే, యింత
మితిమీరి యిద్దరికి మిత్రభేదము చేసి
మేలు మెచ్చులు గాంచెనే

ఈలాటి చాలా మనోహరమైన రచనలు కూడా ప్రథమభాగములో కలవు.

గేయకవిసార్వభౌముడగు త్యాగయ్యగారే కేవల పరాడంబరంకోసం కొన్ని రచనలు చేసినప్పుడు, తక్కినవారిమాట లెక్కయేమి? ఏగతి రచియించినైన సమకాలము వారలు మెచ్చరేకదా – అన్నభయం ప్రతి కవికీ సహజమేగదా. కాబట్టి సహజ కవులు లోకం మెప్పుకోసం కొన్ని రచనలు చేస్తూ అది తమమతం కాదని రుజువు చేయడానికి సహజ రచనలుకూడా చేస్తారు. కావలిస్తే త్యాగయ్యగారి సంగతి చూదాం.

1. ఉపచారము చేసేవారున్నారని మరువకురా
2. ఊరకే కల్గునా రాముని భక్తి
3. ఎవరికై యవతార మెత్తితివో
4. ఎంతని నే వర్ణింతును శబరిభాగ్యము
5. ఎంతరానీ — తనకెంతపోనీ నీచెంతవిడువ శ్రీరామా
6. కొలువైయున్నాడే — కోదండపాణి

అని యీలాంటి మధురమైన వాక్యాలు రచించిన త్యాగయ్యగారే

1. తరుణారుణనిభచరణా — సురమదహరణా
   శ్రితజనకరుణాద్భుతసుగుణ — అనిన్నీ

2. భవసారస భవమానస — భవ నామొరవినురా
   శశిశోభిత శరభాపతిమిరభాస్కర సుగుణా — అనిన్నీ

3. లాలిలాలీయనీ యూచేరా, వన
   మాలిమాలీయని యూచేరా
   రామరామాయని పాడేర — రిపు
   భీమభీమాయని పాడేరా
   దేవదేవాయని పిలచేరా, భూ
   దేవదేవాయని తలచేరా

అనిన్నీ చెప్పినరచనలలో ఏమిరసపుష్టికలదు? ఇవి సమకాలికుల మొగము తుడుచుటకు మాత్రమే కాక మరేమి?

## ప్రథమ చతుర్థభాగములలో సారంగపాణిభాష

సారంగపాణిగారు తమ పదరచనలలో వాడుక చేసినభాష ఆంధ్రభాషాచరిత్రలో చాలా ప్రధానమైన విషయమే. అందులో సంగతులు చాలావరకు అందరికీ తెలిసినవే అయినా. సందర్భం కలుపుకోవడానికి తిరిగి చెప్పవలసివచ్చినట్లు తోచినందున చెప్పుతూఉన్నాను. నూతనత్వము లేకపోయినందుకు క్షమించండి.

మ. రా. రా. గిడుగు రామమూర్తి పంతులుగారు భాషకు క్రొత్తగా శాసనముగాని, అనుశాసనముగాని చేసినవారుకారు. సనాతనమైన సత్సంప్రదాయము కృత్రిమపండి

తుల హస్తాలలో పడి మాటుపడి పోయిఉంటే, కృత్రిమపండితులను దూరముగా తరిమివేసి, మాటుపడిపోయిన ఆ సనాతన సంప్రదాయాన్ని తిరిగీ వెలుగులోనికి తీసుకొనివచ్చినారు. గీతామతమును కృష్ణుడు క్రొత్తగా సృష్టిచేసి అర్జునుడికి చెప్ప లేదు. సనాతనమైన ఒక సత్సంప్రదాయమునే, ధర్మసమ్మూఢచేతస్కుడైన అర్జునుడికి ఉపదేశంచేసి, అతనిని కార్యశూరుణ్ణిగా చేసినాడు. ఆవిధముగానే రామమూర్తి పంతులుగారున్నూ, సనాతనమైన ఒక సత్సంప్రదాయమును ధర్మసమ్మూఢచేతస్కులైన గ్రంథకర్తలకు ఉపదేశముచేసి వారిని కార్యశూరులనుగా చేసినారు. కాబట్టి గీతావిషయమున శ్రీకృష్ణునికి ఈయవలసిన స్థానము భాషావిషయమున శ్రీరామమూర్తి పంతులుగారికి ఈయవలసిఉన్నది. కృత్రిమాంధ్రపండితులకు ఆచార్యులైనవారు చిన్నయాచార్యులుగారు. ఈచిన్నయ్యవారు చిన్నవారికి వ్రాసిన వ్యాకరణము చాలదని గుర్తించే, బహుజనామోదము సంపాదించవలసిన యొక పెద్దయ్యవారు పెద్దవ్యాకరణము వ్రాసినారు. ఈచిన్నయ్యవారున్ను, పెద్దయ్యవారున్నూకూడా అయ్యవార్లే కావడంచేత, వారి ఉపదేశాలే పాఠశాలలలో స్థిరపడి, పాకశాలలవరకూ పోయి చివరకు పానశాలలలోకికూడా ప్రాకి, అపైని, పాతశాలలో ఉన్నవారికి కూడా మతసంస్కారము కలిగించినవి. పాఠశాలలలో ప్రవేశించి, ఈచిన్నయ్యవారిమతము ఎంత ప్రమాదము కలిగించినా, ఈనూతన మతస్వీకారము చేయకుండా ఉండినవారు పాఠశాలలో ప్రవేశించకుండా పాతశాలలోనే ఉండిపోయిన వారు కొందరు చిన్నయ్యవారి సమకాలికులే ఉన్నారు.

వారిలో మొదటివారు బ్రౌనుపండితులు. జూలూరి, రావిపాటి, దేవరాజు ప్రముఖులగు పండితుల సహాయమువల్ల బ్రౌనుపండితుడు సనాతన సంప్రదాయమును నిలబెట్టినాడు. కాని అతడు శ్వేతాచార్యుడు కావడంచేత స్వసమ్మతుడు కాలేక పోయినాడు. త్యాగయ్యవారు చిన్నయ్యవారిని లక్ష్యముచేయలేదు గాని, ఆయన తమిళాచార్యుడు కావడంచేతనున్ను ఆయన పదాలు పానశాలలోకి ప్రాకినా పాఠశాలలలోకి ప్రాకవలసిన ఆగత్యం లేకపోవడముచేతనున్ను, అవి యెవరికీనజరు కలిగించడంలేదు. సారంగపాణిగారు కూడా చిన్నయగారితో సమకాలికులేగాని, వారి పదాలు దేవాలయములలోను, అక్షయపాత్రలలోను, ముసలమ్మల నోళ్ళలోను, ఉండిపోవడంచేత అవికూడా పాఠశాలలలో ప్రవేశించలేదు. కాబట్టి చిన్నయవారి పెద్దయ్యవారి మతాలే నిలిచిపోయి, ఇతరమతాలన్నిటినీ అణిచివేసినవి. అయితే, అణచివేతలెప్పుడూ శాశ్వతంకావు. తిరుగుబాటు ఎప్పటికైనా తప్పదు. ఆ తిరుగుబాటు కొక్కొండవారిలో మొలకెత్తి, వీరేశలింగంగారిలో కొంతతలయెత్తి, ఆ వేంకట

రాయశాస్త్రిగారిలో ఆటూ ఇటూ ఊగులాడి, అప్పారావుగారిలో వేళ్ళూదన్ని, రామమూర్తి పంతులుగారిలో పల్లవించి, పుష్పించి, ఫలించినది. కొక్కొండ వారిలో దాగరంతమేర ఏదో కనబడ్డ మబ్బు, శ్రీరామమూర్తిపంతులుగారి రూపాన కాల మేఘమై మహావర్షము కురిసి, మురికి కాలువ లన్నిటినీ శుభ్రపరచినది. శ్రీరామమూర్తి పంతులుగారు పునరుద్ధరించిన ఈసనాతన సత్సంప్రదాయమునకు, ఆచార్యులలో సారంగపాణిగారొకరు. బ్రౌనుపండితుల పద్ధతి శ్వేతమునులలో మాత్రమే నిలిచి పోయినది. తాగయ్యవారి పద్ధతి గాయకులలోనే నిలిచిపోయినది. అందులోనూ, అరవవారి నోళ్ళలోపడి, మరీపాడయిపోయినది. సారంగపాణిగారి పద్ధతిమాత్రం దేవాలయములు, బిచ్చగాండ్రు, ముసలమ్మలలోకికూడా ప్రాకి సర్వజనామోదమును పొందినది. ఇక వారిపద్ధతి విచారిద్దాము.

మూడవభాగంలో వారనుసరించిన మార్గము ఇదివరకే కొంత తెలుసుకొన్నాం. దానికి తాత్కాలికామోదమున్నా సార్వకాలిక సార్వదేశికామోదము లేదనికూడా తెలుసుకొన్నాం. ఆయన మొదటి మూడవ భాగాలలో అనుసరించిన పద్ధతి వేరుగా ఉన్నది.

శ్రీనాధునియందు బీజవత్తుగావున్న యొకపద్ధతి శ్రీకృష్ణదేవరాయలయందు వృద్ధిపొంది రఘునాధరాయలలో విజృంభించినది, ఈపద్ధతినే సారంగపాణిగారు అనుసరించినారు. దీనిని విపులీకరించి చెప్తాను. శాఖాచంక్రమణముగాని, చర్వితచర్వణముగాని, పాఠకులు ఉన్నప్పటికీ క్షమించవలసినదని ప్రార్థన.

ఆంధ్ర సామ్రాజ్యము మగధసామ్రాజ్యాన్ని అక్రమించిన ప్రధమ శతాబ్దానికే ప్రథమాంధ్రవ్యాకరణం పుట్టిఉండాలి.

దరశార్ఙపిప్పలిదశాంకుశపన్నగ సన్నిభాఃక్రమాత్ పరుషాః అనిన్నీ పంచవర్గాదయో వర్ణాః శంఖశార్ఙాది సన్నిభాః అనిన్నీ వర్ణతత్త్వములోనూ.

> "వాతః, అద్యః క్రియాసు భూతార్థద్యోతినమాద్యగం వినాసర్వః
> సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః"

అని ఇతరత్రాను, చెప్పిన సూత్రాలు అతిప్రాచీనములు కాకతప్పదు. నన్నయభట్టుగారు తన కాలానికి ఉండిన కొద్దిసూత్రాలకు కాలోచితంగా మరికొన్ని సూత్రాలు కలిపి చిన్నవ్యాకరణం చేశారు. అధర్వణాచార్యులుగారుకూడా అలాగే చేశారు.

బాలసరస్వతిగారికి నన్నయభట్టుగారి పాతతాటాకులేవో దొరికితే, దాని కొకకథ కల్పించి ప్రాచీనత్వముతో పాటు పవిత్రత్వముకూడా కలిగించి, తనవికూడా కొన్నిసూత్రాలు తగిలించి అక్కడక్కడ అధర్వణాచార్యులుగారిని స్మరిస్తూ ఒక వ్యాఖ్యానరూపమైన వ్యాకరణం నిర్మించినారు. నీకన్న నేనేమి తక్కువవాడనా అని అహోబలపతిగారు బాలసరస్వతిగారి సూత్రాలకే తిరిగీ వ్యాఖ్యానము వ్రాసి, అధర్వణుని ఎక్కువగా స్మరించడమే గాకుండా నన్నయ్యగారి సూత్రములలో కలప డానికి వీలులేక పోవడంచేత కొన్ని కొత్త కారికలుకల్పించి అధర్వణుడికి అంటగట్టి నారు. వీరిద్దరినీమించినవారు మధ్యనుండిన కాకుమారి వారు. వీరు బాలసరస్వతిగారు ఉపపాదించినతీర్మానాన్ని ప్రతిపాదించి తమ ప్రజ్ఞనంతా ఛందోభాగంలో చూపి నారు. ఇక్కడికి లక్షణాలుస్థిరపడ్డవి. ఇదంతా కావ్యభాషానుశాసనమే అనగా పద్య కావ్యాలకే అన్నమాట. ఈలక్షణాలు ఈలాగుఉంటూ ఉండగా, ఈలక్షణాలు చాల వనిపిస్తూ నన్నయభట్టుగారు భారతం ఆరంభించినది మొదలుకొని, పోగా పోగా లక్ష్యస్వరూపమైన కావ్యభాష స్థిరపడ్డది. కాని ఈ కావ్యభాషకుకలిగిన స్థైర్యము ప్రవాహనిత్యత్వముఃవంటిదే ఐనది. ఈస్థైర్యానికి భంగం కలిగించడానికి సాహసించినవాడు శ్రీనాధుడు. తరువాత పెద్దచేయి శ్రీకృష్ణదేవరాయలు. కాని దీనిలో బిరుదు వేసుకొన్నవాడు చేమకూరవాడు. ఇక్కడికి అప్పకవిగారి అహోబల పతిగారి కాలం వచ్చింది. అనగా అప్పకవి అహోబలపతిగార్లు తాళ్ళువేసి జారిపో కుండా లక్షణాలను బిగించిన కాలంలోనే ఆలక్షణాలు ఒకులుచేసినవాళ్ళుకూడా పుట్టి నారన్నమాట. ఈలక్షణాలగొడవంతా కావ్యాలకే. కావ్యేతర వాఙ్మయము - అనగా కథలు, వ్యాఖ్యానాలు, శాస్త్రములు, చరిత్రములు ఈ మొదలైనవన్నీ స్వచ్ఛమైన వ్యవహారభాషలోనే పుట్టుతూఉండేవి. పండితులుకూడా అవి ఆలాగే వ్రాసుకొని చదువుతూ ఉండేవారు. ఇంకా రెండురకాలు మిగిలిపోయినవి. అవి కావ్యాలూ కావు కావ్యేతరాలూ కావు. అవి శతకాలు, పాటలు. శతకాలు, పాటలు కావ్యాలలో చేరలేదు. కాని కావ్యేతరాలు కూడా కావు.

ఇప్పటి ఖండకావ్యాలకూ వీటికీ మేనత్తమేనమామపిల్లలరూపేణ సంబంధం ఉన్నట్టు కనిపిస్తుంది. కాబట్టి కొన్ని పోలికలుకూడా ఉన్నవి. ఇవి మధ్యరకానివి కాబట్టీ, వీటిలో కావ్యభాషంత బిగిగా ఉండనటువంటివీన్నీ, కావ్యేతరభాషంత వదులుగా ఉండనటువంటివీన్నీ, ఒకనడిమిరకంభాష ఉంటుంది. అందులో. శతకాలు కావ్యాల కంటే వదులుగాఉండి, ఎక్కువవాడుకమాటలు కలిగిఉంటాయి. పాటలు వచనాల కంటే బిగువుగాఉండి, ఎక్కువ ప్రాచీనాంధ్ర గ్రంథములలోని మాటలు కలిగి

ఉంటాయి. అనగా, నా ఉద్దేశం, శతకాలలో వాడుక మాటలు నూటికి 50 వంతుననున్నూ, పాటలలో వాడుక మాటలు నూటికి 75 వంతుననున్నూ ఉంటవి. ఇప్పటికి తేలిన విషయ మేమంటే, అప్పకవి, అహోబలపతిగార్లు లక్షణాలను ఒకప్రక్క స్థిరపరచడానికి ప్రయత్నిస్తూఉన్న రోజులలోనే, కావ్య భాషలో నూటికి 25 వంతున వాడుకమాటలున్నూ, శతకాలలో నూటికి 50 వంతు వాడుక మాటలున్నూ. పాటలలో నూటికి 75 వంతు వాడుకమాటలున్నూ, వచన రచనలలో నూటికి నూరు వాడుకమాటలున్నూ, అట ఉండేవన్నమాట. ఇక, అప్పకవి, అహోబలపతిగార్ల అనుశాసనం ఎవరికోసమో బోధపడలేదు.

ఈసంప్రదాయాన్ని అనుసరించే త్యాగయ్యగారును, సారంగపాణిగారును తమ ప్రథమ చతుర్థభాగాలలోను, గేయరచనచేసినారు. ఈ సంప్రదాయాన్ని అనుసరించే బ్రౌనుపండితులు వచనరచనకు మార్గంచూపించినారు. త్యాగయ్య, బ్రౌను, సారంగ పాణిగార్ల కాలంలోనే ఇంగ్లీషు పాఠశాలలు వచ్చినవి. వాటిలో చెప్పడానికి వచన గ్రంథాలు కావలసివచ్చింది. వాటిని నిర్ణయించే అధికారం చిన్నయసూరిగారి చేతిలో పడ్డది. ఆయన అరవదేశపు తెనుగుపండితుడు కావడంచేత, తెలుగుదేశంలోఉన్న తెలుగు మాట్లాడఎరిగినవాడు కాడుగనుక ప్రబంధాలలో ఉన్నవచనాలే వచనరచన అనుకొని, వచనరచనా సంప్రదాయం తెలుసుకోలేక, కావ్యభాషకు అప్పకవి అహోబలపతులు నిర్ణయించినపద్ధతే వచనరచనకు కూడా నిర్ణయించి, నీతిచంద్రిక లక్ష్యప్రాయంగావ్రాసి, ఆచార్యత్వము సార్థకం చేసుకొన్నాడు. దీనినే సీతా రామాచార్యులుగారు మరికొంత విపులముచేసి, తమప్రౌఢత్వమును స్థిరపరచు కొన్నారు. పూర్వపు నన్నయ అథర్వణులవలె, మధ్యకాలపు అప్పకవి, అహోబల పతులవలె, ఇప్పటిచిన్నయ్య, సీతారామాచార్యులు వ్యాకరణాచార్యులైనారు. బ్రౌనుదొరగారి పద్ధతి మూలబడ్డది. త్యాగయ్య సారంగపాణులపద్ధతి అడుగంటింది. కావ్యాలు, శతకాలు, పాటలు, కథలు, వంటపాటలు, కల్లుపాటలు, కామమ్మ కథలు – అన్నీ చిన్నయ్యవారిపాత్రలో పోసి, శుద్ధిచేసి, పవిత్రములుగా చేసినవే. వెనక, కవులకు స్వేచ్ఛఉండేది. సభలలో ఎవరో ఏదోఆక్షేపణచేస్తే ఎవడో తలమాసిన పూర్వకవిప్రయోగం చూపించి నోరుమూయించేవారు. కాని చిన్నయ్య గారి అనుశాసనం చాలాగొప్పది. అది తాతాచార్యులగారి ముద్ర. యూనివర్సిటీ వారిచేతికి వచ్చింది. తప్పువ్రాస్తే అడిగేవాడు, సమాధానం చెప్పేవాడులేడు. పరీక్షలో ఫైలు కావడమే. అందుచేత ముద్రదట్టంగా పడవలసినదే. కాబట్టి ఇంగ్లీషు చదువుకొన్నవారు ఎక్కువ అయినకొద్దీ చిన్నయగారిబలము ఎక్కువ అయినది.

ఇంగ్లీషు చదువుకొన్నవారే మార్గదర్శులు అయినారు కాబట్టి, ఇంగ్లీషురాని బోడి బాపనపండితులు కూడా ఇంగ్లీషురాకపోవడం తమకొక లోపమన్న భ్రాంతిచే ఏ విధముగా తెలిసీ తెలియని ఇంగ్లీషుపదాలు ప్రయోగిస్తూ పవిత్రమైనామని అనుకొంటూ ఉండేవారో, ఆ విధముగానే చిన్నయ్యగారి వ్యాకరణమే ఉత్తరాలలోకి సభలలోకి కూడా దింపి పవిత్రులైనామనుకొన్నారు. కాని ఇదివరకే చెప్పినట్టుగా ఒకపక్క బిగించికొన్నామని కొక్కొండ వేదము ప్రముఖమనుకొనుచుండిన కచ్చ మరొకప్రక్కనుండి విడిపోనారంభించినది. చివరకు శ్రీరామమూర్తి పంతులుగారు ఈ బండారమంతా బయలుచేసి ఇక్కడికిది చాలును తిరిగి వెనకకు పదండని వుర్రవాళ్ళను వెనకకు త్రిప్పి, మళ్లీ సరియైన త్రోవలో పెట్టినారు. కాబట్టి, నేటి వ్యవహార రచనలన్నీ సనాతనసంప్రదాయానికి ఎంతమాత్రము విరుద్ధములు కావు. నడుమవచ్చిన చిన్నయ్యగారి మతమే సంప్రదాయవిరుద్ధమైనది.

ఈ సంగతి యూనివర్సిటీవారు ఇంకా తెలుసుకోలేకపోవడానికి కారణమేమో.

చిన్నయ్యసూరిగారికి సమకాలికులై చిన్నయ్యసూరిగారిని లక్ష్యము చేయనివారిలో సారంగపాణిగారొకరని చెప్పినాము. వీరు ప్రథమచతుర్థ భాగములలో, త్యాగయ్య వరకూ వచ్చిన గేయకవిత్వ సంప్రదాయము ననుసరించి, నూటికి 75 పాళ్ళు వాడుక మాటలువేసి పాటలన్నీ రచించినారని చెప్పినాము.

చతుర్థభాగపు జాతీయరచనలలో వారికాలము నాటి నీచపాత్రలభాషలో రచించినారని చెప్పినాము. ద్వితీయభాగపు దేశీయరచనలలో శిష్టజనవ్యవహార సిద్ధమైన భాష ఉపయోగించినారని వ్రాసినాము. ఈభాగమంతా మధురమై, రసవంతమై, పాత్రోచితమై, సర్వవిధముల శ్లాఘాపాత్రమై యున్నది. సారంగపాణిగారు ద్వితీయభాగంలో అనుసరించినభాష నేటి రచనలకు లక్ష్యప్రాయమై యున్నది. కాబట్టి మరి రెండు మాత్రమే మళ్ళీ మచ్చు చూదాము.

రాగము - అపరూపము - చాపుతాళము

పల్లవి - అట్లాగే కావలె దానికి - హైశ్యావాసు - నాడు

అను...కొట్లాడిం దెరుగవటే - వేణు - గోపాలుని పిలువవద్దంటే

చర...1. వడ్డికి వేయమని రూకలు - గుడ్డతో గట్టియ్యగానే
సొడ్డు నెత్తిన వేసి యురికె - జిడ్డు మొన్నటితోనే విడిచె - అ.

2. కలభూషణములన్నీ ముడిచి - తలమాడున వుంచుకొంటే
మెలకవగా అంటుకొనీ - జరిగె చిలుము నిన్నటితోనే విడచె

3. పండుకొనేవుండి - ప్రక్కలో పయిపనులన్నీ చక్కబెట్టి
కుండలు చట్లన్ని జఅగడిగి - ఉండింది పండింది ఊడ్చుకొపోయె-అ.

రాగము - కన్నడ - ఆదితాళము

పల్లవి - ఒకధూపములేదే - నీసాక్షిగ - ఒట్టిపైబూటకమే నే -యేమో

అను...ఇక మందర ముత్యాలకుళ్ళాయి యెన్నడో పెట్టేనట - ఇప్పుడు -

చర...1. కాననినాసవతులు ఊళ్ళో - కల్పించేందుకు దొడ్డాశ్చర్యమ
శానావున్నది రామాయణమిది-లోనిగుట్టు పెరుమాళ్ళకు తెలివిడి

2. గుడుగుడుఆలోచనలే కాని - కోమలి నే నొక పోణిమి యెరుంగను;
అడిగి తెలుసుకొని పిమ్మట కాదను - తడకుదాసరిప్రతిష్ఠవంటిది

3. ఏణాక్షిరో - యీసాంబ్రాజ్యానికి - యేమిటికే గాంధారితనాలు;
వేణుగోపాలుడు ననుగూడి - వేళ్లవుంగరాలిచ్చేననేడు - ఒకధూ

రాగము - కేదారగౌళ - ఆదితాళము

పల్లవి - ముసిలిబడుగుమీద యెంతమోహమే - ముదితరో నీకు - మదిలో

అను...అసమశరుడనుచు వుప్పొంగితివో - అన్నిటికీ కాసుగదా దొడ్డది

చర...1. తల మొల కడవెళ్ళ నెరిసిపోయె - దగ్గదగ్గ హీనస్వరమాయె
పిలిచినాను చెవివినరాదాయె - బలము ఉడిగి తప్పటడులాయె

2. రాత్రైతే - రేచీకటి కదలను - రమణీ నీబిగికౌగిలి వదలడు;
మూతిమీదబట్ట యేమారడు - ముష్టిచకరికైనా వేయనీయడు ముసిలి
బడుగు...

ఈలాంటి రచనలలో భావాలు ఎంత స్వభావసిద్ధంగా ఉన్నవో భాష అంత సహజంగా ఉన్నది. ఈభావాలు మనుష్యతత్వంలో మారకుండా చాలా కాలం ఉండవలసినవే. ఈభాషకూడా చాలా కాలం మారకుండా మనోహరంగా ఉంటుంది. శ్రీరామమూర్తి పంతులుగారు తమ వాదమును ఆరంభించినప్పుడు వారి భావవీధిలో ఉన్నది ఈలాటి భాషయే. శ్రీరామమూర్తిగారు సారంగపాణి పదాలు ఎరుగుదురో ఎరగరో నేను చెప్పలేను. కాని సారంగపాణిగారు ద్వితీయభాగ రచనలో లక్ష్య రూపంగా చూపిన భాషయున్ను రామమూర్తిగారు వాదనలలో స్థిరపరిచిన భాషయున్ను ఒక్కటే. కాబట్టి. సారంగపాణిగారిలోఉన్న నూతనత్వానికిన్నీ. రామమూర్తిగారిలోఉన్న పాచీనత్వానికిన్నీ మనము ఆనందించవలెను.

సారంగపాణిగారి పదములను విపులమైన పీఠికతో తిరిగీ అచ్చువేయవలసి ఉన్నది. ఈమనోహర రచన లోకంలో శాశ్వతంగా ఉండవలసి ఉన్నది. అలాగే క్షేత్రయ్య పదాలన్నీ అచ్చువేయవలసిఉన్నది. క్షేత్రయ్యాగారు రచించిన పదముల సంఖ్యను గూర్చి వారే యీ క్రిందివిధముగా చెప్పకొన్నారు.

## మే రు వు ప ద ము

యదుకుల కాంభోజి – ఆదితాళం

పల్లవి – వేడుకతో నడుకొన్న విటరాయడు
దేడుమూడుతరములనుండి – యెందున్న కంజొచట

అను...కూడుకొని – మువ్వగోపాలుడు – కృపగల్గ నావిభుడు

చర...1. మధుర తిరుమలేంద్రుడు మంచిబహుమాన మొసగి
యెదుటకూర్చుండుమని – యెన్నికలిమ్మనగనె
యిదుగో రెండువేలపదము లెంచుకొమ్మనగ
చదురు మీదనున్న సామికి సంతోషమింతంతగాదె

2. హాళిమీర – తంజావూరియచ్యుతవిజయ రాఘువేంద్రుని
సాలుమనుష్యుల వెంబడి సరస పొడగాంచి – చలువచప్పరములో
చక్కగా వెయిపదములు పలుకరించగానె–బహుమానమిప్పించె నావేళ

3. గోలుకొండ పహదుషాకోక వేము విలిచి – తోళసిమూర్తివారు
పిలిచినవేళ – షెలయ మువ్వగోపాలుడు వెయ్యిన్నెనూరుపదములు
నలువదిదినములలోగా ననుగలిసి వినిపించెనే – వెడుక

క్షేత్రయ్యగారు రచించినవి వేలకొద్దీ పదములు కలవని వారిమాటలవల్లనే తేలుతూ ఉన్నది. ఇవేవీ ఎక్కడా కానబడవు. నావద్ద – నూరు నూటయేబది మాత్రమే కలవు. ఇవి ఆంధ్రసారస్వతానికి నిజమైన ఆభరణాలు. ఈలాగే ఇతర గేయకారకులైన ఘట్టిపల్లివారు బొల్లవరపువారు శోభనగిరివారు వీరభద్రయ్యగారు తాళ్ళపాకవారు మాతృభూతేశ్వరులవారు జటపల్లివారు ఇనుకొండవారు శివరామపురమువారు మెరటూరివారు కోసలపురివారు దీక్షితులవారు శ్యామశాస్త్రులవారు సుబ్బరాయశాస్త్రులవారు వీణకుప్పయ్యగారు ఈ మొదలగు గేయకావ్యకర్తల గ్రంథాలన్నీ అచ్చువేసి ప్రాచీనాంధ్రసారస్వతములో ఉన్న నూతనత్వాను చూపించి ప్రబంధవాఙ్మయమువల్ల కలిగిన మార్పున్ను చిన్నయసూరిగారివల్ల కలిగినహానిన్నీ లోకమునకు తెలియచూపి నిజమైన ఆంధ్ర సంప్రదాయాన్ని లోకంలో స్థిరం చేయవలసినదనిన్నీ అనుసరించవలసినదనిన్నీ ప్రార్థిస్తూఉన్నాను. సారంగపాణిగారి కీర్తి లోకంలో ప్రకాశించేటట్టు చేయవలసినదని ఆంధ్రులందరినీ ప్రార్థిస్తూ ఉన్నారు. సత్యము జయించునని విశ్వసిస్తూ ఉన్నాను.

# సారంగపాణి పదములు

## ప్రథమ భాగము - శృంగారము

### 1. కళ్యాణి - ఆది

రాగముల పేర్లుగల పదము

పల్లవి - ఈ సీమల హరిణాక్షులవలె గా - దీ మోహనాంగి

అను...కాశీపురినుండి వచ్చిన దీ - కల్యాణి వేణుగోపాల॥ ॥ఈ॥

కన్నడ సేయక నీ దరబారు గాచియున్నది నాటనుండి
అన్నిమొరగనని యీ హరిపాదము - లానబెట్టెరా
వన్నెలాడి బహుళా నాతో దన - వద్దికీక్షణమె తోడితెమ్మనె
నెన్న నొకరితరముగాదు సామజ - యానకేవి గుజ్జరిపడుచనదగు॥ ॥ఈ॥

పంచమశ్రుతిని తంబుర మీటి - సంచుగాపాడి సారంగ
పంచిపెట్టెనటుల వినికిచేసె ప్రౌఢనాయకిరా
వంచన యింతలేకను బలుమారు - వనిత గౌరీపూజ సేయుచున్నది
పంచసాయకుని సేనల రాకకు - భయము జెందనదె వచ్చెవరాళి॥ ॥ఈ॥

శ్రీమీఱి చెలువొందుచున్నది - రామానుజని రంగు మీఱి
కామించి వచ్చెననుచు నీ విం - కా బిగుదు లేరా
ఆ మానిని కెంతో నీపై అసా వేరే పని తోచదు
నామాట విని యేలుకోర అభినయము నాట్యమతివసేత లలితము॥ ॥ఈ॥

## 2. కళ్యాణి - ఆది

స్వరస్థానములుగల పదము

పల్లవి - దాని ప్రాయము పదారేండ్లు నీ - దాని నేలుకోరా

అను...సానిధా పనికి హొంతకారి-సామి వేణుగోపాలరాయ॥దాని॥

సారిరాగా మాపటివేళ - దారిని గాంచి
నీరూప మనిశము మది దలచుచు - నిదుర గానదురా
నీరాకే కోరి సన్నిధి - నీరీతిగాను గాచినదిరా
దారిగా మాటాడవు నీదయ - దాని మోచుట నీతిగాదు అల॥ ॥దాని॥

మగధ పాంచాల దేశముల గల - మగువలైన మాగరితెకు సరిగారు
మగని పేరడుగ మాధవుండను - మదిరాక్షులతోను
మగధాల పతకము పదివేలది - మచ్చకంటి గురుతిచ్చెనుకోరా
సగము రేయిదాకా పదము బాడి-నారె మెప్పించు నిలువరమ్ముగ ॥దాని॥

మాటిమాటికి సరిగా మారుడు - మర్మములగాంచి సాయకమ్ముల
నాటివప్పక నిర్దయమతిని - ధాటినేయుగాను
పాటలాధరి సగ మాయగద - పాదములకు దండముఁ బెట్టెగా
సాటిలేని సమరతుల గూడరా - సామి వేణుగోపాలరాయ॥ ॥దాని॥

## 3. సావేరి - చాపు

కొమ్మల పేర్లుగల పదము

తరుణి కేమని దారబోసివచ్చెనె మన - దంతికొమ్మా ఎంతో
మురిపెము లేక నే యిచ్చిన మరువంపు - మొలక కొమ్మ॥
భామ కిమ్మనిపంపె భ్రమరముచే పూల - బంతికొమ్మా అల్ల
సామజయానకు సరిలేదన్నది వక్క-సారె కొమ్మా॥
కోమలాంగికి చూడ విడిచె పెట్టెలు పగల - గొట్టి కొమ్మా నేనా
వామాక్షికి తె నేర్చిన విభుని గెలు - పంగ కొమ్మా॥

కనులజూచేనంటె దాటిరాడె దాని – కడప కొమ్మా ఆ
కనకాంగి జూచి నేర్చుకొన్నా డింత – కలివి కొమ్మా॥
నూతనముగ వచ్చిన యింతివలె కా – నుగ కొమ్మా పరమ
ఘాతకులైతె ఏలాగున చిత్తము – గరుగు కొమ్మా॥
రమణియుండెడి యూరు దూరములే మగరాల కొమ్మా – నాపై
మమత మరచి యందే యున్నాడుగదవె నీ – మంగ కొమ్మా॥
ఎనసి వేణుగోపాలుని కిది మరి – యాద కొమ్మా నుంత
కనికరమని లేదె వేదనచే మేను – కంది కొమ్మా॥

## 4. సావేరి – త్రిపుట

మంచుల పేళ్లుగల పదము

పల్లవి – ఆ వాలుగంటి మాట లతని కతిమధురమాయె
నన్నింత మోడి సేతురా
అను...రావే యూరక పాద – రసమువలె తిరిగేవు
భావముదెలిసి యి – ప్పటికోర్చుటే బాగు॥ ॥ఆవాలు॥

బాలరో పతిమనసు – పాషాణమని దెలిసి
ఏల కులుకులాడిని – ఎంత లేదంటివి
చాలునే శుద్ధమడ్డి – సాంబ్రాణివే నీవు
ఆ లోలాక్షి నెదిరించి – అతివా సాధింతువా॥ ॥ఆవాలు॥

అక్కరకా రమామణిని – అనుసరించితే బిరుదు
తక్కువా యూరకే చక్క – ట్లభినయించేవు
కక్కసమైతే యొక్కరిక – క్కరకంటు గారాదే
ఇక్కు వెరుగనంటే నగరా – ఇంచు ప్రాభోణులు॥ ॥ఆవాలు॥

ఎల నాగకేసరా – లిచ్చితే నీకేమి
చలపట్టి యిపుడు ర – చ్చలకా కాచుకున్నావు
పలుమారు వేణుగో – పాలా నెనుసేయుక
కలసి యుందామనుచు – బిలువవే రుజువుగా॥ ॥ఆవాలు॥

## 5. పంతువరాళి – ఝంపె

మానుల పేళ్లుగల పదము

పల్లవి – పడతి నేస్తము వేణుగో – పాల మాను
అను. . .తడబడక నీవికను – దాని చింత మాను॥ ॥పడతి॥

పంతమున అటుదిక్కు పదినాళ్ళు పోక మాను
యింతికిచ్చేవు సుమీ ఈతమాను
సుంతమనసు ఘట్టిచేసి – సుదతి కెమ్మోవివమాను
చెంతదీయ కది మహా – జగడగొండి మానును॥ ॥పడతి॥

సతతము దీనితో నీకు – బైలాయ వేగిమాను
మతి యింత లేదు శుద్ధ మద్దిమాను
హితవుగా నావద్ది కీసుద్ది తేకుమాను
తతిగా దిపుడు నీవా – సతిని బిల్వమాను॥ ॥పడతి॥

చెలిని గూడినది మొదలు – చేతికాను వాడికమాను
అలివేణి నిన్ను నేను – లకుగు మాను
నలితిండి బెడితివా – నాకు సింగిరేకమాను
పొలతి కొసగకు చేతి – పూలగుత్తి మాను॥ ॥పడతి॥

## 6. పంతువరాళి – ఆది

ఈళ్ల పేళ్లుగల పదము

పల్లవి – కడపదాటి రానీయకె
అలవాని మాయగంటి నాకిరి దీయకె
అను. . .పడతిరో ఇక్కేరి – పడుచుల జేరి నన్ను
విడనాడి పొమ్మనిన – వేణుగోపాలుని॥ ॥కడప॥

మగువరో పుణ్యానికే – మనుచు దరిశించెనే
మగరాల కమ్మలా – మదిరాక్షికి
వగకాని కెట్లామఘుం – వాణి సెళనాడ మునుకె
అగడై తిరువీధిలో అతని పేరూ రపగేవు॥ ॥కడప॥

ఇంతగ నారుతూరై – ఏమి యొడిగట్టుకొంటి
అంతరంగ మిద్దరికి – అయి రాలేదే
వంతగించి నాపై లేని – పలికొండగ గావించి
అంతలుజేసి యును – రనిపించిం దెఱుగవేమొ|| ||కడప||

కోరియుంటినే గోల – తొండగమెంతో నమ్మి
ఈరేడుజగము లెఱుగ – నినివరకు
కూరిమితో నన్ను చిత్ర – కూటమున కూడి పాడి
పేరుజెప్పిన ముందర ఆ – పెనుకొండను భూషించెను|| ||కడప||

## 7 గౌళిపంతు – జంపె

ఔషధముల పేళ్లుగల పదము

పల్లవి – వరకన్యా తిలకమిా – వనిత పేరు దీని
అను...పరికించ వేణుగోపాల నాసామి|| ||వరకన్యా||

పాలతినె మోమ్ము సం – పూర్ణచంద్రోదయము
అలకాళిరుచి వినో – దాంజనంబు|| ||వరకన్యా||

దాని మృదుమధురోక్తి – ద్రాక్షాదిరస మెంచ
మాలవతి చూపు మ – న్మథబాణ సమము|| ||వరకన్యా||

చెలియ దాని గుణంబు – చింతామణిస్ఫూర్తి
అలరించు పాట శ్రుతి – కాంచన రసము|| ||వరకన్యా||

సరసాంగి పొక్కిలి వ – సంతకుసుమాకరము
అరయగా చనులు బి – ల్వాది నిరసించు| ||వరకన్యా||

తరుణి సర్వాంగసుం – దరరసము రతినేలు
కరుణ రాజమృగాంక – కలయుమిక రతిసి|| ||వరకన్యా||

బలిమి నీ గుబ్బలు బట్టి జూచుట జేసి
తలిరుబోడి మందర – ధరుడని తలతురే॥ ॥ఏమిటికే॥

మరుకేళి నినుగూడి – మరిగినదే గుఱిజేసి
మదన జనకుడని – ప్రేమను గొలుతురే
పరిమళవతి నీమై – పసుపు దుప్పటైనది
అరసి పీతాంబర – ధరు డనుకొందురే॥ ॥ఏమిటికే॥

## 10. భైరవి – ఆది

పల్లవి – కందువ లెంచి ఈడకురా – కుందు వున్నాడే ఓ
అను...కందుకని వగతునాయిక – గందువ్రలేవే॥ ॥కందువ॥

మందయాన నాపేరంటె – మందామెన తనకు సం
మంద మేమన్నాడట – మందరధరుడు॥ ॥కందువ॥
ఆనాటి నెడబాయనని – యానబెట్టిన సుద్ది
ఆనతీయలేదా మనతో – నానాడా మగువ॥ ॥కందువ॥
మానినీ వాడు నాసా – మ్రాణియుంటి నేనికర
మూనిలేదా కనకాంగి – సాక్షిమని యున్నాడే॥ ॥కందువ॥
పాలుమాలిన వేణుగో – పాలుడు ననుగూడిన దేనె
పాలుబెట్టి అదియేమో కో – పాలుచేసీనె॥ ॥కందువ॥

## 11. భైరవి – ఆది

పల్లవి – రారా కోట్లాడితేనె రారా బోలేరా
అను...వేరా మీమామాపెకెవ్వడు న – వ్వేరా వేణుగోపాల॥ రారా॥

వద్దా ఇట్లాదాయము – వద్దా యిక మోములు చూడ
వద్దా రానా-మాయలు నీవద్దా
ముద్దు బెట్టినచ్చెవని కమ్మ – ముద్దు వ్రాసి దానికి బంపినపుడి
ప్రొద్దున పని సంతోషమాయె నని – ప్రొద్దుకాడ నెవరైన వినేరు॥ రారా॥

రాదా దయానాపేరే కా - రాదా కనరెందుకురా నా
మీావా యీా సొగ సెవ్వరి కికమీాదా
రాదుగా నెనరు యేమాటనుకో - రాదు యింత నిరసించుటమంచిది
కాదు వారు వీరనుకొన్నదిచట - గాదు నేను మంచిది నడుబిరాన||
||రారా||

ఈడా మనసురాదె నీకది - ఈడా పిలువనంపెనదిగో
జోడా ముందరగా కమ్మలజోడా
కూడరాదో మీారిద్దరు వెన్నెల - కూడనిచ్చి యొకరినొకరు మెచ్చను
దాడిపదము సంచున బాడుచు ము - ద్దాడి నాటివలె నన్నేలుమువిటు||
||రారా||

## 12. శ్రీ - త్రిపుట

పల్లవి - పిలుచుక రావమ్మ - సామి నీవేళ
అను...నెలతా ఈపంతు వె - న్నెల తాళజాలనిక|| ||పిలుచుక||

మానవతి చెలులగా నీకు స - మాన మెవ్వరు వట్టి యీా అను
మాన మెందుకు చిన్ననాటభి - మాన మిప్పుడైన మదినెంచి|| ||పిలచుక||

పాలుమాలుచు కమ్మవిల్తు నీ - పాలు సేయుక మేనిసొమ్ముక
పాలుసేకిచ్చేను గూటదీ - పాలు బెట్టేవేళకైన|| ||పిలచుక||

మారు మాటాడవలదని ము - ద్దాడ మొక్కితి రకోయనన్నును
మారుగా పెనగిన మహాభుజము... మాటుండదో వేణుగోపాలుని|| ||పిలచుక||

## 13. మధ్యమావతి - ఆది

పల్లవి - ఏ రమామణి బోధించెనిచి
ఏర మాటాడవు నాతోవక

అను...బీరమా మణిమణి నేడితె గం
భీరమా వేణుగోపాల|| ||ఏరమా||



"పిలుచుక రావమ్మ - సామి నీవేళ"

— పేజి 8 - పదము 12

మందు రాచినదేమో యికనే - మందు రా దానియింట
విందు రాతిరి బోసేసితివట - విందురా చెలులు
సందురా నవ్వేవారికి మన - సందురా నీకు యేలా
గుందురా రా నినుజూడక నామది గుందురా సుందరాకార॥ ॥ఏరమా॥
మెత్తురా నాపేరంటె శివ - మెత్తురా చెలికి ఇటుచను
విత్తురా కాపురాలవేరు - విత్తురా నాసామీ
ఇత్తురా ఒకనాటికి నొసలతా - యిత్తు రాచ్చలకే మరి యెడ
మిత్తురా మునుపటి దమురా నే - మిత్తురా వృత్తరవ్వలేల॥ ॥ఏరమా॥
ఏలరా దానిగూడినటువలె - ఏలరా నన్ను నేగుణ
శీలరా నీవా చెలికెంతవ శీలరా చలము
చాలురా వెలదికి రేపేనా - చాలురా అది జెప్పినమాటనె
పాలురా కలిగినదంటే కో - పాలురా మేలురానీకు॥　　॥ఏరమా॥

## 14. పున్నాగవరాళి - ఆది

పల్లవి - ఎంత దుడుకుజేసెనే - ఓభామా న
　　న్నెంత దుడుకుజేసెనే
అను...ఎంత దుడుకుజేసె - నెవరితో దెలుపుదు యీ
　　వింత కార్వేటినగర - వేణుగోపాలరాయు॥　　॥డెంత॥

గంటీలుబెట్టి వాలు - గంటీ నామోవి పలు
గంటీలు జేసిన త్రాణ - గంటినేమే
యొంటిపాటున యిటు - వంటి పనులయితే ర
వ్వంటికమ్మ చెల్లనా - వంటిదానిని గాంచి॥　　॥రెంత॥
అక్క వినవే వానికి - అక్కర బంగారాయ
అక్కర లేదు పొమ్మంటె - అక్కనుతో
చక్కపొమ్మెవా యని - చక్కని నాగుబ్బలు
చక్కగా బిగబట్టి - చక్కల్లినొక్కె జెప్పచు॥　　॥ఎంత॥

పట్టుచీరకు పళ్ళి - పట్టు వరహా లయిదు
పట్టుమనుచు నాచై - పట్టుకొని
కట్టుకొంగున మూట - గట్టుకోవే యని యి
క్కట్టు గూర్చిరా - కట్టు వుంగరమిచ్చి॥ ॥ఎంత॥

## 15. పున్నాగవరాళి - ఆది

పల్లవి - మట్లవారిసీమ చీర నిను పది
మాట్లడిగిన లేదంటివి బంగరు
అను...గెట్లు దానికిచ్చితి పికసీసి
గ్గెట్లుదక్కు వేణుగోపాల॥ ॥మట్ల॥

కట్లసంచిపొరలో దాచిన - కట్లదండకూడా పణతిచే
కట్లకిచ్చినదినే తెల్లవార - కట్ల వింటిజాడా యీ
పట్లదే యోగశాలిరా వినే - పట్లయెంచి చూడా మేల్
కట్లయిండ్లు విడిది జేసితివా - కట్లమారి గుడికాడ॥ ॥మట్ల॥
రాళ్ళమర్చిన పతకము పావు - రాళ్ళ పలుకు కేనా వే
మాళ్ళ పచ్చదారబోసినది పెరు - మాళ్ళ ప్రీతిగానా చె
క్కిళ్ళ సొగసు మెచ్చి యిచ్చినది యొక - కీళ్ళమంచమేనా నీ
వేళ్ళ వుంగరాలేసిరా వస్త్రి - వేళ్ళ చప్పరములోనా॥ ॥మట్ల॥
కేళికాడితేనే చెలితో రతి - కేళి సల్పనగునా వింత
యాళి మొగము పీతెరాతి - గయ్యాళి కియ్యనగునా
తాళిమితో ననుగూడి యింత యెగ - తాళి సేయనగునా అ
చ్చాలిగా సుదతిచేతనే పద - చాళి చిత్తగించితి వీవగనా॥ ॥మట్ల॥

## 16. పంతువరాళి - ఆది

పల్లవి - రావద్దు పొమ్మననా - మాయింటిగోన రావద్దు పొమ్మననా
అను...పోవె మాటలనూరి - ప్రొద్దుపోజేమె నీకు
యీ వేణుగోపాలు - దీర్ఘా జేసెనందుకు॥ ॥రావద్దు॥

మళ్ళచీ గడిగితే - మళ్ళా వచ్చెదనని
మళ్ళాదోవపోయి మారా - మళ్ళ బెట్టెనందుకు॥ ॥రావద్దు॥
కొదవేమున్నదనుచు - కుదువబెట్టి నాతీగ
కొదవపరచి నామనసు - కొదవ సొమ్మడిగితే॥ ॥రావద్దు॥
అక్కరకయ్యేనని - అక్కరో ననుకూడి
అక్కడ ఆడుకుంటె - అక్కర లేదిక॥ ॥రావద్దు॥

## 17. సౌరాష్ట్ర ఆది

పల్లవి - మందగమన చెలుల - మందగ గూర్చేవు
మంచిది కానీలేవే

అను... అదరన్నట్లు నన్నారడిచేసేవు
అందరాసిపండ్లు - కాసించిన ట్లాయె॥ ॥మంద॥

కనకాంగి మరచేవు - కలకాని నన్నది
వెనకలేలంటే ఆ - వెనక దెలిసీని
వినక నామాట న - విన కారణము దెలిసే
దనకపోనీను నా - దనకత్తె వైనావు॥ ॥మంద॥

నేరమా వలచితే - నేరమా నీవలె
మా రాముళ్ళెమె రా - మా రామయిపుడు
దూరము నీమనసు - దూరమైనందుకు నే
దూరమా నీయింటికి - దూరమని బొంకుచు॥ ॥మంద॥

వాలాయముగదె ర - వ్వాలాయె నీకు కో
పాలాయె యిది ప్రస్తా - పాలాయె కొసరి
చాలాయె నినుగూడి ర - చ్చాలాయె వేణుగో
పాలా యనక నా - పాలాయె మటిమటి॥ ॥మంద॥

## 18. ఝగడ - ఆది

పల్లవి – ఎందుకో రాక అలిగినది నా
యందు కోపమేమి తెలుపవే ఆది

అను...సందుకొనెను వేణుగోపాలుడీ
సందు కొనకువచ్చి మళ్ళినాడట॥ ॥ఎందు॥

వచ్చు నాకీగుణ మేమన – వచ్చు నా నెనరుదోచి దరిశన
మిచ్చునా దయవుంటే చెలికస – మిచ్చునా న్యాయ
మెచ్చునా యింకా నాపై చల – మెచ్చునా బోటి కడపదాట
నిచ్చునా వకరిమాట సాగ – నిచ్చునా దైవమింతదెచ్చున॥ ॥ఎందు॥

తిరుగా నిలచి వార్తలాడ – తీరెనా లోనిగుట్టుజెప్పి
తీరునాటించి నటుల యున్నది – తీరునా యిట్లా
మీరు నా డన్నది నిజమాయె – మీరునా యింత వెరపులేక
దూరునా మీదబెట్టి దానిలు – దూరునా కోర్కె లీడేరున॥ ॥ఎందు॥

ఏలనా పేరు వాసి తిరుగా – యెబనా కాసి నేనంత
చాలనా తనకంటికి సమ్మతి – చాల నాటనుంచి
మేల నాతో జెప్పని మర్మ – మేల నాసరివారిలోనే
బేలనా యడిగిరావె తబ్బి – బ్బేలనా మది సహింపజాలను॥ ॥ఎందు॥

## 19. హుసేని - ఆది

చక్కని సామిగ నాతో – చక్కగ నుత్తరమీక
చక్క దానింటికి పోదురా నీపరువున కిది – చక్కని నడితి కాదుర॥
తీగసి మోహమున వలచి – తీ దావచ్చేనని ఆన
తీర నీకు మేలుదానరా పసియున్నది రా – తీరవనే సుద్ధి మానరా॥

మానవతి మెచ్చి నీ స - మాన మెవ్వరని బహు
మానము జేసినది వింటిరా రాగారాగా నీ - మానసము దెలుసు
కొంటిరా॥

నాటినమ్మికెలు మది - నాటియుండదా నన్ను యే
నాటికీ యడబాయనంటివి - ఆపె యెదుట నిన్నాటి కెంతో కసరు
॥కొంటివి॥

నగరా చెలులు శ్రీకార్వేటి - నగరా వేణుగోపాల తి
న్నగ రాదీసి యేలుకొంటివీ వాదాడి తేయీ-నగరాబుట్టినీ మాటంటివీ॥

## 20. అసావేరి - ఆది

ఏరా యేరా మాబోధింప
రారా రా రాపూసేయ వ
ద్దూరా దూరాన నిలుచుందురా - నీమదిరా నడి
చేరా చేరా రావేమందురా॥
విన్నా విన్నాడుకొన్నది
విన్నా విన్నాణగత్తెను
కొన్న కొన్నపతకమిత్తురా - నే దానికంటే
చిన్న చిన్న పనులుమెత్తురా॥
వద్దా వద్దా రావుయొక్క
పొద్దా పొద్దాయనే యిట్లా
కద్దా కద్దాచెలితో ఆటలు - యేవేళయిదే
రద్దా రద్దాయ నీమాటలు॥

కానీ కానీ నీబోటిసత
మానీ మానితీవి దయ
రాని రానీదు మాయింటికి అది జెప్పేనట్లు
పోనీ పోనీదు పొరుగింటికీ॥

ఇందు యిందుముఖులు మెచ్చ
ముందు ముందుగాగూడినా
యందు యెందుకింత కోపమూ - వేణుగోపాల
సందు సందుల ప్రస్తాపమూ॥

## 21. ఆహిరి - చాపు

పల్లవి - వేఱుసేతురా - వేణుగోపాలా నను వేరుసేతురా
అను...నీరాక కోరిన నన్ను - నిరాకరించి పొమ్మని॥ ॥వేరు॥

ఇందుకా నీవని నమ్మినది - యిందుకా నీ వనితలలోన॥ ॥వేరు॥

అంతటి రాని రసికత - యింతటివని దెలియకా॥ ॥వేరు॥

పూలుగూర్చిన వగజూచి గుం - పూలు గూర్చిన వగలాడివద్ద॥ ॥వేరు॥

మానిభయాన తాకినందుకు వే - మారు నిభయానలు నవ్వగా॥ ॥వేరు॥

నిలుపరా నీమోహమాయు - నిలుపరా నీమోడీ యికను॥ ॥వేరు॥

నిన్న నేమీ యోచన వింటి - నిన్నన నేమీ ఫలమింక॥ ॥వేరు॥

పాయమున నే మేము పు - పాయమునసే నన్ను గూడి॥ ॥వేరు॥

## 22. కన్నడ - ఆది

పల్లవి - తిరుగాయే చెలిని పొమ్మందునె - వేణుగోపాలునే
తిరుగా పిలచి రమ్మందునే

అను...తిరుగా వల దన్నందుకే వకే
తిరుగాబోయె వానిమనసు॥ ॥తిరుగా॥

మందారవనములో నేడు - మందధరునివద్ద
మందర జేరినదట మే - మంద రాడకు పోతగదు॥ ॥తిరుగా॥

వద్దనేమారని విభుని - వద్దనేల పోపొమ్మంటి
వద్దానేర్పు చేరదీయ - వద్దనే రీ మగువలెల్ల॥ ॥తిరుగా॥

వచ్చునా తానైనను కలయ - వచ్చునా ఆడికెలు తెనియ
వచ్చునా అతనీమది గురుతీ - వచ్చునా శుభ రేఖ వ్రాసి॥ ॥తిరుగా॥

## 23 ఫరజు - చాపు

పల్లవి - రమ్మనే సామిని రమ్మనే

అను...కొమ్మ నీవే నాననవి గై
కొమ్మని వేణుగోపాలుని॥ ॥రమ్మనే॥

మచ్చు మీద నేనుండగ - మచ్చుమీద జల్లినవాని॥ ॥రమ్మనే॥

ఇందుకాక కోర్వదంటె - యిందుకా కసరిం దీవేళ॥ ॥రమ్మనే॥

అలసీ మాటితో రేమెల్ల - అలసి మాటాడకున్నాడు॥ ॥రమ్మనే॥

కూడిన సామిని నీలో - కూడిన నాపై దయయుంచి॥ ॥రమ్మనే॥

## 24. కాపి చాపు

పల్లవి – తడవాయె పోయిరా యీతడవా – యేమే
అను. . .పడతీరో వేణుగో – పాలు డచ్చటజేరి॥ ॥తడ॥

మనవి దెలిపి రా రమ్మనవే కూడ
దనవొచ్చే బుద్ధి గాదనవే నాపై
కనరు దోచుట కేమో కనవే వో
వనజాక్షి ఘట్టిగ వకటి నీవనవే॥ ॥తడ॥

వలచిందే తప్పా నావలనా అ
గ్గలమైన మరు లోర్వగలనా ఆపె
వలెనున్నానటె నేకావలెనా క
ల్లలకు లోనైన చల్లనివాడె లలనా॥ ॥తడ॥

సతి యిల్లాతనికి వసతిగా మాన
వతి చాల ననుకూలవతిగా అది
మతిగలదైతే సమ్మతిగా యెంతో
మితిలేని ప్రేమ సామికి మే నమ్మితిగా॥ ॥తడ॥

కలదా రానిచ్చేది గలదా మా
వలదానిపడక లోపలగా యీ
వల రాను సెలవు కావలదా తే
గల ధైర్యముకు నీకుఘట్టిగ గలదా॥ ॥తడ॥

మరుకేళి గూడినది మరుగా నీ
వరుగ చెలులు నవ్వరుగ వ
క్కరు మనకై పలుకరుగా యెం
దరుగవలెనే సుందరి నేడిందరుగా॥ ॥తడ॥

## 25. ఫరజు - ఆది

పల్లవి- ఆడకే పోరా - యెదు - రాడక పోరా
అను... వేడుక లీడ జెల్లవు - వేణుగోపాల నా సామి॥ ॥ఆడకే॥

నా తెర విందు సేయు నె - వ్వాతె రావింబె నన్నదొ॥ ॥ఆడకే॥

చీటి బంపిందేని బందరు - చీటి బంపిందే మగువకో॥ ॥ఆడకే॥

పూలుగూర్చిన వగలుజూచి గుం
పూలుగూర్చిన వగలాడెవతో॥ ॥ఆడకే॥

ఏదు వరా లిప్పించుకొన్న ఐదువరాలి యిల్లేడనో॥ ॥ఆడకే॥

కూడిన నాటనుండి చే - కూడిన నాపై దయయుంచి॥ ॥ఆడకే॥

## 26. భైరవి - ఆది

పల్లవి- సరసాలు సేయవద్దిక చాలు పోపోరా
అను... వెఱతురా నీపేరంటె - వేణుగోపాల నాసామి॥ ॥సర॥

పచ్చని కమ్ములచీర-పండుగనాడైన యెరుగ-
వెచ్చానికేమి లేదంటె - వెలవెలబోయి నాతో॥ ॥సర॥

మంచముమీాది పాదాలు - దించనీకు పదియాకల
కంచము దీసీయమంటే కండ్లెఱ్ఱజేసుకొనేవు॥ ॥సర॥

ముత్యాల కుళ్లాయి మాకు - ముందర బెట్టేదిశానా
యిత్యాహభట్ల నామేలు - యిక నిన్నుగూడేది సున్న॥ ॥సర॥

## 27. భైరవి - ఆది

పల్లవి- వచ్చునా మునపటి నెనరుంచి - వట్టిభ్రమలు గాకా

అను. . .మచ్చకంటి వేణుగోపాలుని
మనసు రానడిచే వారుండగ॥ ॥వచ్చు॥

పిలువవచ్చేనని యంతో మురి - పెముల పొయ్యేవు - వాని
తలపు వేరైన జాడ కాసం - తైన తెలియలేవు
వెలదిరో యతనిజిత్తుల నీ - వేమిగన్నావు వో
వళినసేతిరివిభుని కేవహించుక
నన్ను కాదనేవు మంచిదానవు॥ ॥వచ్చు॥

మాటపట్టు చేసుకొన్నారట - మగువ తాను మొన్న నన్ను
నోటిలో నాడుకొన్నారట - కోటివేలు నిన్నా
బోటి యీసుద్దుల్న జెప్పగ - ప్రొద్దుసనే నిన్నా - యీమొగ
మాటమే దూరమాయె చెలువుని
మర్మమెల్లగన్న వేడుకొన్న॥ ॥వచ్చు॥

నన్ను లాలించి యేలుకొన్నది - నవ్వుల కెడమాయె - ఆ
వన్నెకాడు నాయిల్లు విడిచినదె - కన్నెల పరమాయ
సన్నుతాంగి పొందే నాసామికి - సంతోషమాయ యిక
నెన్నిదలచుకొందునమ్మ నామది
కేమితోచదాయ నన్నుడాయ॥ ॥వచ్చు॥

## 28. భైరవి – ఝంపె

పల్లవి–ఇంతసేసినయింతి యిగ నెంతసేయదే
 యెంత సాహస మందునే–
అను...వింతలేమనవచ్చు – వేణుగోపాలునికి
 సొంతకత్తెయకదవే సకియ॥ ॥ఇంత॥
సుదతిరో నను విభుడు చూడబొయ్యననుచు
 సురటీలు బట్టించెనే వాని
కెదురుగా నొకవేళ నేవత్తునని దలచి – యేమొ జాబందిచ్చెనే–
పదము నేబాడితే సదయున్న వినకుండ
 భటులచే బొగడించెనే– యెవరు
సదరు లేదికమీద నావేలు పంచరని
 మదిలోన గర్వించి నేనకియ॥ ॥ఇంత॥
అతివరో నామాట లాలకించీ ననుచు
 నపుడె చిలుకను బెంచెనే– నన్ను
మతిలోన దలచునని ప్రతిమ నొక్కటి చిత్ర
 పటములో వ్రాయించెనే–
వ్రతమనుచు వగకానివద్దికే చెలుల రా
 వద్దనుచు చాటించెనే –యింత
మితిమీాటి యిద్దటి మిత్రభేదము జేసి
 మేలుమెచ్చులు గాంచెనే సకియ॥ ॥ఇంత॥
సామి ననుగూడినది యేమగువ దెలిపెనో
 యామొదలు చలపెట్టెనె అంగ
నామణి యది నంగనాచివలెనుండి య
 న్యాయాని కొడిగట్టెనే
రామరో యతడు తన రతిసాదనకు మెచ్చి
 రాణివాసము చెట్టెనే వినదే
వామనేత్రి విభుని వల వేసుకొంటినని
 వగలాడితొడదట్టె నేసకియ ॥ఇం॥

## 29. భైరవి - ఆది

పల్లవి - నాపేరంటె నీకు దొరకదు, గ్రంగి మాటలాడకురేరా
అను...దోవనే సరియేగొక్కటి ఆ
దొరసానికా వేణుగోపాల॥ ॥నాపే॥

తలుపుచాటున చిలుకలతాళి - దానికియ్యలేదా - పూసల
కొలుకి వేయుమన్నందుకె నాపై - కోపగించలేదా
పులిజున్ను పుట్టతేనె మొదలుగ - చెలికి నడపలేదా - నీకు
వలసియున్న పనులైతే మదిలో -తలచినప్పుడెకాదె
అందుమీద॥ ॥నాపే॥

వారపప్పళిచీర దెచ్చె - వాడవానీవు - నేటి
కారు దినములాయె తొంగిచూడక - నందే యున్నావు
తేరతేరగా జూచి యెందుకు - మేరచెప్పెదవు - అంత
భారమై తోచితె నికనా - వద్దు జూచెదవు మాయకాడవు॥ ॥నాపే॥

వగలమారి నన్నంటకుమంటే - వద్ద చేరావు - ఆ
మగువ నిన్నేలుకొన్న చిన్నెలు - మరుగు జేసేవు
సొగసు జేసుక నను తమిరేచి - సొంపునను గూడేవు నీ
తెగువ దేవేంద్ర పదవైనట - తెలియజేసేవు- మంచివాడవు ॥నాపే॥

## 30. నవరోజు - త్రిపుట

పల్లవి - వేణుగోపాలు డీవేళవచ్చినాడు
వేమారు గొణుగకవే - వాడు॥ ॥అంబ॥
అను...మాణిక్యపుతునకే ప్రాణమెనీమీద
మేనాక్షివినవే నేడెంతో హాసుమీఅవే ॥వేణు॥

దగ్గరికేటు జేరి దండము బెట్టవే – సిగ్గేటికే యింక చిన్నదానహో

మొగ్గుగా దోచి నీవిటు తలవంచేవు

దిగ్గున మొగమున తెలివిదెచ్చుకోవే॥ ॥వేణు॥

ఏలనే కూతుర మూాలలజూణిగేవు

నేలమీాద బోటనవేలు రాయకే॥ ॥వేణు॥

పూాలలందుకొమ్మంటే పుడకేల విరచేవు

మేలు వానిచేత మెచ్చు లందుదుగాని॥ ॥వేణు॥

చప్పుడుసేయక సాగిటు రావమ్మ – యిప్పుడేమె నీకు యేండ్లులేవా

చెప్పినంతమాట చెల్లించేసామిని

అప్పుడే రతివేళ తిప్పలబెడితివే ॥వేణు॥

## 31. తోడి – త్రిపుట

పల్లవి – తోడి తెచ్చెదనే వాని – అప్పుడే మెచ్చి
తోడవు లిత్తువుగాని

అను... వేడుక పరుడైన వేణుగోలుడల
చేడె నగరిమున్న – జాడదెలిసి యీాడకే॥ ॥తోడి॥

అద్దము జూచుచును ఒకరికొకరు
ముద్దులు బెట్టుచును
గద్దరితమున కౌగలింపుచు నీపై
పద్దున దానికి – బాసలిచ్చినగాని॥ ॥తోడి॥

మడుపు లందిచ్చును - ఒక్కరికొకరు
తొడరి మోవి నొక్కుచును
కడలేని మోహమున - గంధమలదుచు నాపై
పడకింటి యిష్టాలా - పముల నుండినగాని|| ||తోడి||
వీణేలు మీటుచును - ఒక్కరికొకరు
జాణతనము లాడుచును
మాణిక్యమువంటి - మగువ నిన్నేలిన
వేణుగోపాలుడా - వెలది గూడినగాని|| ||తోడి||

## 32. నీలాంబరి - ఆది

రారా సామి నీకు మొ్రి - క్కేరా పిలచిన పలక
వేరా నిలచి వొకమాటాడర - నిన్నెడబాయ జా
లారా చలమేల యింటికి రారా||
వాదా కనికరమింతైన - లేదా యీ మేనునీదే
కాదా నీకోరికదీర్చ - రాదా తమినిల్ప లేనిక
మీతూ తడవేల సరకు రారా||
వేరు సేయకుర కాద - నేరు తోడిచెలులున
న్వేరు యేవరైన యెటునమ్మురు - యెంతని వేడుదు పలు
మారు నన్నాదుకొందువు రారా||
ఓరీ యెంతో నెమ్మది నిను - కోరీ వలచినందుకు వక
సారీ రావైతివిగా యీ - దారీ ఫలమేమిక నిన్ను
దూరీ యిదిమంచి సమయము రారా||
కాయజుడెంతో పగవా - డాయ నీమనసుకరగ
మాయ నిందనపొ్రి - ద్దాయ వేణుగోపాల
రాయా నన్నేలుకొందువు రారా||

## 33. శంకరాభరణ - త్రిపుట

పల్లవి - ఇంత మోహమేమిరా - యిందరికన్న-
నింత చక్కని దేమిర

అను...సుంతసేపు దాని - జూడకుండలేవు
అంతరంగము దెలుప వదియేల - వేణుగోపాల॥ ॥ఇంత॥

నీ కెదురుగావచ్చునా - నెనరూరగ - నిండుకౌగిట గుచ్చునా
ఆకుమడుపు లందిచ్చునా - తనచెలిమికి
నైనవాడని మెచ్చునా - తమి హెచ్చునా
యేకచిత్తమున మీరిద్దరు - యింపు సొంపులనున్న ముచ్చట
నాకు వినవిన వేడుకయ్యేరా - యిపుడాసతీరా॥ ॥ఇంత॥

మోవి పానకమిచ్చునా కొసరికొసరి - ముద్దులాడ నిచ్చునా
తావిపువ్వులు దెచ్చునా - నీ సొగసుకు
తగియున్నదని యిచ్చునా - చనువిచ్చునా
దేవరే మగడు గావలెనని - భావజుని పూజ లొనరించిన
ఆవనిత పేరేమి సెలవీరా - సిగ్గేలర్రా॥ ॥ఇంత॥

సంతోషముగ నాడునా - తంబురమీటి - సంచు పాట బాడునా
వింతరతుల గూడునా - ఆ సమయాన
విడువకుమని వేడునా - కొనియాడునా
సంతతము నన్నేలుకొని యా - కాంతపై వలచినపుడే యిక
కొంతవున్నదె వేణుగోపాల - గారణములేల॥ ॥ఇంత॥

## 34. పున్నాగవరాళి - చాపు

పల్లవి - సామి యీకోపమేల - దాని జేరకుమంటే రోసాలా

అను...కామినీజన పాంచాల
కార్వేటీనగర వేణుగోపాల నా॥ ॥సామి॥

నెనరుగూర్చి యేమైన - నే నొకటనరాదా - ఆది
కనరుగాదో చేది యాశోకసే - కాంగి మహిమగాదా
చనవరి నీకదైనప్పుడే చాలదా యికమీాదా
మనసురాక మెలగే విది - మంచిమరియాదా నా॥ ॥సామి॥

అమ్మ చెల్ల నీనడతలు - ఆనాడే గంటి - ఆ
కొమ్మకు వెలలేని రవలసొమ్ములీయ వింటీ
దిమ్మరివలె యిల్లిల్లు దిరుగ వద్దంటి
యెమ్మెగాడు మంచివాని - కీ గుణమువంటిరా॥ ॥సామి॥

చెలియపొందు సేయలేదన -చై వేసేవు - రుజువులు గా
కలదనిపించితె - ఉపముగా తోలగేవు
తలిరుబోణిరో యీతప్పు -దయసేయు మనేవు
అలిగియున్నగాని గూడి - అపుడే నవ్వించేవునా॥ ॥సామి॥

## 35. శహాన - త్రిపుట

పల్లవి-నేరుతునని మాటలాడరాకు మునుపే - నిన్ను నేనెరుగనా

అను...పోరా పోనీకేడ - పొద్దుపోక తిరిగేవు
ఘోరలేనివారిని పేర బిలుచుకుంట॥ ॥నేరు॥

మూసిన ముత్యమువలెనున్న యాచెలిని
ముంగిళ్ల బెట్టితివి - యెంతో
వాసివాడని చాలవలచియున్న నాతో - వాదు కొడిగట్టితివి
భాసురాంగి నిన్నపడకకు రానంటె - పదివేలు తిట్టితివి - అగడు
జేసెదనని పూని చేడె లందరుజూడ
చెలియిల్లు మెట్టితివి - చేబట్టితివి॥ ॥నేరు॥

అడుగులోనే యరవైయూరు గుణములైతే
అతివలు మనసిత్తురా - ఆకు
మడుపులోనే వలపుమందుంచి మాపొరుగు మానినీమణి కిత్తురా
దుడుకులు సేయ నీదొడ్డతనమేమో
దొరవైతేనే మెత్తురా - యింత
గడిదీరి తిరిగితే కన్నెలు వాకిటి - కైన జేరనిత్తురా
మొగమిత్తురా॥ ॥నేరు॥

వేడుకలొదవ్వు కార్వేటినగరమేలు - వేణుగోపాలుడవు - చిన్న
యీడున ననుగూడి యీదోవ రావైతి - వింటెంటి చెందురిడవు
ఆడకాడకు నీజాడలు బయలాయె - ఐనా మాయకాడవుయిట్లా
కొడిగములు జేసి కొమ్మల బెదిరించి
కొంటెతనము వీడవు మాయకాడవు॥ ॥నేరు॥

## 36. పంతువరాళి - చాపు

పల్లవి - వలచియుండితే నీవు - వలచేది ఘనమా
అను... వెలది కార్వేటినగర - వేణుగోపాలుడు ॥వలచి॥

అండజేరి వేడేది అత్రి ముద్దిమ్మనేది
వుండివుండి తమకమున - వుస్సురనేది

యెండమావుల సామ్య - మేమనుకో రాదికను
కొండకేగేవాని మొలను - కొడవలి చెక్కినట్లాయె ॥వలచి॥

కడు ప్రేమ బుట్టించేది - కదిసి కౌగిలించేది
తొడరి మోవి నొక్కేది - దొర వనేది

మడుపు లందిచ్చేది - మనసు రాదనేది
పడతి పులగము మీది - పప్పుసామితె ఆయె ॥వలచి॥

మేలు మరువ ననేది - వేళ మంచి దనేది
పాలుమాలక విటుని - పై కొనేది

రాలుగాయనగ వుప - రతుల తనియించేది
ఆలిమీద లంజరికమనుమాట నిజమాయ ॥వలచి॥

## 37. పంతువరాళి - ఆది

పల్లవి - దోసకారిపోవే యతడీ - తో ప్రొవ దొక్కనా - వ్రూరకె

అను...ఆసుబోసిన కోవివలెనే ఆడకు యీడకు
తిరిగే ప్రమాత్రమె॥ ॥దోస॥

అందమైన వెండిమెట్టెలు - సందెకాడ బంపించితె
కందుగలసిందని యెగిరి - చిందులు ద్రొక్కుచు చిదియగొట్టిన ॥దోస॥

కరకు వరహాలారుబెట్టి - కరకంచు చీరదీపిస్తె
చెంగు బాగాలేదని మెటికులు - విరచి నుచ్చుపాతలుజేసిన॥ ॥దోస॥

సన్నబియ్యము లేనివాసి - సంబావ్వడ్ల గోనెలంపితె
కన్నులెఱ్ఱజేసి గింజ - లన్ని కుంపట్ల కెత్తించిన॥ ॥దోస॥

కలువపూలు లేని వాసి - కస్తూరి పట్టెలంపించితె
తిలకించికోపమున చేత - నలిచి పందిటిమీద జల్లిన॥ ॥దోస॥

వేణుగోపాలుని గూడి - వేలాంత్రాలు సంపాదించి
యేణాక్షులతోవకకాసైన - యెరుగననుచు వాడుకొన్న॥ ॥దోస॥

## 38 గౌళిపంతువరాళి — చాపు

పల్లవి - చండితనము జేసే - సరసిజాక్షితో యిట్లా
సరసాలు సేయకురా - ఐనా

అను...కొండ ద్రొవ్వెలుకను బట్టుదురా వేణు
గోపాల నేనంటే - కోపాలాయె వేళ॥ ॥చండి॥

ఎక్కడలేని మోహముతో దాని - పక్కజేరి పాదములంటితే
గ్రక్కున లేచి చిడిముడిపాటున - గద్దించి పలికేనుగా
మక్కువతో నాకుమడువు లీయబోతే
నక్కరలేదని యావలి మోమాయె
జక్కుల సంతోషమనుమాట నిజమాయె
చక్కిలిగింతలు చట్రాతికి గలదా॥
రాతిరీవు గుజరాతి ముత్యపుసరులు
చేతికిత్తామని ప్రీతితో బిలచితె
ఘాతకురాలు గొణుగుచు నీమీద - కండ్లెఱ్ఱ జేసెనుగా
పాతకురాలు నీబంపిన పైడి - పట్టె దేలేదని యాన లిడుకొనె

చూతామనుచు సన్న వేతామాయంటి
యీతాకురాలున యేయాకు రాలిన॥

ఉయ్యాలమంచముపై నిన్నటిరేయి
పయ్యద తొలగించి పణతి నిద్రించగా
చయ్యన నీవాసమయాన బలిమిని - సమరతి గూడగనూ
అయ్యెడ తెలివొంది అధికకోపమున
గయ్యాళి తనవామకరమున నెట్టించె
నెయ్యము సేతుర నెనరులేనిచోట
కొయ్యబొమ్మను చేర కోరికెలిచ్చున॥

## 39 సురట - త్రిపుట

పల్లవి - ఇంటికి రానిచ్చేనా - యీమేనితో
యింతి వాని వలచేనా
అను...గొంటుకాడై వేణు - గోపాలుడు నాపై
తంటలు జేసితె - దండించక విడచేనా॥ ॥ఇంటికి॥

యితనికి వెరచినే - నిక లంచమిచ్చేనా
యిన్నాళ్లవలె ననుసరించేనా
బతిమాలి నే రాయ - బారమంపించేనా
పతియని మునుపటి - భక్తి దయలుంచేనా॥ ॥ఇంటికి॥

ప్రేమ దలచి తన - మోమైన జూచేనా
యేమి జెప్పిన నిజ - మెంచేనా
రామా అయినది కాని - రచ్చకు వెరచేనా
ఆమాట సభలోనే - ననక సహించేనా॥ ॥ఇంటికి॥

ఎనసిన మొగమాట - మింతైన జూచేనా
యెంత వేడిన మన - సిచ్చేనా
వనిత పట్టినపట్టు - వట్టి దనిపించేనా
పనిబూని వేణు - గోపాలా యని పిలచేనా॥ ॥ఇంటికి॥

## 40 ధ్వజావంతి - త్రిపుట

పల్లవి - నెరనమ్మితిగదె - నీమాట సతమని
నెనరు దానవనుచు

అను...మరులు బుట్టించి యేమరి యూరకున్నావు
గురిజేయకె నన్ను - మరుబారి కిప్పుడు॥ ॥నెర॥

మాటల పందిలిబెట్టకె నీవయిని - నాటియున్నదే మనసు
బూటకములుజేసి - ప్రొద్దులు బుచ్చకె
తేట కెమ్మోవీవె - తేనెలానగనీవె ॥నెర॥

అరచేత వైకుంఠమదిగో యందు రా సామ్య
మంతయు నిజమాయనే
మరిమరి చనువిచ్చి - మనసీక జుణిగేవు
సరస జేరగరావె -చనులు బట్టనీవే॥ ॥నెర॥

నమ్మి నానబోసినటులాయగదె యల్ల నాటి సంకేతములు
కొమ్మరో నను వేణు - గోపాల రమ్మని
కమ్మవిల్తుని కేళి గలయవేమె బాళి॥ ॥నెర॥

## 41. శుద్ధసావేరి — త్రిపుట

పల్లవి — ప్రాణదానవె వాడిం — తగా జతిమాలితే
తలయెత్తి చూడరాదా — నీపై
అను... వేణుగోపాలునికి — వెగటుదోచితే రేపు
వేకటేలాగాదువే యోచెలియరో॥ ॥ప్రాణ॥

ఇందుకేనటే బంగా — రందలమ్ములో బెట్టి
నందేలదొర నిన్ను — నజరు బంపినది
అందకాడు గుబ్బ — లంట వచ్చినవేళ
చిందులు ద్రొక్కుచు — చెయి బట్టుకోవలెనా॥ ॥ప్రాణ॥

మిద్దెయిల్లు గట్టి — మేలు మెచ్చగజూచి
హద్దుగా వుంచినది — అందుకే నటవే
వద్దికి తావచ్చి — వలపు రేచేవేళ
ముద్దు బెట్టుకోనీక — మునుచుకొని వంగుదురా॥ ॥ప్రాణ॥

పడతిరో వేణుగో — పాలు డద్దమురేయి
విడిదికి వేంచేసి — వేడుకలరగాను
తడయక నిను రతుల — తమిని గూడేవేళ
బెడసరమటే రెండు — తొడ లదుముకోవలెనా॥ ॥ప్రాణ॥

## 42. కేదారగౌళ - ఆది

పల్లవి — నేడు నీవిన్నవించినందుకు
నెనరు బుట్టరాదా — యెంత
అను... వేడుకై తోచెనే నావునికి
వెలది వేణుగోపాల దేవునికి॥ ॥నేడు॥

నిన్ను బాసి నిమిష మోర్వ నంటివి - నీ సొమ్మంటివి
కన్నీరున పైట దడిసెనంటివి - కారాదంటివి
వున్న తావున నుండదంటివి - వులికీనంటివి
చిన్నబుచ్చితే దోసమంటివి - చిత్తానికి సరిపోయినదంటివి॥ ॥నేడు॥

చిలుక చాయ తొంగి చూడదంటివి - చెప్పదంటివి
చెలులదగ్గర జేర్చదంటవి - తలచునంటివి
వెలవెల బోవుచున్నదంటివి - వెరచునంటివి
పిలచిరమ్మనె రారా యంటివి నెలత నీకెదురు జూచునంటివి॥ ॥నేడు॥

కూడి వీడ తగవు గాదంటివి - వేడుకొంటివి
మోడిసేయ మర్యాదా యంటివి - మ్రొక్కితినంటివి
చాడిసుద్దులు వినవద్దంటివి - సరసుడవంటివి
ఆడికలకు యడమీవలదంటివి - అలుకదీరి యింటికిరమ్మంటివి॥ ॥నేడు॥

## 43. హుసేని - ఆది

పల్లవి - తెలిసె నీనెనరు లేని జాడలు - తేటతెల్లముగను
అను...వలదు నిలుపు యీమాటలకేమి
వచ్చె వేణుగోపాల నాసామి॥ ॥తెలిసె॥

మనసుగలిగితె దినమొకసారి - మాయింటికి రావా - యెంతో
చనువుమీర కౌగిలించి ముద్దిడి సరస నుంచుకోవా
తనివిదీర లాలించి కప్పూర - తావి మడుపులీవా యీ
తనువు సీదని జేసినన్నమ్మిక - తప్పనలేకావ - కొంచగాడవ॥ ॥తెలిసె॥

ఊరిదాక పోయివచ్చేనని పూరకే అనలేదా అయి
దారు దినము లిందుండే మోమొక - సారి జూపరాదా
వారిజాక్షి హితవైతే నేనా - పేరు దలచనిదా - క
న్నీరునించి దయమరువకుమన్నది - నీతో నేగాద
మర్యాద॥ ॥తెలిసె॥

కూడియుండలేదా నను మెచ్చి కూరిమితో నీవు - యిపు
డాడకాడ కేమేమోదలచక - అంతరంగమీవు
జోడుచాయలేనని బతిమాలితె వేడవలదనేవు నా
యీడువార లెకసక్కెములాడుట - కింత జేసినావు
మంచివాడవు॥ ॥తెలిసె॥

## 44, ఫరజు - చాపు

ఎంత వేడుకొన్న పలుక - డేమి సేతుకొమ్మా
ఇంత రాతిమనసువాని - నెందు గాననమ్మా॥
చిటుకుమంటె కోపమైతె యెటుల సైతునమ్మా
కటకటా దైవమెంత కరుణ దప్పెనమ్మా
మాయదారి వగలకెంతో - మరులైతినె కొమ్మా
బాయననుచు చిన్ననాడె - బాస లిచ్చెనమ్మా

గచ్చులాడి నాపై పళి - గల్పించె గదమ్మా
మచ్చుజల్లి నాదువిభుని - మనసు విరచెనమ్మా
వేణుగోపాలుని కిది వేడుకాయె నమ్మా
జాణననుచుగూడి నన్ను - జాలి బెట్టెనమ్మా॥

## 45. ఆనందభైరవి - చాపు

పల్లవి - ఏమిసేతు విరహవేదన
యెంతని తాళుకొందునమ్మా.
అను...సామినాపై ప్రేమమరచె
నామదికెంతో దిగులుదోచె॥ ॥ఏమి॥

కోరినకోరికె కొదవలాయె
కూరిమెల్ల వెగటాయె
వారచూపులే జూడడమాయె
వంచన దైవము పగదాయె॥ ॥ఏమి॥

తలచి తలచి వగచుటాయె
నిలచినచోట నిలువదాయె
చెలియరో యన్నము సైచదాయె
చిత్తము వాని విడువదాయె॥ ॥ఏమి॥

మనసురానీ మాటలాయె
వినయమెన్నడో విడచిపోయె
యెనసిలేదని ఏరాటు సేయ
యెంచిన వేణుగోపాలునిమాయ॥ ॥ఏమి॥

## 46. సావేరి - త్రిపుట

పల్లవి - చిన్నదాననే చెనకె విందరిలో నీ
సిగ్గేల బయలయ్యారా.
అను...కన్నుసైగజేసి గారడములాడేవు
వెన్నముచ్చిలిదిన్న వేణుగోపాలనే॥ ॥చిన్న॥

బొమ్మలపెండ్లికి కొమ్మలువేగ వే
రమ్మన నేసంతోషమ్మున బోవగ
సొమ్ములివిగో గై కొమ్మని చెంతకు
రమ్మని సుంతముద్దిమ్మని కొసరేవు॥ ॥చిన్న॥

పున్నమనుచు సన్నవన్నెవలువ జట్టి
కన్నెలతో నిసుగదిన్నెలచె న్నైన
గున్నపొన్నలచాయా గన్నెరులు గోయుచు
చున్న తిన్నగపొంచి చన్నులు పట్టేవు॥ ॥చిన్న॥

పండ్లుగావలె చెల్లెండ్లకనుచు గొల్ల
యిండ్లిండ్లు తిరిగి పూచెండ్లుకొమ్మని మగ
వాండ్లునవ్వగా పన్నెండేండ్లదానవు నిన్నె
పెండ్లాడేనని గూడ నిండ్లకుబిలిచేవు॥ ॥చిన్న॥

## 47. కర్నాటసారంగ - త్రిపుట

పల్లవి - చెప్పినమాట చెల్లించుకొన్నావు
చెల్లునా నీవలుగను.
అను... విప్ప పనేమిక వేణుగోపాలుడు
అప్పుడే యనలేద యతివా నీముందర ॥చెప్పి॥

మనసువచ్చిన చెలుల మాయింటికి రప్పించి
మచ్చికసేసే నన లేదా యెంతో చెప్పి
చనువిచ్చి నీకంటె చాలాగమన్నించి
సంసాలాడుదు నన లేదా యింతా
కవివిని సుంతైన కసటునోచక యుంటె
కలికి నెమ్మనలేదా ప్రొద్దుపోదా॥ ॥చెప్పి॥

అరుదైనసొమ్ములు అలదాని మెడనుంచి
అందము జూతు నన లేదా దివ్య
పరిమళగంధము పాలిండ్లపై నలది
బాగాలిత్తు నన లేదా మదిని
అరమర లేక నేనల్లిబిల్లిగా నుంటె
అలివేణి రమ్మన లేదా యిదే వాదా॥ ॥చెప్పి॥

నిన్నుగూడినయట్ల నీవు నిలుచుంటగ
కన్నె నేలుదు నన లేదా యిక
కొన్నాళ్లకీ మద్ది కొమ్మ మరచేవా
కొంగుముడి వేయ లేదా యిది
అన్ని సమ్మతించి అనుకూలమైయుంటె
అజ్జాక్షి రమ్మన లేదా తెలుసుకోరా॥ ॥చెప్పి॥

## 48. యదుకులకాంభోజి - త్రిపుట

పల్లవి - ఇంత నిర్దయుడవుట ఇది నానోముఫలము
ఇంతి నిన్ననసేలే.

అను...చింతింప పనిలేను చెలియ వేణుగోపాలు
డంతరంగము దెలిసి మనవిని
రంతము దెలుపర నాపై॥ ॥ఇంత॥

చెవినిల్లుగట్టుక చెప్పిన మాటలు
చిత్తమని విన లేదో
విద్యలకు మెచ్చిన దొర తా గాదో
ప్రొద్దయమున లేదో

యువిద నన్నలయించ యుక్తమైతోచితే
మెవరి నొచ్చుకొందు మెటుల తాళుకొందు॥ ॥ఇంత॥

నమ్మియున్నదెల్ల నలుగురి ముందర
నగుబాటు కెడమాయెగా
సరివారి మన్నలలు మిక్కిలి సేయగా
చులకతనమేగా
యెమ్మెకానికాబోటి హితవాటే పదివేలు
కొమ్మ నేటికిదెలసెనమ్మ వాని నిజాలు॥ ॥ఇంత॥

మనసిచ్చి కూడిన మంచితనమెల్ల
మరపువచ్చెనేమొగా దానివలెనే
మదిరా నడువనేమొగా బాగాయెగా
ననబోణికార్వేటి నగర వాసుడైన
ఘనుడవు వేణుగోపాలుడు గాంభీర్య పరుడైనే॥ ॥డింత॥

## 49. అపహాప - చాపు

పల్లవి - వలచితినే నీపై ముద్దుబాలా
తలచితే నామది
అను... తాళదు విరహ మగ్గలమాయె॥ ॥వలచి॥

వంచన మానవే మంచి మాటాడవే
వంచున బాడవె పంచశరుని చిలుకా
ఋంచుబోఁలల మేటివంచు సభాస్థలి వినినే॥ ॥వలచి॥

నమ్మినవాడనే కొమ్మల వేడనే
తెమ్మెర డాయనే నెమ్మది నోర్వగలనా
సమ్మతి చిగురాకు కెమ్మోవి తేనెలానగనే॥ ॥వలచి॥

దక్కితి వలలా చిక్కితినే గోలా
మ్రొక్కెద యీవేళ గ్రక్కున నేలుకోవె
చక్కెర బొమ్మరో నిక్కము వేణుగోపాలుడ॥ ॥వలచి॥

## 50. ఆనందభైరవి - త్రిపుట

పల్లవి - కుందరదన నాపై కూరిమి మరచితో
కొసరివేడిన పలుకవేమె ఆ కొనే

అను...సుందరీమణి వడి సుళ్లుబెట్టుచు యిట్లా
యెందుకు యేచేవు యికనైన దయజూడవె॥ ॥కుంద॥

కలనైనా మరువజాలనే నిన్ను
గడియజూడకున్న జాలెనే యిట్లా
అలయించిన నాదాయ మెంతౌనే
వలచి వేలునాకి వ్రతము జెరుమకొంటినే॥ ॥కుంద॥

అడుగులకు మడుగు లొత్తేనే కెమ్మో
వానసీయవె జుంటితేనె యింత
పడుచుతనమా బుద్ధి బంగారాయనే
తొడరిదై వానికే ద్రోహము జేసితినె
వేణుగోపాలుడగానా నన్ని
వేళరతుల సుఖానా కీర

పాణి ప్రేమదాచితే వచ్చికిమారున
జాణవైనావే నీసరియవరే చెలులలోన॥ ॥కుంద॥

## 51. ఆనందభైరవి - రూపకం

పల్లవి – ఒట్టుపెట్టుదు సుమ్మీ వలదు యీ సరసాలు
అను...పట్టకురా నాకొంగు గట్టిగ వేణుగోపాల॥ ॥ఒట్టు॥

ఇందుంటే వకమాట యిలు వెడలితే వకమాట
దందనకాడా రా నీదయలెల్ల దెలిసె
యెందుకు వేసుకొనేవు యెవ్వారునేర్పిరి చిన్నెలు
సుందరివలె నీకైన అందక త్తైను గాను॥ ॥ఒట్టు॥

ఎక్కడ నీమది కితవో యెవతెకు నీపై నెనరో
అక్కడికే పోవలెగా కిక్కడ పనియేమీ
కక్కసమున వకటుంటె కానిది యనిపించుటకా
చక్కగ నీవెందైనా చల్లగ యుండుటె చాలు। ॥ఒట్టు॥

తగవా శ్రీకార్వేటి నగర వేణుగోపాల
ఆగడైతి నినుగూడి చెందిన సుఖమేమి
మొగమాటము జూడని పగలెల్ల నావద్దనా
నగమాయెను ప్రొద్దైతె తగ దిందుండను నీకు॥ ॥ఒట్టు॥

## 52. ముఖారి - త్రిపుట

పల్లవి – పయ్యెద తొలగించినదె నేరముజేసి
పలుకకుందు రటవే.

అను... వెయ్యివిధమ్ముల వేణుగోపాలుడు
వెయ్యము జేసిన నెనరైన దలచక॥ ॥పయ్యెద॥

కలనైన పరసతుల కన్నుల జూడని
చెలువుడే నీపాద నేసేవ జేసెనంటే
వలదు పొమ్మనుచు ఆవలి మోమైతివి
చెలియరో నీకింత చెల్లుబడి యేమే॥ ॥పయ్యెద॥

తియ్యనీ కెమ్మోవి తేనె లీయవే యని
చెయ్యెత్తి మ్రొక్కిన చేరదీయవైతివి
అయ్యయ్యో యింత వాడనురుసు రనుకొంటె
తొయ్యలి నీకిది దోసముకాదటే॥ ॥పయ్యెద॥

నవబోణి నిచ్చిన్నవాడే జెలిమి జేసి
మోసినాడని మది నెందుకే పదరేవు
అనుకో పనేమిక నతివరో యీనాటికే
వెనక చింతించేది వెఱ్ఱితనము కాదా! ॥పయ్యెద॥

53. ముఖారి - చాపు

పల్లవి - ఎందుకు బొంకేవురా లేదని నాతో
ముమ్మోలు సేయుదురా.
అను... సుందరిదాడిన వేణుగోపాల నీ
ముచ్చువగల దానవా నాసామి!! ॥ఎందుకు॥

నిన్న దానింటికి పోలేదో
నీవది నన్నాడు కోలేదో

అన్ని యిపుడే తార్కాణగాదో
ఊరార యిట్లయితె కోపమురాదో॥ ॥ఎందుకు॥

సరసా లాడుకోలేదో
సన్నజాజులు జెడ నుంచలేదో
పరిమళ మలదలేదో
భామచే నీడె మందుకోలేదో॥ ॥ఎందుకు॥

చెలిని కౌగలించలేదో
చేరి మోవిని ముద్దిడలేదో
కిలకిల నవ్వుకోలేదో
కీరవాణిని మెచ్చుకోలేదో॥ ॥ఎందుకు॥

దయ మరున వద్దనలేదో
దక్కితినని వేడుకోలేదో
నయముగా పదమునలేదో
నాతి నిను బాయలే దనలేదో॥ ॥ఎందుకు॥

నన్ను గూడినవాడవు గాదో
నాతో నీసుద్ది దెలుపనిదో
చిన్నబుచ్చితే దోసములేదో
కన్నె నేలితినని పలుకరాదో॥ ॥ఎందుకు॥

## 54. ముఖారి — ఆది

పల్లవి – అక్కరలేని కాపురమామె
అతని మనసు వేరామె.

అను...యెక్కడిదీ దానిపాలాయె
యెవరాడిన రోసములేదాయె॥ ॥అక్కర॥

మగువ నాపేరు దలచడాయె
మమతలు మరుపాయె
పగలు రేయి అందె వునికాయె
పాళియెక్కువాయె
సొగసు లీవెనుక మెండాయె
వగలు సేయనాయె
యిగురు బోణికిది నవ్వులాయె
యేమమ్మా వలపుమందు మాయ॥ ॥అక్కర॥

ఇంటివోవ తొంగి చూడడాయె
సొంట్లు వెదకుటాయె
వొంటిగా చెప్పి చాలాయె
నోర్పు లేదాయె
తుంట పడుచు సాహసమాయె
మంటిముక్కాయె
అంటెననచు యీసు నిండాయె
ఔర అరపరాని ముత్యమాయె॥ ॥అక్కర॥

దానిపొందు సంతోసమాయె
దైవము తోడాయె
చానరో నాపొందు కల్లలాయె
సడ్డ లేదాయె
తాను వేణుగోపాలుడాయె
దయలు దూరమాయె

కానివారి కిది వేడుకలాయె
గయ్యాళే వానికి సతమాయె॥ ॥అక్కర॥

## 55 ముఖారి – ఆది

పల్లవి – తన చిత్తము వచ్చినట్లా
దయసేయ మనవే యేమే.

అను...వినవే శ్రీకార్వేటి నగర
వేణుగోపాల దేవునితో॥ ॥తన॥

చెలిని వేడుకొన్నాడట చెయ్యెత్తి మ్రొక్కినాడట
అలివేణితో నన్నేమేమో అనుకున్నాడట
నళినాక్షికి గుడిముంగర నమ్మిక లిచ్చినాడట
జలజగంధి విభుడెంతైన చల్లనై యుండుటేచాలు॥ ॥తన॥

తొడరి యీదిక్కు జూచితె దోసము వచ్చునననట
పడతివద్ద మీసముదిద్ది పదురుకొనెనట
తడయక నా పేరు దలచి పుడక ద్రుంచివేసెనట
అడుగులో వేయిగుణములైతే అతని దిద్ద నెవరివశమె॥ ॥తన॥

మోహనాంగుడు నను తొలుత మోసపోయిగూడెనట
ఆహరిసాక్షిగ యిక న్ననంటుకోడట
సాహసురాలని నిండు సభలో వాకొన్నాడట
స్నేహము నాటియుండితె చెలుపునికే దయవచ్చునీ॥ ॥తన॥

## 56. అసావేరి - ఆది

పల్లవి - వంచనలకు గురుపీఠమురా యీ
చంచలాక్షి యనగా

అను...మంచిదిక కదా యంటివి యిక పలు
మాటలేల వేణుగోపాల॥ ॥వంచన॥

కండ్లు తేలించి కులికి నవ్విన
కౌగిలించినా పువ్వుల
చెండ్లు దెప్పించి శిఖను జుట్టిన
చెక్కిలి నొక్కినా
గుండ్ల పేరు నీకు కానుకిచ్చిన
గుసగుస లాడినా
ముండ్లమీది వలువ సామ్యమేగా
ముదిత వలపు తిన్నగ దెలిసేనీ॥ ॥వంచన॥

అడుగులకును మడుగులు తా పరచిన
హారతులిచ్చినా - కర్పూర
పీడెము సేయమని లాలన పెదవిమీటినా
గడియకొక్క వింత సొగసు జేసిన
గంధము బూసినా
పుడుము కలుగులోని చెయ్యిసామి తె
యువిదె నెనరు తిన్నగ దెలసేనీ॥ ॥వంచన॥

మూతిసాచి ముద్దిమ్మని కొసరిన
ముచ్చట జెప్పినా తన
చేతవిరుల సురటిబూని విసరిన
చేలాగిచ్చినా
రాతిరి నీమనసు రంజిలగ రతులగూడినా
కోతిచేతి మాణిక్యము సామి తె
కొమ్మమనసు తిన్నగ దెలిసీనీ॥ ॥వంచన॥

## 57. సావేరి – ఆది

పల్లవి – పూసలోని దారమువలె యెంత
జేసె నమ్మినందుకు అయినా బల్
అను...మోసమే అడిగితే తగని
రోసమే వేణుగోపాలుడు॥ ॥పూస॥

ఎవతె యింటికిని పోననె నాతో
యెందరింట్లు తిరిగివచ్చె గడియలో
శివశివా అతని మోము జూచితే
సేతుమాత్ర పోయి వచ్చిన దీరదు॥ ॥పూస॥

అటకమీద చలువ చీర సైగగ
ఆపెకిచ్చి సేవించు కొనెనట
కటకటా వీని పేరు దలచితే
కాశియాత్ర పోయివచ్చిన తీరదు॥ ॥పూస॥

నాయకసానుల సంగతి నిమిషము
బాయలేదు నన్నువలచి పొల్లక

మామచేసి గూడినందుకిక చాం
ద్రాయణము చెరియించిన దీరదు॥ ।పూస॥

## 58. కాపి - ఆది

పల్లవి - వక్కకైన నాసలేదు గదవే
వాని చెలిమికొక దండమే మంచి

అను...చక్కని వాడైతే నిండునటే
సఖియ వేణుగోపాలుని చేతి॥ ॥వక్క॥

చెడ్డ చేని కింటివడ్ల పొంగలి
జేసినట్లు యెదురుపు దరిశించితె
దొడ్డరసికు డనుచు పేరు మాత్రమె
గుడ్డి గవ్వ జూచితె నీయాన॥ ॥వక్క॥

ఉడుముబోతె పోయినది చైమాత్రము
విడిచితే చాలు ననే కథగా
పడతి తాను కుదువబెట్టిన సొమ్ములు
పైకమిచ్చి విడిపించితె చాలద॥ ॥వక్క॥

మొగమాటమున మాటతోయజాలక
మునుపు యెవతో కడుపాయె నందురు
వగయింత లేక వాని గూడితి
వుసురు వుంటే వుప్పమ్ముకోగల॥ ॥వక్క॥

## 59. ధన్యాసి - చాపు

పల్లవి - ఇచ్చిన మంచిదె యివకున్నా మంచిదె
యింటికి రమ్మానవే.

అను...వచ్చితే యేమన వలదే మెచ్చుకొనీని
మెచ్చరాని చుట్టమే వేణుగోపాలు॥ ॥డిచ్చి॥

కలనాడు వకగవ్వగా సెలవుసేయడా
కలిమి లేము లనగ కావటికుండలు
కలకాలమొక రీతి గావచ్చునా వుండి॥ ॥ఇచ్చి॥

మేలుదలచక యీవేళ పోపొమ్మంటె
వాలుగంటి దైవము మెచ్చునా
ఆలోచ నెందుకే అతడు మనకు వేర
కాలముబోవును కడను మాటనిలుచు॥ ॥ఇచ్చి॥

నేడువచ్చిన నెనర నెలత నన్నురతుల
గూడిన ముచ్చట గురు తెరుగవా
ఆడికులకు లోనైదున బాగాయ
ఓడల బండ్లౌచ్చు బండ్లు నోడలబోవు॥ ॥ఇచ్చి॥

## 60. శంకరాభరణం - ఆది

పల్లవి - తేనెంబూర మాటలాడకు తెలిసె నీనెవరు.

అను...మానినీ మనోహర శ్రీసాళువ
మాకరాజ కార్వేటి రాజేంద్రా॥ ॥తేనె॥

పండుగనుచు వెచ్చాని కడిగితే
పల్లిపట్టు రెండా నాపై
కొండెకారి మెడకు మంచిబంగరు
గొప్పగుండ్లదండా
నిండు కొలువులో బిరులించితివా
నెలత కొప్పునిండా యిక
వుండవలద యిటువంటి నేస్తము
యువిదె నెనయుచుండ వదలకుండ॥ ॥తేనె॥

ఎక్కువైన ముత్యాల పాపట
యింతి కీయలేదా మొన్నె
లెక్కలాడి నాచేతి కిచ్చినది
యొక్క చీర గాదా
నక్క వినయములు జేసేవారికి
చక్కని మరియాదా నే
నిక్కమేమంచి నోమునోచితె
నీకే దయరాదా యికమీద॥ ॥తేనె॥

మరుని కేళి మెప్పించినందుకు
మగువకింత ధనమా నా
సరసజేరి యేలుకొమ్మంటే
సామీ దంధనమా
అరుదుజేసి యా చెలినే పొగడే
వౌరా నెరతనమా తన
పెరటిచెట్టు మందుకు గైకోంని
పెద్దలనగ వినమా యిది ఘనమా॥ ॥తేనె॥

## 61. ఆనందభైరవి - ఆది

పల్లవి - దాని కెవ్వరుసాటీ ఆ వెలది నీ కే
తగురా రాజకిరీటీ.

అను. . .మానిత వరగుణ పేటీ నీపై
మరలుకొన్నదిరా మాబోటీ యికనిను
మానదురా భానుసమ తేజా
మాకరాట్కార్వేటి రాజా॥ ॥దాని॥

మగువను సభల నెన్నుదురు
మామనదలించు నెన్నుదురు ఆ
వగలాడి పల్వరుస కుదురు మేటి
వజ్రమణులనుచు బల్కుదురు యీ
జగతి దాని కెవ్వరు నదురు విరి
జాజులంపె నీకు నదురు మంచి
నిగనిగలు గల మొగము తమ్ముల
దెగడు చనుగవ బొగడ తగునిక॥ ॥దాని॥

వనజగంధి కనుల దీరు చూడ
వలరాజు చేతి కిలి తీరు ఆ
ఘనవేణి మెరుగు నూగారు సౌరు
గణుతింప ఫణులిడు గారు
నిను రమ్మనె పలుమారు తూపు
మొనల కోర్వదు పలుమారు అను
దినమునను చెలి మనము సమ పెన
గొని తమి యింతనగ వశమా॥ ॥దాని॥

సుదతి నెన్నగ శ్రీలమిన్నా దాని
శృతులవై కరి శ్రీలమిన్నా ఆ
మదవతి కేగాను సున్నానాదు
మనవి వినవా మనసున్నా
బెదరించు కురు లక్షుల కన్నా గొప్ప
పిరుదులు చక్రముల కన్నా సామి
అదనిదని మరుకదనమున సతి
నెదనుతమి వదలకను గదియర॥ ॥దాని॥

## 62. శంకరాభరణము - త్రిపుట

పల్లవి - వలదు యీమాట లేలరా మది హితవైన
వనిత యిల్లిది గాదురా

అను... వెలయ శ్రీ మాకరాజ వీర కార్వేట్రాజేంద్ర
చెలులు దెలుపగ దెలిసె నీవగలు చాలు పదివేలు॥ ॥వలదు॥

కరుణచేతను కోరి మోహించియా
కనకాంగి నినుజేరి మఱిమఱి తమి మీఱి
విరహాభరముచే తరము గాక తారీ మరులూరీ
తరుణి గురుకుచ గిరుల నురమున
నొరసిమురిసిన సరస మెల్లను
మరచి వత్తుర యేర యీదారి ఓరోరి॥ ॥వలదు॥

సగమురే వేళాయరా నీరాకకై
సఖియ యెదురు జూచురా
తగని ముచ్చట లేలరా నేనొకటంటే

పెగటు దోచ దటరా బాగేనటరా
మగువ లెల్లను నగగ సీవిటు
అగడు సేయగ నగున జిగిబిగి
సొగసు మిగులగ పెనగ గల నటరా
నన్నంటకురా॥ ॥వలదు॥

సతతము నను చాల

మెచ్చియుండిన జాణతనము లేల
బతిమాలు కొనేదేలా వినయములకునే
నతిబేలనా యిట్లేల చతురోక్తు నేల
తతిని దెలుసుక అతివ వలె బహు
గతుల నిన్ను పరతుల నెనయుచు
సతులు మేలన ఘనుడ నేజాల నీచర్య లేల॥ ॥వలదు॥

వనజాక్షి బోటు లెవరైనా యిచ్చటయున్నా
వనిదాని సముఖానా మనవి జేసిరైన
నెరనమ్మిన చనవ నుంటైనా కొనియాడునా
అనువుగను ననుదినము యాజ
న్వనిని గలసిన పనులు హాయలుగ
తనిసి యున్నది నీకుమనమునా॥ ॥వలదు॥

పలుమారు ఎంతకొసరిన మునుపటివలెనే
బాళితో మనసిచ్చేనా చెలువుడనుచు జూచేనా
ఇకమీదనా యిలుజేర రానిచ్చేనా, చనువిచ్చేనా,
తొలుత చెలిమిని కళలు గులుకగ
కలిసి మెలసిన సెలవు దలతున
తలపు తెలియని వలపు తగవేనా యేమైనా॥ ॥వలదు॥

## 63. బిలహరి - త్రిపుట

పల్లవి – ఏల నే యీచల మేల నే పలుమారు
మేలు దానన వే వినవే

అను...బాలరో వేణుగోపాలుడు నన్నింత
జాలి జెందించి యాలోలాక్షి యిలు జేరె। ॥ఏల నే॥

కుటిల కుంతలి విను నిన్నటి రేయి విరితోటా
కటుల రమ్మనె నట విటరాయడిటుల ఆ
విటుకులాడిని బిగి కౌగిట జేర్చి మేటా చా
కటు లిచ్చినాడట యెటుల సైతునె నిచటా॥ ॥ఏల నే॥

కొమ్మరమ్మని నినే నమ్మినానని విభుడా
యెమ్మెలాడి జడను కమ్మని మగువంపు
రెమ్మలు సవరించి సొమ్ములు ధరియించి
నెమ్మది గూడినాడమ్మ మనమ్మున॥ ॥ఏల నే॥

ఎంత సంతోసముగా కాంతలలో మేలైనా
హాంతకారివే యని శ్రీకాంతుడు ననుగూడి
నంతలో దాని యేకాంతము మదిదలచి
పంతగించి నటుల చెంతకు రాడాయె॥ ॥నేల నే॥

## 64. పంతువరాళి - త్రిపుట

పల్లవి – వట్టి చూపులతోనే వలపు బుట్టించ నీ
వలె నెవరీ జగతీ వేరే ఇదినీ

అను...పుట్టుక దినుసేమొ పొలతి కలయ చైచె
తట్టిన గువగానె తనువు ఝల్లుమనగ॥ ॥వట్టి॥

సందెవేళనీవు మాసందు వీధిన వెడలి
సుందరవదనలతో గుసగుసలా
ముందు వచుచ్చులేని ముచ్చువగల తొలవై
మందిలో గ్రక్కున మాటి మాటికి తిరిగి॥ ॥వట్టి॥

నిన్న జగన్మోహినివలె తళుకుగ
అన్ని సొగసుల నీవందముగ
చిన్నగ తిలకము దిద్ది యద్దమెదుట
వన్నెలాడిరో తలుపు వారజేసుక తొంగి॥ ॥వట్టి॥

పల్లవాధరి నన్ను గోపాల రమని బిలచి
అల్లిబిల్లిగా నుండి యాదరించి
కల్లలాడిరో మరుని కార్పణ్యములుబాయ
కొల్లగ రతి నేలి కోరికె దీర్చక॥ ॥వట్టి॥

## 65. పంతువరాళి - అట

పల్లవి - వింటిరేమే చెలులారా వాని చెరియలు
గంటిరేమే సఖులారా.

అను...గొంటుకాడై తిరిగే వేణుగోపాలు డలివేణికుతురి
గంటీలు దొంగిలిచి చిత్రగంటి చేసు చేరెనట॥ ॥వింటిరే॥

ఇందుబోణింట్లో వుయ్యాల మంచముమీద గూర్చుండి
పంచదార నెయ్యి పాలారగించి మందపయికర
కంచుచీర చంకలో యిరికించుకొని గడియదీసి
కంచికావల తెల్లవార కదిలెనట కాలికొద్ది॥ ॥వింటిరే॥

సరసుడ నీవద్దజేరి మురియుచు బాగాలందిచ్చి
పరిమెళగంధి పక్కలో పవ్వళించి తా
సరిప్రొద్దున లేచి దాని సరిపెణ కత్రించుకొని
తిరవళ్లూరు దాటిపోయి తిరిగిచూచి నవ్వెనట॥ ॥వింటి రే॥

ఈవికాని వలెనె చెలిని హితవుగా డగ్గర దీసి
తావు తావు లంటి రతుల తనియించేవేళ కత్తెర
బావిలి విడుచుకొని సరిగ పయిట కొంగున తేలుగట్టి
భావించినపుడె సపుదూరు బంకాపురము కదిలెనట॥ ॥వింటి రే॥

## 66 శంకరాభరణము - ఆది

పల్లవి - అలుక జేసి పలుకడేమొ యాచెలి
వలపుమందు జలిమో
అను... వెలది వినవె శ్రీకార్వేటినగర
నిలయుడైన వేణుగోపాలుడు॥ ॥అలుక॥

కలికి చిలుక పలుకులకును సొలయుచు
చెలిని గోరినాడే నను
బలిమిజేసి వలచియున్న బాళిని
కలసి మెంచినాడే
తళిరుబోణులలో బలువిధముల నిటు
చులక జేసినాడే యిక
చెలిమి దలచి కలసి మెలసి అలయక
వలపు నిలుప గలన లలన చెలుడు॥ ॥అలుక॥

తెగువతోడ నా మగువకు వెలగల
నగలు యిచ్చినాడే నే

సగము రేయి వేళ నగరు బంపితె
అగడు జేసినాడే
వగలుజూడ నే సొగసుగ బిలిచితె
నగవులాడి నాడే యీ
వగలు వలదు సుగుణముగల నగధరు
దగిలి పొగడి తగదను బహుఘనముగ॥ ॥అలుక॥

సరసముగను యీ సరసిజ ముఖిపై
మరులు జెందినాడే నే
సరసజేరి కరుణ జూడమనినను
విరస మాడినాడే
తరుణి వినవె మును సురతము నేలిన
సరణి మరచినాడే యీ
మరుడు శరము చురచురమని గురుతుగ
నురము నొరయ బరపె తరమ మరిమరి॥ ॥అలుక॥

## 67. ఆరభి - ఆది

పల్లవి – నేను నీవు కనుగొన్న వేళే మొగ
నేస్తము బొయదుగా మరిమరి
నెమ్మది గలిగెనుగా.

అను... మేను నీ సొమ్మని యానలిడుకొని
మెచ్చితి యీడన వేణుగోపాలుడని॥ ॥నేను॥

చిన్ననాడు పండువెన్నెలలో యిసుక
దిన్నెలపై సురపొన్నల పొన్పున

పన్నీరు జల్లుక పవళించె లాహిరై
యెన్నెన్నో విధముల యెదనెద నదుముక॥ ॥నేను॥

ఊరినుంచి కలలోవచ్చి పైకొన్నట్లు
వులికి దిగ్గునలేచి నే నెదిరించినట్లు
తీరుగాదని డింకి తిరిగి సొలసినట్లు
చేరి లెమ్మన్నట్లు చైచై పట్టినట్లు॥ ॥నేను॥

మగడు వినిన చుట్టము లెడబాసిన
తగదని భూపతి దండన జేసిన
అగడైనా యెంత పాపము వచ్చిన
జిగిజిగి సొగసుగ వగలు పెనగొన॥ ॥నేను॥

## 68. ముఖారి - ఆది

పల్లవి - చాలుచాలు వానినేస్తము యిక
నేలనె మనకూడ

అను... బాలరో వరద నారాయణు
డా లతాంగి గూడి మెలగి యుండు నె॥ ॥చాలు॥

ఆసజెప్పి గుడిముందర యిచ్చిన
బాస మరచెకొమ్మా యీ
దోసకారి యెందరినో యీవగ
మోసబుచ్చెనమ్మా
నా సరైన చెలులువిన్న వికవిక
నవ్వరేమమ్మ విన

దోసమో కలిగిన మాటంటె
రోస మెందుకమ్మ పోవమ్మ॥ ॥చాలు॥

తనువు తనది జేసియున్న నావం
తైన దలచడమ్మా యేదొక
మనవి దాని కెరిగింపక వినడట
మంచి పనేనమ్మా
నెనరువాని జాడ లాడకాడకు
నేడుగంటికొమ్మా అతి
వినయమెల్ల ధూర్త లక్షణమనే
విధమాయెగదమ్మ లేవమ్మ॥ ॥చాలు॥

వరద నారాయణ సామెంత
వంచన వాడమ్మా నా
సరస జేరి ననుగూడి లేవనుచు
సాధించె గదమ్మ
యిరవు పల్లిపట్టై తేనే తన
యెక్కు వెవరికమ్మా యే
మెరుగనట్టివాని వలెనె వుండి
యెంత జేసెనమ్మా వలపమ్మ॥ ॥చాలు॥

## 69. ఆనందభైరవి - ఆది

పల్లవి – రమ్మనే యీ మేను వాని సొమ్మనే
కౌగిట జేర్చు కొమ్మనే మోవి తేనె లిమ్మనే
అను... బాలనే తమక మణప జాలనే పతిజూడవి సాగ
సేలనే యీ జవ్వన మేలనే॥ ॥రమ్మనే॥

మించెనే మరుడు నన్నాదరించెనే శుకశారికెలు రవ
ళించెనే నెలరాజు గర్వించెనే॥ ॥రమ్మనే॥

వాదటే యీమేను నీదేగాదటే వానినిందు తే
రాదటే నెనరింతైన లేదటే॥ ॥రమ్మనే॥

మెచ్చెనే దాని నడిమీకి దెచ్చెనే మేలైన బిరుదు
లిచ్చెనే యెంతపని వచ్చెనే॥ ॥రమ్మనే॥

నాయమా వెతలు బెట్టుటాదాయమా వొంటిగానుండే
పాయమా నాచెలిమింత హేయమా॥ ॥రమ్మనే॥

చూచునా తొలుతటిప్రేమ దాచునా మనసున దయ
తోచునా నేరము లన్ని కాచునా॥ ॥రమ్మనే॥

ఒట్టుబెట్టి నన్నేలీనా వరదా నారాయణుడా పల్లి
పట్టునా తిరుగా చెట్ట బట్టునా॥ ॥రమ్మనే॥

## 70. ఘరజు - ఆది

పల్లవి - రాజీవాక్షిరో సామిని రాజిగ రమ్మనవే
అను... రాజసమున మా యింటికి రాచెల్లదు కనవే॥ ॥రాజీ॥

చెలులేమే మొగబోసిరో చెలువునితో నేడు
పలుమరు యెంతో వేడిన పలుకక యున్నాడు॥ ॥రాజీ॥

తా యిచ్చిన నమ్మికలంతా యిపుడే మాయ
హా యేమని దెలుపుదున హాయే లేదాయె॥ ॥రాజీ॥

వూరకె మది నొప్పించితె వూరట యేమమ్మా
వేరుగ నను జూచితె నవ్వేరు గదే కొమ్మా॥ ॥రాజీ॥

వరదా నారాయణుడీ వరదాక నన్నేలి
సరిదానికి యసమిచ్చి కొసరి తా బతిమాలీ॥ ॥రాజీ॥

## 71. ముఖారి - త్రిపుట

పల్లవి - అరుదు గాదటవేమె యమ్మనే జెల్ల నే
డతడిందు వచ్చినది

అను...సరసిజముఖి అన్నుణ సరసీతటి నెలకొన్న
పరమాత్ముడైనట్టి ప్రసన్న వెంకటశౌరి॥ ॥అరుదు॥

దక్కితినని చెలులెందరో చుట్టు తిరుగగ
వక్క తేప కడపైన తొక్కినాడటే యింక
యెక్కడి మోహామే యెపుడు నిన్నెరుగడు
చుక్కవంటి ముత్యము ముక్కర తీసుకొని॥ ॥అరుదు॥

నిగ్గు లెంతసేపే సిలువుటద్దము మానీ
సిగ్గు పడకపోవె దగ్గరి పిలచీనీ
యెగ్గు బెట్టేవుసుమీ యేపని జెప్పిన
మొగ్గల పని చీర మొన్న నే తీసుకొని॥ ॥అరుదు॥

ప్రేమమీర నిన్ను పెనగి కూడేవేళ
రామామణిరో యుపరతి గానీ ముందర
సామిగాదా యని వంచాడించ బోయ్యేవు
నేమము శేషైని సేవళము దీసుకొని॥ ॥అరుదు॥

## 72. కాపి - చాపు

పల్లవి - నను గురుతు దెలియ నిచ్చిన యీ భాగ్యము మీద
నాతివల్ల నేరమా యేమె
అను...అనృణ సరోవర మనుకోగా వినలేదా
ఘనవేణి ప్రసన్న వెంకటశౌరి నేగాదా॥ ॥నను॥

సగము రేయి దాక సంధానా లంపించి
వగలాడి నీవు నావద్దికి రాలేదో
ఇగురుబోణిరో యీసుద్దెరుగకుండ నాడీ
మగరాల కమ్మ లేమగడిచ్చెనే నీకు॥ ॥నను॥

తలిరాకువంటి పాదము లొత్తుచుండగ
అలసితివని నీతో అన్నదైన కద్దా
తలపు రాదుగ యిసుమంతైన నీ మదికి యీ
గిలకల మంచ మేచెలువు డిచ్చె నీకు॥ ॥నను॥

ప్రాణ దానవె తలదడివి బాసజేసిన
యేణాక్షి నమ్ముదుర యెంతటి పనికైనా
మాణిక్యములు చింది మాటలాడితె నీకీ
వీణ దీసిచ్చిన విటకాని పేరేమె॥ ॥నను॥

మరుపు వచ్చుటకు మహా నింత గావలెనా
సిరులు మించిన వారస్త్రీల ధర్మమే గాదా
పరిమెళవతి యీవుప్పరిగె గట్టించిన
దొరయెవరో దెలుపవే దోసకారి సుంత॥ ॥నను॥

వింత యిది యేమైన విరిబోణి నిను బాసి
అంత నిన్నటికి పదహారేండ్లు మట్టుగ

కంతుకేళి నన్ను గలసి నందుకే సాక్షి
ఇంతి తోలు చూలు కొడుకెవరి పోలికె అయినా॥ ॥నను॥

## 73. ఘంటారాగము - ఆది

పల్లవి - తటుకు తటుకు మని యదరీనె గుండె
దిటవు లేదె నీ సాక్షిగా

అను...కుటిలకుంతలి యన్నృణ సరోవర
మట ప్రసన్న వేంకటశౌరి మొన్న
చిటికిలో వలపించి పోయెనే
నెటులనైతు దెలుపవె నా రొమ్మున॥ ॥తటుకు॥

నిలువ నీయదు నిలిచిన చోట
నిమిష మొక్క యుగ మాయెనే
పలుకనీదు ప్రాణసఖుల మీది
బాళి యెపుడు మరువాయెనే
తలచి తలచి వేదనచే గుందితి
తలవాకిట నిలచి యెదురు చూచితి
లలన యీతనిపై రోసితి
చెలువరాయని బాసిన మొదలుగ॥ ॥తటుకు॥

అన్న మేమో నా జిహ్వకు సుంత
హాయనేది లేదాయనే
కన్నెరో విరహాగ్ని చేత
కరగి మేను సగమాయనే
అన్నిదైవముల వేడుకొంటి
అతనికైన వారిని శరణంటి

యెన్ని శకునములో జూడమంటి
యెమ్మెకా డిటకు రానందున॥ ॥తటుకు॥

రతులు దేలించిన నాసామి
రాక సమయ మిటు జేసెనే
అతివరో సరివారు నవ్వగ
అగడు నాతల వ్రాసెనే
పతిని విడచి నేసేవగ సైతు
పణతి యీ తొడవు లెచట వైతు
మితము మించె చిలుక తేజి రాతు
మేలువాడు వేంచేసే టంతలో॥ ॥తటుకు॥

## 74. ఆనందభైరవి - ఆది

పల్లవి – నీ యింటికి నీవు వచ్చేటందుకు
నెలత నంప వలెనా

అను...రాయబారమా చిరుతని చెంగల్వ
రాయా యిదీ మా బాగాయ॥ ॥నీయింటి॥

ఎపుడు వత్తువని యెదురే జూచుచు
యెవరు వచ్చినా శకునము లడుగుచు
కపట దైవాల కెల్ల మ్రొక్కుచు
కరగు చున్నను చే బిలచుచు॥ ॥నీయింటి॥

ఒకటి రెండనుచు దినములు యెంచి
వద్ద దిరుగు చిలుకల నదలించి

సుకము 'లేక పై పై తమి మించి
సొలయుచున్నను పొంద దలంచి॥ ॥నీయింటి॥

చెలుల కందరికి లంచము గట్టి
శయ్యమీద చెక్కిట చెయిబెట్టి
వలరాయని రోయ బాయ దిట్టి
వగచుచున్న నాపై దయబుట్టి॥ ॥నీయింటి॥

## 75. నందభైరవి - త్రిపుట

పల్లవి - వలచి వచ్చిన దానరా మది తమిదీర
మెలగి కౌగిలీరా
అను...చెలులు నవ్వేరురా చెంత జేర్చుకోరా
లలితుడవా శ్రీకళ్యాణ వేంకటేశ్వర॥ ॥వలచి॥

అలగి యుండుట ఏలరా నేరమేమిరా
పలుకరించ రాదా ఔరా
చలము సేయకె రాసామి నీకు మ్రొక్కేరా
నిలచి మాటాడర నీ కెదురే జూచితిరా॥ ॥వలచి॥

మరుడు నన్నెదిరించెరా యేమితోచదురా
విరహ మగ్గల మాయెరా
నెర నమ్మినానురా నేటి నే స్తమటరా
తరి దెలసి యేచకురా తనువు నీ సొమ్మేరా॥ ॥వలచి॥

ఎంతని వేడుకొందురా మోహనాకార
యెన్నాళ్లనుసరింతురా

అంతరంగ మీవేర ఆదుకొందువు రారా
కంతుకేళి గూడరా
కళలు చెలంగెనురా॥ ॥వలచి॥

# ద్వితీయ భాగము - దేశీయము

## 76. బేగడ - ఆట

పల్లవి - నీపొందు సేయక విడచేనా వేరే
నెలకొప్పున విరులుముడిచేనా అరే

అను...బాపురే నేసేయు ప్రతిన చెల్లకపోతే
నాపేరు ఇక వేణుగోపాలు డనవలెనా॥ ॥నీపొందు॥

మరునిగూర్చి తపము సేయనా యీడా
మనసులేదంటేనే ఆయెనా
మరులు నిలుపలేక మరిమరి వేడితే
కరుణమాలి యట్టె కండ్లెర్రసేయగానే॥ ॥నీపొందు॥

పాట బాడి మెప్పించనా నీపై
పదము జెప్పి వలపించనా
బూటకాలమారి నీపుణ్యా మనేకొద్ది
మోటుబారుకొని మొగము చిట్లించగానె॥ ॥నీపొందు॥

కూనలమ్మకు వేట గొట్టనా నిన్ను
గూడితే పొంగళ్లు బెట్టనా

చానరో బతిమాలి సరసకు రమ్మంటె
కాని లే లెమ్మని కసరి పొమ్మనగానె॥ ॥నీపొందు॥

## 77. భైరవి - ఆది

పల్లవి – నీకూతురి నడతలు నీ కేసరి
లోకులెవరు మెచ్చరమ్మా

అను... ఈకాడికి తెల్లవారెగద న
న్నికను వేణుగోపాలు డనదట॥ ॥నీకూతురి॥

నిదురబోతే లేవ మనసు బుట్టదు
నుదుట యేనాడు బొట్టు బెట్టదు
ఇదియుగాక తమలపాకు ముట్టదు
ఏడాదికి కొప్పు విడచి కట్టదు॥ ॥నీకూతురి॥

నీనాచేత వకనాడు ముట్టదు
వింత జూచినా నవ్వుబుట్టదు
రాణివాసమట అడుగటు బెట్టదు
రామరామ సొగసనేది గిట్టదు॥ ॥నీకూతురి॥

నేనుగూడేది తనకు గూడదు
నెనరు గూర్చి నాతో పలుకాడదు
పూనినట్టి మంకుగుణము వీడదు
బుద్ధిమాట జెప్పేరని చూడదు॥ ॥నీకూతురి॥

## 78. భైరవి _ ఆది

పల్లవి – బిఱ్ఱబిగుసుకొని పిలిచి తెరావు
భీష్మీకరించుకొని

అను... వెర్రివెర్రి పోకలీడ సాగవు
వేణుగోపాలుడు నా పేరు॥ ॥బిర॥

గొప్ప ముత్యములు దెచ్చిన జాడ
కోమలాంగి విన్నవించ గానె
కొప్పుపీడ జారుపయిట తొలగగ
రెప్పపాట్లు రావేదటె యిప్పుడు॥ ॥బిర॥

పెద్దరాకడి దెచ్చిన సుద్ది
ముద్దుగుమ్మ మందలించగానె
అద్దమచట పారగుమిక్కి బిరబిర
మిద్దె పయికి రాలేదటె యిప్పుడు॥ ॥బిర॥

పతక మొకటి నా దగ్గర జూచి
భామామణి సైగ సేయగానె
అతివ అన్నిపనులు మాని నన్నుప
రతుల నేలుకొంటివి గదె యిప్పుడు॥ ॥బిర॥

## 79. తోడి _ ఆది

పల్లవి – చేతి సొమ్మొవరయిన యిత్తురా
కూతురా యిల్లు సేతురా యేమె

అను...పాతకురాలా నీకు వేణుగో
పాలుడెక్కడ దాపురమాయె॥ ॥చేతి॥

ఎంత మంచి తీర్చైనదే ముసి
లవ్వ తాళిబొట్లు యేమో
వింతగా పచ్చల మొలనూలు
వేలి వెండి చుట్లు
అంతకన్న చూడ చూడ ముచ్చట
అక్క చేకట్లు అయినా
యింత పెద్ద వెళు పేనా పతకము
యీనగాచి నక్క కిచ్చినట్లు॥ ॥చేతి॥

అల్లుడౌ నాపాలికి వాడొక
అప్పాల కావమ్మ భువిలో
నల్లవాని నమ్మరా దనే నుడి
కల్ల గాదమ్మా
యిల్లుజేరి లోతు పాతు గని పీ
డెంత జేసె నమ్మా యిక
పిల్లదిన్న కోడిని రా రమ్మని
పిలచితే పలుకునే నమ్మమ్మ॥ ॥చేతి॥

వడ్డికాశించి మొదలు పోయిన
వార్త నిక్కమని దెలసెను సుంత
సడ్డలేదుగదవె చదువ బెట్టిన
సామిత్రై ధర వెలసెను
దుడ్డు సెలవు సేయలేక జూజుగుచు
తొడరి నిన్నే యెనసెను యిది

అడ్డెడు బియ్యము దెచ్చి యిచ్చి మా
యమ్మ నీప్రసాద మన వలసెను॥ ॥చేతి॥

## 80. తోడి - చాపు

పల్లవి - తల్లి చెప్పిన బుద్ధి దలచితె నాగుండె
ఝల్లు ఝల్లను నులే

అను...అల్లుని కోరికె లాపెకే సమ్మతి
పల్లవాధరి మారుపల్లి పట్ల కాశించి॥ ॥తల్లి॥

మగనాలనుచు సోకరాదట పెద్ద
మహాలు మీాద ఉంచేదట యీా
సొగసు దక్కరు చూడరాదట రే
పగలు నన్ను పక్క బాయనీయడట॥ ॥తల్లి॥

ఇంటికెవ్వరు రా రాదట పొరు
గింటికైన పోనీడట వెను
వెట కావలి దిరిగేదట నా
వంటి బిడ్డను వాని వశము జేసీనట॥ ॥తల్లి॥

పందెము లాడుచు గూడేదట వచ్చి
పదము బాడి నవ్వించేదట యిట్లా
కొందరు సమ్మతైనారట వేణు
గోపాల రారమ్మని బిలచేనట॥ ॥తల్లి॥

## 81. సారంగ - త్రిపుట

పల్లవి - నిన్ను యేమని వో కన్నెరో మగని
కన్నుల జూడక యున్నావు ఇపుడు

అను...పన్నగ శయనుడౌ గోపాలునిగూడి నీ
వెన్ని పనులు జేసిన అన్ని దెలసియుండి॥ ॥నిన్ను॥

చుట్టు కొల్లారిండ్లు గట్టుక యెపుడు
పుట్టినింట నుండి రట్టుగా
పెట్టెల కొలది మేల్ పట్టుచీరలు జేర్చి
గొట్టు పడితివే మెడను బొట్టుగట్టిన విభుడు॥ ॥నిన్ను॥

ఖజ్జాయములను దెప్పించుక నీవు
బొజ్జలనిండ భుజియించుక
గజ్జలందెల రవళి ఘల్లుఘల్లని మ్రోయ
లజ్జమాని పతిని భోజ్జవలెనే జూచిన॥ ॥నిన్ను॥

చెలియ నీ వయసిట్ల చెల్లెనా వాని
కలయరాద నీకి కనరేమే
నెలత నీసోదరి నీకన్న మేలేనె
యిలను మానడతలు కులమువారు విన్న॥ ॥నిన్ను॥

## 82. సావేరి -- చాపు

పల్లవి - మోసము పోవద్దురా వేశ్య
మోహము పట్టెది లేరా చేతి

అను...కాపురు మూల మిదేరా చెలికాడ
యింతటనైన మేలుకోరా॥ ॥మోసము॥

దాని తల్లి చెడ్డ తొత్తు అన్న
దమ్ముడైతే యింద్రజిత్తు ఆ
చాన సోదరి పలువిత్తు వక్క
సారెతీసెగ హంసల పనినత్తు॥ ॥మోసము॥

ఉప్పుచట్టి అమ్మించు చెవులు
వుండేది కుదువ బెట్టించు రేపే
అప్పుల పాలు సేయించు సెలవు
కై పాయతే తెమ్మని కోపగించు॥ ॥మోసము॥

ఇంటి పనంతా సేయించు నో
రెత్త వద్దని వాయించు బలు
గొంటెకాడై చెరియించు వేణు
గోపాల నిను రతి గూడి వాదించు॥ ॥మోసము॥

## 83. మధ్యమావతి - చాపు

పల్లవి - ఇప్పుడు గాక యింకెప్పుడు బెదరించే
వింతి నిన్నన దోసమా

అను...చప్పుడు సేయక వేణుగోపాలుడు
చంక బెట్టుకొన్న సవి గాదట వేమే॥ ॥ఇప్పుడు॥

చుట్టు కొల్లారిండ్లు సుంతలో విడిచాయె
పట్టెమంచము దూది పరుపు లాయె

పెట్టెలకొద్ది కట్టు వర్గములాయె పెరిమెలదనమాయె
కట్ట విడువ చేతకాసు వీసమాయె
వుట్టిమీద నేతి వుగ్గాలాయె
పట్టిన పనులెల్ల బంగారు చెరువాయె
వట్టాకు వుడికించే చట్టి దూరమాయె॥ ॥ఇప్పుడు॥

పడతిరో వూరూర పైరు పచ్చలాయె
కడలేని ధాన్యాల కణజలాయె
మెడదిప్ప రాకుండ మినుకు సొమ్ములాయె
మెరుగు టద్దము లాయె
నడితీలో యిప్పుడు నాగరీకమాయె
నానాటికి పని నాణ్యమాయె
వడినిండా తరగని వక్కలాకులాయె
ముడికే చాలని గుడ్డ ముచ్చట మరుపాయె॥ ॥ఇప్పుడు॥

ముప్పూట భోజనమ్మే మంచి వొప్పాయె
కొప్పులోకి పూల గుత్తులాయె
అప్పుడు నీసాగ సతనికి మెప్పాయె
హాయిగ కలయ నాయె
చెప్పిన మనవులు తప్పక వినుటాయె
గొప్పవారు నిన్ను గొలుచుటాయె
చెప్పవశే వకరు ద్రిష్టిలో లేదాయె
చిప్ప కొలత గంజి యెప్పుడో వెగటాయె॥ ॥ఇప్పుడు॥

## 34. మధ్యమావతి _ ఆది

పల్లవి _ ఎవడైన వచ్చునశే హోహో
యిక నీ యింటికి

అను...హర హర నీకు చిత్తజు
భవన మింత వెళుపై తేనే॥ ॥ఎవడైన॥

గడిసేపు బిలచిన గడియదీయవు రాకలు
విడిచి చేతులో బెడితేగాని అడుగిడ నీవు సరిసరి॥ ॥ఎవడైన॥

వక్కాకు లేకుంటె మంచమెక్కనీయవు వకటి
తక్కువైన తిరిగి కడప తొక్కనీయవు సరిసరి॥ ॥ఎవడైన॥

గట్టిగ పాలిండ్లు బిగబట్ట నీయవు మొలను
కట్టిన నీవి బంధము ముట్టనీయవు సరిసరి॥ ॥ఎవడైన॥

కుసుమాయుధుని నైన కాళ్లు బిసుకమనేవు మంచి
రసికుల మానసము నీరసము జేసేవు సరిసరి॥ ॥ఎవడైన॥

వేణుగోపాలుని గూడి విడనాడేవు పంచ
ప్రాణముగ వున్న సామితో పంతములాడేవు సరిసరి॥ ॥ఎవడైన॥

## 85. పున్నాగవరాళి - చాపు

పల్లవి - ఏమిసేతు మోసమాయెగా ఆ
యెమ్మెలాడికి సందాయెగా ఇది
అను ..కోమటి విశ్వాసమాయెగా వేణు
గోపాలుడు రాడాయెగా యిక॥ ॥నేమి॥

వలచిన దెక్కువాయెగా బల
వంత మాఘు స్నాన మాయెగా
బలిమి జేసిన వట్టిదాయెగా ద
బ్బరకాని విందాయెగా యిక॥ ॥నేమి॥

పిలువ బోతె అలుకాయెగా నా
పేరువాసి యిట్లాయెగా
పలుకే బంగార మాయెగా తిల
పతి చుట్టరికె మాయెగా॥ ॥ఏమి॥

రచ్చబెట్టి గూడు టాయెగా అంద
రాని మాని పండాయెగా
ముచ్చటే మరుపాయెగా నే
ముల తీయదన మాయెగా॥ ॥ఏమి॥

## 86. నాటకురంజి – త్రిపుట

పల్లవి – నీపాదాలకు దండం నీతల్లికొక సలాం
నీ యింటికిక రాంరాం అయినా

అను...ఈ పాపము కద్దా యిట్లైతే కాపురము
కోపే సమ్మతైనట్లు దోప నా తరమటే॥ ॥నీపాదా॥

పల్లవాధరి నెలకు పల్లిస్తు నూరు
చిల్లర సామాన్లు చెల్లించి యుండగ
అల్లరి జేసేవు అది యిది లేదని
ఇల్లు జేరక మునుపే మెలికె రావి డన్నట్లు॥ ॥నీపాదా॥

మొన్న పూరకే నాపై మోడిజేసినంగను
మున్నూరు వరహాల మాల్లెయ మెనమి స్తి
నిన్న నే దెలిసె పనిగె దాహమే నీది
తిన్నతిన్న గనయ్యె దివాలెత్తె పనివచ్చె॥ ॥నీపాదా॥

కొంచగ త్తైవా వేణుగోపాల రమ్మని
పంచబాణుని కేళి ప్రౌఢిమి ననుగూడి
సంచితమంతయు సంగ్రహించుకొని
మంచిమాటల గుడిసె వంచేదానవే నీవు॥　　॥నీపాద॥

## 87. పంతువరాళి - చాపు

పల్లవి - అంబలి దాగేవు నెత్తిగ్రాతనీకు
అన్నము సైచదటే పాత

అను...సంబా వడ్లు దంచి సత్రాలు బెట్టేవో
యెంబెరు మా నారంబె యెగతా ళనుకొంటి॥　　॥అంబలి॥

తల్లి పేరు జెప్పి పుల్లని కూటిళ్ల
కిల్లిల్లు దిరిగేవు ఇది మానమా
నల్లనావుల పాలు కొల్లె మీా మందలో
చెల్లబో చలివేళ చైె వెంట జారగ॥　　॥అంబలి॥

ఆకుచేతబట్టి హాసుగా నిలుచుండి
పోక బద్దకు దోవ పొంచేవేమే
కోక స్తనీ వక్క గోనె కెన్నడె ఖర్చు
రాకేందుముఖి ముక్కరాగులు విసరుకొని॥　　॥అంబలి॥

పతియైన వేణుగోపాలుడు నినుగూడ
సతకల బడ యిచ్చె సర్వస్వమూ
అతుకుల గుడ్డలేగతి నీ పుట్టుకయేదో
మెతుకు కలికానికి మెదల దెన్నడు గొడ్డు॥　　॥అంబలి॥

## 88. పంతువరాళి - చాపు

పల్లవి - నిష్కర్ష గా రాత్రికొచ్చే వాడవైతే
నిష్కాలు గొంచు రారా నేనా

అను...ముష్కరి వినను యీ శుష్కప్రియాలు తు
రుష్కులు దిగివుండే లష్కరు లో నుంచి ॥నిష్కర్ష॥

దండిగ పొవ్వాకు రెండు పీశల వక్క
పండుటాకుల ముడియ పాలకావిళ్లు
కండ శర్కర దుత్త కొజుల బుట్టలు
యెక్కడ జారగానే యెత్తించుకో నీవు॥ ॥నిష్కర్ష॥

పూలు గంధము బుక్క పునుగు లవంగాలు
యేలకాయలు తులమెత్తు జాపత్రి
పాలుమాలేవు దీపాని కడ్డెడు నూనె
యీలో బంపించి నీ వింట్లోనే భోంచేసి॥ ॥నిష్కర్ష॥

ముని మడుగు రవికెలు మూడు కొంగులచీర
దినుసువారి పప్పు తేటద్దమూ
పనిబూని వేణుగోపాల సాగించుక
నను రతిగూడి ఆనంద మొందుటకు॥ ॥నిష్కర్ష॥

## 89. పంతువరాళి - చాపు

పల్లవి - ఒట్టిచేతుల నేడు వచ్చినని న
న్నాకలాగున జూడకే రేపే

అను...పట్టపేనుగ దెచ్చి పణతి నీవాకిట
కట్టి వేయకుంటె కాని యిది మీాసమా॥ ॥ఒట్టి॥

కంచి మాణికె దారి కడగొట్టు పిల్లను
కన్నెరికె ముంచలేదా రాము
నుంచుకోక మునుపే వుదయాద్రి మంగకు
నుంగర మంపలేదా
మంచము శ్రీరంగి మనమురా లడిగితే
మాపే సాగించలేదా - నిన్న
యెంచ కిచ్చింది మీా యెదురింటి వాణికి
వంచిన తలయెత్తి యించుక పలుకవు॥ ॥ఒట్టి॥

అరణీ నాంచారి మేనకోడలి సమర్త
కరవై దరిశించలేదా పుణ్య
పేరంటానికి తంజావూరి శేషికి గుండ్ల
పేరు దార బోయలేదా
పేరూరి గంగకు సూరి మొక్కుకుంటె
తేరు నడిపించలేదా నిన్ను
నారగంటి మద్దెల నరిశికి దోపిందో
తేరజేసి తలుపు వారకు వాదిగేవు॥ ॥ఒట్టి॥

నాణ్యమా కార్వేటి నగరాన వుండేది
నాళ్లుగ యెరుకలేదా నిన్ను
వేణుగోపాల రమ్మని రతిగూడి ఆ
వెనక కాదన రాదా
యేణాక్షి యేడాది మనసు బట్టితివైనా

యిల్లు బంగారు గాదా యెంత
త్రాణదానవే నేనింతగ బతిమాలితే
కాణాచివలె రోని కడప వెళిరావు॥ ॥ఒట్టి॥

## 90. పంతువరాళి - ఆది

పల్లవి - నాయక స్వామైనందుకు పాట
నయముగ పాడవలె అందున

అను... గాయక మెరిగి వినుపిం చేందులో
మనము గూడవలే ప్రౌఢ॥ ॥నాయక॥

కాసుకైన వక్కలాకులు తీసుకోను చేతులాడక
తేను పండ్లతో సొమ్ములుజార వేసుక కులికినట్టేగాదు॥ ॥నాయక॥

సొట్ట బుగ్గలతోను వెండి మెట్టెలు కాళ్ల రొదలుసేయ
పట్టుచీర చెంగులుజార గట్టుక కులికి నట్టేగాదు॥ ॥నాయక॥

బడిబడి కటికాలు బిలున అడుగుమీాద అడుగువిడుదు
ఆడనె తెలియక చమరుమీాద ఆడేనని మురిసితే కాదు॥ ॥నాయక॥

కోటేరు బెన్నెట్టు ముక్కున వాటమైన నత్తుబెట్టి
మాటా పలుకు నేరక పసుపు మరి యింత బూసితేగాదు॥ ॥నాయక॥

పొట్టివాడున శాలువ ముసుకు బెట్టుకొని పిళ్లారయవలె
పెట్టాడించు కొంటు మంత్రుల చుట్టుతిరిగి నట్టేగాదు॥ ॥నాయక॥

ఒకనితో సరసాలాడి వేరొకని జూచి సైగజేసి
ఒకని ముద్దుబెట్టుకొని ఒకని రమ్మన్నట్టేగాదు॥ ॥నాయక॥

వేణుగోపాలుని గూడి వేలాంత్రాలు సంపాదించి
రాణివాసమనుచు గోడలు రాతిరి దాటీనట్టేగాదు॥ ॥నాయక॥

## 91. పంతువరాళి - ఆది

పల్లవి - ఇంచుబోణి నను నవ్వేరట తమ
దింత గంపెడు దాచుకొని ఇది

అను...ఎంచబోతె మంచమొల్ల కంతలు
ఎవతె సుద్దమో యివతల రమ్మను
పంచసాయకుని గన్న వేణుగో
పాలసామి తడవని యిల్లాండ్లుగ॥ ॥ఇంచు॥

దక్కితిమని చెలులు భంగపడి సం
ధానాలు నడిపించిం దెరుగవో
యెక్కువైన రవలసొమ్మలివి మీ
కెక్కడిదని మందలించ రాదటే॥ ॥ఇంచు॥

చేడెరో బొడ్డుగోసిన కొడవలి
యీడ నాచేత నున్నదిదిగో
మేడ లెవరు కట్టించి నాగని
జాడగా కదిలించ రాదటే॥ ॥ఇంచు॥

అడ్డ మాడ్ప లేదు వారి నోటికి
అతనికేమి భయమూ నను గూడితే
దొడ్డపింతె తమ కడుపున బుట్టిన
బిడ్డ లెవరి పోలికైనది తెలియక॥ ॥ఇంచు॥

## 92. పంతువరాళి – ఆది

పల్లవి – వారస్త్రీ నీప్రక్కలోకి
యూరకె వచ్చునా

అను... తేరకు దొబ్బేనని జూచేవో
పోరా పో వేణుగోపాల॥ ॥వార॥

పందిళ్లు తా నొకడే వేసి
బావిలో నీళ్లన్ని మోసి
సందుగోడలు మదురు బోసిన
బొందిలి వానినె సున్నజుట్టిన॥ ॥వార॥

పాలు దినము దెచ్చి యిచ్చి
బట్ట శింబోతును బట్టిచ్చి
చేలో మందల దోలిన గొల్ల
చెంగడికే నామము బెట్టిన॥ ॥వార॥

నమ్మించి సన్న్యాసి శాఠి
నయము జేసి గుంజుకొని
అమ్మజెల్ల వుడకాడించి
అల్లా పనికి దుద్దుబెట్టిన॥ ॥వార॥

నరహరిభట్ల వేలి ఉంగరాలు
యెరువు దీసికోని
తిరుగ అడుగబోతే నెత్తిన
తిరుమల కొప్పు బెట్టించిన॥ ॥వార॥

వేణుగోపాలా నీవు వొక
విడెమైన తన చేతి కియక

వీణుగా మును గూడినందుకు
వీధెక్కి రచ్చలు బెట్టించిన॥ ॥వార॥

## 93. గౌళిపంతు - ఆది

పల్లవి - నీ పప్పేమే చిమిడిం దిపుడు
కోపగించేవు ఓసి

అను...పాపాత్మురాలా వేణు
గోపాలుడు నమ్మించి నందుకు॥ ॥నీ పప్పేమి॥

కోళ్లా గుడిశంతా పోయి చుట్టు
కొల్లారెండ్లాయ నులక
తాళ్లా నల్లుల కుక్కివదలి
కీళ్ల మంచ మాయె॥ ॥నీ పప్పేమి॥

తుండుగుడ్డ కట్టే మొద్దుకు
కండె చీరాయె పురిటి
కుండలు తిరిపెమెత్తే తొత్తుకు
వెండి పాత్రలాయె॥ ॥నీ పప్పేమే॥

పచ్చ పూసలు గట్టిన మెడకు
చిన్న సరమాయె వ్రాళ్లో
తెచ్చే కవళము మరచిన వెనక
తెల్లని మెతుకాయె॥ ॥నీ పప్పేమే॥

తొండిమెలు యేరుక నమిలే పంజకు
మడుపు దిట్టమాయె వీధిలో

పడుతూ లేస్తూ తిరిగే బసివికి
పల్లకి వకటాయె॥ ॥నీ పప్పేమే॥

చన్నె లేదన్నందుకు రొమ్ము
గిన్నె లంతాయె మెచ్చి
వెన్నుడు నిన్నేలిన పిమ్మట
విరివి యెక్కువాయె॥ ॥నీ పప్పేమే॥

## 94. గౌళిపంతు - ఆది

పల్లవి - అంతమాత్రము నే నియనటె
అజ్ఞానురాలా నే

అను... నెంత బిలచిన ససేమిరా యని
గంతెవైచుచు పరుగెత్తేవు॥ ॥అంత॥

శేవాకాలము రాతిరి గుళ్లో
ఆవేళాదాకా నిలుచుంటె
తేవాకులయవా రొక దోశ
నీ వొళ్లో దోపె మూసుకొమ్మని॥ ॥అంత॥

గద్ద గూడువలె తల బెట్టుకొని
సుద్దులాడ వచ్చితె సాతాని
పెద్ద వెలగచిప్ప దెచ్చు కొమ్మని
శిద్దెలోని చమురు వంచి యిచ్చెను॥ ॥అంత॥

రొయ్య దిన్న నోటికి పొవ్వాకిం
తియ్య మనుచు యెడమ చెయ్యి సాచితే
అయ్యతోడె లేదని తన చారుడు
బియ్యమిచ్చె పుగ్రాణపు దాసరి॥ ॥అంత॥

పాతగుడ్డ పైట కొంద లేదని
భంగపడితే నాంచారు కప్పుడు
సాతియున్న చీర గుంజి వేగమె
చేతికిచ్చె పరిచారక వైష్ణవు॥　　॥డంత॥

వేణుగోపాలా రా రమ్మని
వింతగా నను గూడితి వైనా
వీణుగా నిను పొమ్మందు నటే
వెర్రిదాన తెలుసుకోవైతివి॥　　॥అంత॥

## 95. గౌళిపంతు - ఆది

పల్లవి - పదిమంది కొడుకుల గన్నదానీ చేతికి
　　పైకమిచ్చి వత్తురా యింత

అను...పదటము వేణుగోపాల నీకు రూక
　　లదనమై యుంటేనే అరువు తెరువుమాలి॥　　॥పది॥

ఒకడు బిడ్డల తండ్రి వొంటిమిట్టలో ఠాణ
యొకడు కొత్వాల్ గిరి వోరుగంటికాడ
ఒకడు పైసీమకీడకు దూదిబేరము
యొకని వంచించి వే రొకనికి మనసిచ్చి॥　　॥పది॥

ఒకడు నీ పొడుగై నాటకశాల నట్టువు
డొకడు బంగాళా బారుకు సుబేదారుడు
ఒకడు శృంగారతోటకు ఖుల్ దారోగా
యొక జెమ్యేరుగవు దినమొకరిని తలదడవి॥　　॥పది॥

ఒకనికి మీసకట్టిక మొనజూపలే
దొకని పల్లికూటానకు బంపేపాయము
ఒకడు చౌలబిడ్డ తక తక లాడిని
యిక మానలంటే యేలుకొ చెలులు నవ్వగా॥ ॥పది॥

## 96. సురట - చాపు

పల్లవి – ఎక్కడనుండి దాపుర మాయెనె
ఇంతచక్కని అందగత్తె లేని

అను... వెక్కలు బుట్టించి వేణుగోపాలుని
దక్కించుకొని యెవరు తనకెదురు లేదని॥ ॥ఎక్క॥

ఆట చదువు సున్న పాట లంజ మందు
బూటకముల కది పుట్టినిల్లు
నీటు యింతనరాదు నిలువెల్ల కపటము
గూటమువలె తిని కూర్చుంటే కలదు॥ ॥ఎక్క॥

లలన పల్వారుస గవ్వలతో వీయములందు
కలబంద వాసన కలికిమేను
చిలుకరాతు నగరు దలప చీకటికోన
వలపు మందుల సంచి వక నిమిష మేమరదు॥ ॥ఎక్క॥

మొగచెంప లదిగాక మోమెల్ల మొటిమెలు
దిగబడ్డచనులు తెత్తైనోరు
వగలాడి వయసు యేబదిమీద రెణ్ణెల్లు
యెగతాళి సేయక వా డేలాగు గూడెనో॥ ॥ఎక్క॥



“ మితిలేని మోహమున బతిమాలుకొ నేవేళ .... .... .... ”

— పేజి 83 - పదము 9

## 97. సురట - చాపు

పల్లవి - మడ్డి స్వరూపమా ఇట్లాడ తగునటే
మర్యాద తెలియకనూ

అను... తెడ్డుబోయె నీవు రాకుంటె కొనవానా
దేవదేవుడవు వేణుగోపాలునితో॥ ॥మడ్డి॥

అమ్మచెల్ల చెలువు డావేళ ప్రొద్దున
యెమ్మెలు జేసుక యింటికి వేంచేసి
కొమ్మరో మదిలోని కోర్కెనీ కెరుగింప
సమ్మతి గాకుంటె సరిపడిన దనరాదా॥ ॥మడ్డి॥

అతివ నీదు గొడ్డు మతమే అయినాగాని
క్షితిలో బోటులకంటె అతిశయమ
మితిలేని మోహామున బతిమాలుకొనేవేళ
హితవు గానక్లైతె యీాడ పడ దనరాదా॥ ॥మడ్డి॥

విరిశెయ్యమీాద రాతిరి నీవు వొంటిగ
మరుమందిరము పార తెరుచుక నిద్రింప
దొరికించుకొని నిను సమరతి గూడేవేళ
సరసము గాకుంటె చాలించమనరాదా॥ ॥మడ్డి॥

## 98. సౌరాష్ట్ర - ఆది

పల్లవి - కలిగిన కాసు గుంజుకోవె
కడమజోలి నీ కెందుకే

అను...ఉలవకట్టు సామెతెగా నున్నది
యువిద వేణుగోపాలుని చేత॥ ॥కలిగిన॥

ఎవతె యింటికిని పోతే నేమి
యెంత ప్రొద్దు బోయి వచ్చితే నేమి
అవును కాదనుచు దినము లెంచుచు
ఆయింత నెల వెళ్ల గానె॥ ॥కలిగిన॥

అప్పుల పాలైతే నీకేమి
ఆదాయము గలిగితె నీకేమి
గుప్పుచప్పు మనక నేరుపరివై
గోడమీది పిల్లివలెనె పొంచి॥ ॥కలిగిన॥

దానిగూడి నిన్నేలితె నేమి
దీనికింత రోస పడే దేమి
చాన నీకు వయసుమించ యికనీ
సాగుపడి చెల్లదుపో ముదిమిని॥ ॥కలిగిన॥

## 99 సౌరాష్ట్ర - చాపు

పల్లవి - సీసపు రూకలు కొంగున గట్టితె
దోసకారి చూడరాదటే యెంతో

అను...ఆసజెప్పి తెల్లవారేదాక బలు
గాసిబెట్టి వేణుగోపాలుడు వట్టి॥ ॥సీసపు॥

మంచి వాని వలె జాబులు వ్రాసి
మాయదారి ఏమొ నీకెగబోసి

సంచిలో వక్కలాకులు ఝాడజేసి
చాన నీతలమీాద సొడ్డొకటి వేసి॥ ॥సీసపు॥

జంట బాయక బిగికౌగిట డాసి
పంటనొక్కి మోవి గంటుజేసి
అంటనీయని తావు లంటి సిగ్గుదీసి
వెంటికె దెంచి నీ యింటిమీాద వేసి॥ ॥సీసపు॥

మదను కేళి గూడి మది తమి రేపి
వదలిన కుచ్చెళ్లు కుదురుగ దోపి
నిదురబొయ్యే దాని నిను తట్టి లేపి
ముదిత వాడు తన ముందరిది జూపి॥ ॥సీసపు॥

## 100 హుసేని - ఆది

పల్లవి - సత్యమింతైన లేదాయెగా చెలికాడా యీా
సతినుంచి నాసిగ్గే పోయెగా ఆణీ

అను...ముత్యమైన పగలగొట్టి
నిత్య బత్యాలు గొలచితె
ప్రత్యేకముగా సంధానాలు
పనికత్తెను బంపించెనట॥ ॥సత్య॥

పారస్త్రీల నమ్మరాదుగా యెంతదోపిన
వారిమది సంతుష్టి లేదుగా నిన్న
జారుకొప్పు బెట్టుకొని మై
జారు చీర గట్టుకొని

చేరి గుర్నాథుని చావిడికి
పెరుమాళ్ళను రప్పించెనట॥ ॥సత్య॥

ఇల్లు ఘల్లు కడిగి బెట్టితి చై విడువ నని
యీ చంబాటి శివుని ముట్టితి కంచి
నల్లేరయ్యంగారి వెంట
నాగపూడి తిరునాళ్ళకు
తెల్లవారే పైనమట
మళ్లీరా నెల బట్టునట॥ ॥సత్య॥

తోట దొరువు వొప్పగించితీ యీ సీమయేలే
దొరచేత బహుమతి చేయించితీ మొన్న
నాశేరి చెన్ రాజేమోపడ
వేటి దాతరకు పోతే
మూట మనిషికంటే తాను
ముందుగబోయి నిలచేనాట॥ ॥సత్య॥

అప్పచెల్లెలు సమర్తాడితే పని నిగ్గించితె న
న్నాడ నే నిష్టూరా లాడితే గాజుల
తిప్పిశెట్టి పిలువగానే
ముప్పావు కంబళి కాళించి
చప్పుడు సేయక చిరుతని
తెప్పలకు బోయినాదట॥ ॥సత్య॥

కోమలి పొందిక చాలుగా అది నన్ను వేణు
గోపాలు డనకుంటే మేలుగా మొన్న
సోమేశ్వరుని కొండమీద

రామాయణము. వినబోయి రాత్రి
గ్రామ లెక్కవ్రాశే పిళ్లకు
గర్భము ధరియించెనట॥ ॥సత్య॥

## 101. మోహన - చాపు

పల్లవి - ఇందుకా నీకు పంచాంగము జెప్పింది
ఇన్నాళ్లనుసరించి యిట్లా

అను. . .కందువలెంచేది దెలిసితే యిదివరకే
కాశికి పోయివత్తు గదవే నిర్దయురాలా॥ ॥ఇందు॥

ఎద్దు పోకటబెట్టి మిద్దె యింటికి నిలువు
టద్దము దీసింది పెద్దల ఋణమంటె
కద్ద నీమోమేమి కంచిగరుడ సేవో
ముద్దుబెట్టమంటె మూతి మునుచుకొనేవు॥ ॥ఇందు॥

వరలక్ష్మి వ్రతమంటె నొకయిల్లు తెగనమ్మి
యిరుచెవ్వారుగనీక యిస్తె కులుకలేదా
గురు కుచముల మీద గోరు లుంచే నంటె
నురిమి జూచి చెయ్యి మరుగు బెట్టుకొనేవు॥ ॥ఇందు॥

కొత్తచీర వేణుగోపాల తెమ్మంటె
కత్తి తాకట బెట్టి యెత్తి చేతి కీలేదో
చిత్తజుకేళి కాయుత్తమై గూడితే
మత్తురాల యేమొ యొత్తికల పొరలేవు॥ ॥ఇందు

## 102. మోహన - చాపు

పల్లవి - నీవేనా శాస్త్రము నాచేత కాసుంటె
నీయక్క యింకొక్కతే.

అను...అది గాకుంటె దానక్క మరి యొక్కతె
పోపో యెవతైన పుణ్యానికి రాదు
దేవ రంభయైన తే తెమ్మనక పోదు॥ ॥నీవేనా॥

అతి మోహమున వచ్చి యడుగులపై వ్రాలి
బతిమాలి నవ్వడీ బాళి యెక్కడబోయె
పతకమిచ్చి తెగాని పలుక నంటివా లేదా
మెతుకులు జల్లితే క్షితిలో కాకులు బాతె॥ ॥నీవేనా॥

ఆనాడు నగిరిది అరపై రూపాల
తాను పెట్టెలో వుంచి నేనట్టే రా ననె అ
తాను పావడగూర్చి ధరియించు కోవటే
వానలు గురిసితే వాతలు మానున॥ ॥నీవేనా॥

పాతర లాడుచు రాతిరి వేణుగో
పాలా యనుచు నన్నుపరతి గూడినదెల్ల
ఈతగింజ కథ తాతై యున్నది గదే
యేతము వంగేది లోతు నీళ్లకె గాద॥ ॥నీవేనా॥

## 103. మోహన - ఆది

పల్లవి - నీవు రాకుంటేనె నిన్ను మించినదొకతె
యీయూర దొరకదేమే యిపుడు

అను...కావలెనని సుంత కనుసైగ జేసితే
　　రావద్ద నా వెంట రంభ చెల్లెలైన॥　　॥నీవు॥

పిలచేకొద్దికి మరి బింకాల బోయ్యేవు
కలిగిం దిచ్చేనంటె తలఎత్తి చూడవు
బలిమి జేతామంటె చెలుల నేమారావు
యెలనాగ మోడేరాయల కూతురవ నీవు॥　　॥నీవు॥

లెక్క సేయవు వస్తె నిలుచుండవు
మక్కువతో మంచి మాటాడవు
దక్కితి ననెకొద్ది దండము బెట్టవు
రక్కసి వలె గుడ్లు బిక్కరించుకొ నేవు॥　　॥నీవు॥

నిదుర బోవగ జూచి నిను గూడిం దెరుగవు
చెదరిన లోకొంగు చేతంటవు
మదన మందిర మింత మృదువేమి యనుకోవు
కోదవలేదిక వేణుగోపాలుడని దెలిసి॥　　॥నీవు॥

## 104. మోహన - ఆది

పల్లవి - ఇంతకంటె యింకా యెవడిచ్చునె
　　యేమిటికే గొణిగేవు

అను...పంతమేలనె నీకు వేణు
　　గోపాలసామి జేసిన కొదవేమి॥　　॥ఇంత॥

కుంటెన కత్తెకు శేరుంబావుది గుండ్ల పేరాయె
ఇంటికి వాడురాగా దానీ కింత సొమ్మాయె
వెంట వెంట పండుగ చీరలకె వేవరాలాయె॥సుంత

చంటిమీద చై వెయ్య నియ్యవట
శార్వస్యము బాగాయె॥ ॥ఇంత॥

కావిలి గాచే వాకిటి వానికి
కంబిళి ఏకటాయె
కోనెలనంబికి శోభన మంటే
గోనెడు వడ్లాయె
పోవె పోవె నట్టువునికి వేసిన
పోగులేమాయె సుంత
మోవి పంట నొక్కనీయవట నీ
మొరప గుణము పోదాయె॥ ॥ఇంత॥

పడమటిసీమ గురువులవారికి
పల్లకి యెక్క టాయె
కడప వైద్యునికి నీచై మీదుగ
కావలసినదాయె
తడుకు సర్వదుంబాలగ నాడే
ధార బోశాయె గూడితె
తోడ రవంత ఎడము సేయవట నీ
తో మంచి సుఖమాయె॥ ॥ఇంత॥

## 105. మోహన - చాపు

పల్లవి - ఇన్నాళ్లు జరిపింది యీ భాగ్యానికేనా వక్క

అను.. చిన్నరూకదెచ్చి చేతికిచ్చి అట్టె
కన్నుసైగజేసి కదలమంటి వహహా॥ ॥ఇన్నాళ్లు॥

నే నెంచినది యేమి నీవు జేసిన దేమి
నానా సవతులు వ్రాళ్లో నవ్వుకోవడ మేమి॥ ॥ఇన్నాళ్లు॥

మానము గల మేటి మగవాని కిదే నడితి
యేనుగ సామిత ఇదుగో తార్కాణాయె॥ ॥ఇన్నాళ్లు॥

నీవొద్దు పొడుగేమి నీరాజరీవేమి
ఆవేళ గుడివద్ద అన్న మాట లేమి
యేవి యొక్కటి గాన మింతటి ఘనుడవ
యీవికాని వలెనే యిదిగో రేపని యిట॥ ॥ఇన్నాళ్లు॥

బాళితో వేణుగోపాలా రమ్మన వేమి
లాలించి గూడి యీలాగు బొంకడ మేమి
నాలుగేండ్లనుంచి నన్నుద్ధరించింది
చాలు చాలు సంసారితనము దెలిసె॥ ॥ఇన్నాళ్లు॥

## 106. మోహన - చాపు

పల్లవి - వస్తే యెంతలోది రాకపోతే యెంత
వనిత నీ పుణ్యమేమే విడిచి

అను...వస్తేగా యెవతైన యిట్లా రమ్మనేది
ప్రస్తుతి సేయుటకు పాచ్ఛా బిడ్డవ నీవు॥ ॥వస్తే॥

పయ్యెద తొలగించి పాలిండ్ల మీదికి
చెయ్యిచాచగానె శింగిలీకమువలె
గయ్యాళి మొగమంత కండ్లు జేసుకొనేవు
అయ్యయ్యొ ఇపుడు చల్లారి పోయిందేమొ॥ ॥వస్తే॥

మదిరాక్షి నీవింత మహాత్మ్రురాలవని
యిదివరకు నే నెరుగక నీశ్వరు సాక్షిగ
పెదవి నొక్కబోతె పెంకె మాటంటివి
గదశే కాళ్ల మీద గంజి వొలికితె చూతాం॥ ॥వ స్తే॥

వెలది నా పేరేమి వేణుగోపాలుడు
కల గన్న దే మొదలుగా ఇన్నాళ్లకు నిన్న
బలిమి గూడి నేనె భాగ్యం వారుకొంటి
లలన కొండత్రవ్వి యెలుక బట్టిన ట్లాయె॥ ॥వ స్తే॥

## 107. కేదారగౌళ - ఆది

పల్లవి – ఇంకా వాని చెలిమి సేతురా
యేటి మాట లాడేవు నేడు

అను...వంకాయకు వచ్చిన చాలేగద
బెంకాయకు వచ్చేది ముందర॥ ॥ఇంకా॥

చీటి పాటి సొమ్ములు కరగించి
చేసరాలకని బంగా రిచ్చితె
వాటిలోనె మైలాపురి మంగకు
వజ్రమణుల కమ్మలు సేయించితె॥ ॥ఇంకా॥

పట్టుతాను మూడేండ్లుగ దాచి
పావడకని బుద్ది నేర కిచ్చితె
అట్టెసగము రవికెలు గూర్పించి
ఆరికాటి రామికి దరిశించితె॥ ॥ఇంకా॥

వేణుగోపాలుడు నను గూడి
వేలి వుంగరా లిట్లా తెమ్మని
బాణవరము రంగి మనమరాలికి
వీణుగా ధారబోసి వచ్చితె॥ ॥ఇంకా॥

## 108. కేదారగౌళ - ఆది

పల్లవి - ముసలి బడుగుమీద యెంత మోహామే
ముదితరో నీకు మదిలో

అను...అసమ శరుడనుచు వుప్పొంగితివో
అన్నిటికీ కాసుగదా దొడ్డది॥ ॥ముసలి॥

తల మొలకడ వెల్ల నరసి పోయె
దగ్గి దగ్గి హీనస్వర మాయె
పిలచినాను చెవి విన రాదాయె
బలము వుడిగి తప్పటడుగు లాయె॥ ॥ముసలి॥

రాత్రైతె రేచీకటి గదలకు
రమణి నీ బిగి కౌగిలి వదలడు
మూతిమీద బట్ట యేమారకు
ముష్టి వకరికైన వేయ నీయడు॥ ॥ముసలి॥

అధరపాన మేలాగున జేసెనో
అతను కేళి నిన్నెటు మెప్పించెనో
విధికి యెన్నాళ్లు చలము వుందో నో
వేణుగోపాలు డెటుల గూర్చెనో॥ ॥ముసలి॥

## 109. అసావేరి - త్రిపుట

పల్లవి - ముసలివాడైతే నేకసరేం
దా గొణుగుడు
పసితన మక్కై నీకు! వాడు ,

అను...రశిక శిఖామణి రాజ్యాలలో పేరు ,
తుసకార మటే తెచ్చి దోపితే కులికేవు॥ ॥ముసలి॥

భామనీకు నూటపదహారు లిప్పించె
స్వాము లిచ్చిన ఖారీశాలువ దరిశించె
రామ నీ నగలకు రత్నాలు చెక్కించె
గ్రామాలు రెండు నీ కరుచూ కేర్పరిచె॥ ॥ముసలి॥

సంబళాలు నిలిపి శాస్త్రాలు జెప్పించె
తంబురంత జీవ దంతాన జేయించె
కంబడి మైసూరి కాణ్ణుండి తెప్పించె
నంబి గుండానె తిన్నగ రక్షగట్టించె॥ ॥ముసలి॥

కలసి మెలసే వేళ తలయేల వంచేవు
నలినాక్షి మొగమున నవ్వుదెచ్చుకోవు
వెలది యెందుకె యిట్లు విధిని నిందించేవు
పలుమారు వేణుగోపాలుని దలచేవు॥ ॥ముసలి॥

## 110. ముఖారి - త్రిపుట

పల్లవి - ఇన్నూరు వరహాలు తిన్నగ నా చుకుని
ఇక కదల మంటివిగా వాడు

అను...సున్న పాకు కండ్ల జూపని నెరదాత
వన్నెలాడిరో వారవనితంటె సైనీవె॥ ॥ఇన్నూరు॥

ఎద్దు బాడిగజేసి యెక్కించుకొని నీకు
సద్ది గట్టుకొని సంబ్రాలు పడుకొంట
కద్ద లేదా కంచి గరుడసేనకు పోయి
మిద్దెలో దించిన మేలైన దలచక॥ ॥ఇన్నూరు॥

చీరలు రవికెలు చీటితానులు గొప్ప
జారిచెంబు జముఖానా తలగడ
నేరు పట్టాలా నీ పేరిటి సరములు
యీరీతి గొని యిచ్చిం దెపుడో తుంగలొ ద్రొక్కి॥ ॥ఇన్నూరు॥

నీమాటి నీ వెంత చిత్రాంగివే ఐనా
కామించి నిను నోరగండ్ల జూచుచుంటె
ప్రేమలేక యిన్నా ళ్ళేమని కూడితివె
భామరో వేణుగోపాలుని తలపడవి॥ ॥ఇన్నూరు॥

## 111. శంకరాభరణం - త్రిపుట

పల్లవి - పొడుగున గూర్చున్నానని మిట్టిపడి వెర్రి
పోకలేల పొయ్యేవే నీవు

అను...గుడిసెవా టైనది నడితిలో నిజమాయె
ఝుడుపు లేక సుకవిజనుల నావల గదిమి॥ ॥పొడుగు॥

అందగ త్తెనో లేక హాయిగ పాడేవో
సుందరి అభినయ సురతవో నీ

యండేల రవళే వక్కండుకు కొరగావు
పందెంత బలసిన నందితో సరి ఔనా॥ ॥పొడుగు॥

బెట్టుగా ఒక జతికి పేరిణి దొక్కేవా
గట్టిగా చదరంగము జూచేవో
బట్ట డబ్బె లోని పస యాడ వట్టిదే
పట్టు గూర్చితేనె పైజారు మడికౌనా॥ ॥పొడుగు॥

కోడిగాల వేణుగోపాలు గూడేవో
పోడిమైన కథల ప్రొద్దు బుచ్చేవో
నేడు క్రొత్తటే చిన్నాడే నిన్నెరుగనా
కూడు గలిగితేనే కుక్క గోపిదేవౌనా॥ ॥పొడుగు॥

## 112. మధ్యమావతి - ఆది

పల్లవి - గట్టివాడవు సైరాసై నిను
గన్నదే తల్లి నే

అను... వెట్టికానీ బుద్ధులు విన్నది
వేణుగోపాలా శాబాసు॥ ॥గట్టి॥

చీరలు రవికెలు నాణ్యము జూస్తివి
శీనా అద్దము బేరము జేస్తివి
ఆరణి దీప స్తంభము దీస్తివి
అడిగి నందుకా చంపల వేస్తివి॥ ॥గట్టి॥

ఎమ్మెలుగా తిరుగులాడ మంటివి
యే దడిగిన దయచేసే నంటివి

సొమ్మునాకు లక్ష్యము లే దంటివి
సొడ్డు వేసి మెడది నాచుకొంటివి॥ ॥గట్టి॥

వ్రతము జెరిచి నను వేకటి జేస్తివి
వాలాయము తలవాకిలి గాస్తివి
హితవుగా వుండి యింత జేస్తివి
యెప్పుడో లేచి కంబీ దీస్తివి॥ ॥గట్టి॥

## 113. గౌళిపంతు - ఆది

పల్లవి - ఏమి జూచిన బోర్ల పాటే
యిట్లా కులికేవు వో

అను...భామ వేణుగోపాలుని వాకిట
పది వేలకు నీవంటి బానిసెలు॥ ॥ఏమి॥

నాళ్ల నడుమ జేరి యూరు
పాళ్ల యిల్లు గట్టి వాకిట
గోళ్లు మీటుచు నిలువక కానీ
వేళ్ల వుంగరా లెరుగర టే॥ ॥ఏమి॥

పయ్యెద తొలగింది చూడక
వెయ్యిమంది నవ్వు కోగా
చెయ్యి విసరుచు తిరుగక గానీ
చేతి చేక ళైవ రెరుగర టే॥ ॥ఏమి॥

ఈసుతో జూచేవు తిరుగా
రోసమా తిరునాళ్ల ప్రజను

తోసుకొని పోకుంటె యత్తరు
పూసుకున్నావని యెరుగరటే॥ ॥ఏమి॥

జ్ఞాపక మెక్కడనే మొన్న
మాపునే నిను బిలువరాగా
దీప మేల దెమ్మంటివి నీ
పాపట బొట్టైవ రెరుగరటే॥ ॥ఏమి॥

సమ్మతిగ వేణుగోపాల
సామి నిన్నేలిన సుద్ది
కొమ్మ లడిగితె తల యూచితి వట
కమ్మలుండే దెవ రెరుగరటే॥ ॥ఏమి॥

## 114. గౌళిపంతు - ఆది

పల్లవి - బొట్టువేలు సున్నమైతే అంతలో
బొర్ల పడేదేమే తాను

అను...పట్నానికి బోయి వచ్చిన బడాయి
పల్లకి ముందర విచ్చు కత్తులట॥ ॥బొట్టు॥

దిండు కానుకొని కూర్చుండేదట
దండము బెట్టేది దొరల కేనట
పండితులకు మరియాద సేయదట
కుండలు గోకింది తలచు కోదట॥ ॥బొట్టు॥

చల్లని అన్నము నోటికి పోదట
సరిగె బుటేదారి చీర ముదుగట

మొల్ల విరుల సొమ్ము జీరుకొనునట
పుల్లగంజి నాడే మరచిం దట॥ ॥బొట్న॥

వేణుగోపాలసామి గుత్తట
వేకశై మొగ పిల్లను గనెనట
యేణాక్షుల నలుపు లెంచె నట
యెత్తుక తిన్నది మదిలో లేదట॥ ॥బొట్న॥

## 115. గౌళిపంతు - ఆది

పల్లవి - పుట్టిన పుట్టుక వచ్చిన రాకడ
అట్టె తలుచు కోవె ముందర

అను...పట్టెడేసి సొమ్మేర్పడగానే
ఉట్టిపడక వయసు రెండు దినములు॥ ॥పుట్టి॥

కీలు గంటు వెనక జారగానే
గీరు నామము దిద్దగానే
పూలగుడ్డ మొలకు జుట్టగానే
పొగరు నీ వాళ్లు నీవెరుగవు॥ ॥పుట్టి॥

మూడుమాట్లు పిడచ దొరకగానే
ముక్కు చెవులు కుట్టించగానే
వాడుతమలపాకు దొరకగానే
వొయ్యారము దోవజూచి నడువవు॥ ॥పుట్టి॥

వేణుగోపాలు డేనయగానే
గర్వముచే లేచి తలుపు దీయవు

కొణాచికి నిన్ను బిలువగానే
గర్వముతో లేచి తలుపు దీయవు॥ ॥పుట్టి॥

## 116. కన్నడ - ఆది

పల్లవి - ఒక ధూపము లేదే నీ సాక్షిగ
ఒట్టి పై బూటక మేనే యేమో

అను...ఇక ముందర ముత్యాల కుళ్ళాయి
యెన్నడో బెట్టేనట యిప్పుడు॥ ॥ఒక॥

కానని నా సవతులు యీవూళ్ళో
కల్పించేందుకు దొడ్డైశ్వర్యము
శానా వున్నది రామాయణ మిది
లోని గుట్టు పెరుమాళ్ళకు తెలివిడి॥ ॥ఒక॥

గుడు గుడు ఆలోచనలే కాని
కోమలి నేనొక పోణిమి యెరుగను
అడిగి తెలుసుకొని పిమ్మట కాదను
తడకు దాసరి ప్రతిష్ఠ వంటిది॥ ॥ఒక॥

ఏణాక్షిరో యీ సాంబ్రాజ్యానికి
యేమిటికే గాంధారితనాలు
వేణుగోపాలుడు నను గూడి
వేళ్ళ వుంగరా లిచ్చే ననేను॥ ॥ఒక॥

## 117. పంతువరాళి - ఆది

పల్లవి - లంజవారి తమ్ములకే యిప్పుడు
రాజఠీవులన్ని యెందుకు

అను. . .కంజభవుని కీ వసుమతిలో గుడి
కరువైనది వేణుగోపాల॥ ॥లంజ॥

ఖాసా బంతి భోజనమాయె
వీసె తమలపాకులు విడెమాయె
వాసనగంధము బూయడమాయె
మీసాలకు అత్తరు మెరుగాయె॥ ॥లంజ॥

నానాటికి పాగ పెద్దదాయె
నయము శాలువలు గప్పడమాయె
శీనా అద్దము జూడడమాయె
చిమటా పని దినము దప్పదాయె॥ ॥లంజ॥

కాళ్లకు వంకర పైజా రాయె
కాపులు లంచము దోపడమాయె
వేళ్లనిండ ఉంగరాలాయె
వీధి వీధి గుర్రపు స్వారాయె॥ ॥లంజ॥

చేతిరుమాల విసరడమాయె
చెవుల పోగు లాడించడమాయె
రాతిరి సంగీతము మెండాయె
స్వజాతి ధర్మ మంతయు మరుపాయె॥ ॥లంజ॥

జాబులు జత్రలు వ్రాయడమాయె
స్వామి జవాబులు జెప్పడమాయె

జేబులోనె పెట్టె బీగెమాయె
జెట్టు వచ్చి నడుము బట్టుటాయె॥ ॥లంజ॥

## 118. పంతువరాళి - చాపు

పల్లవి – అందరు నాయకు రాండ్లైరి యిదేమి
యాశ్చర్యమె చెలియా నిన్న మన
అను...ముందర దుత్త లెత్తుక అల్లాడిన లంజ
లందలా లెక్కేరి యారా కాలమహిమ॥ ॥అందరు॥

వేళ వేళకు సొగసు వింత వింత చీరలు
తాళీలు రవల బందరు కమ్మలు
మేలుకట్ల యిండ్లు చాలినంత ధనము
మూళ్ళి ముందర కొచ్చె మురిపాల దనమాయె॥ ॥అందరు॥

వోర్వజాలరు సుంత వాకరు పచ్చగవుంటె
గర్వింతురటె పదవి గలిగితేనే
నిర్వహించే దెట్లనే పేదసాదలు
పూర్వీకులపని బుట్టి తోకి వచ్చె॥ ॥అందరు॥

ఏమి పుణ్యముజేసి యీభూమి మెట్టిరో
తాముపున్న వూరు తలచరమ్మా
నేమ నిష్ఠలు ఆడనే న్నట్టిపడిం దిపుడు
భామరో వేణుగోపాలు జేలిన వెనుక॥ ॥అందరు॥

## 119. పంతువరాళి – ఆది

పల్లవి – ఎంత యేబ్రాశైతే నేమి
హితవేగద నీకు యీ

అను...వింత జూచి నవ్వని వారెవ్వరు
వేణుగోపాలరాయ మొన్నటి॥ ॥దెంత॥

పడకటిల్లు వకనాడుక నూడ్వదు
పట్టె మంచ మెన్నడు కదిలించదు
పడిగె మెప్పుడు బైటబెట్టి కడగదు
పరుపు దుప్పటైనా విదలించదు॥ ॥ఎంత॥

ఏడ జూచినా తలవెంట్రుకలు
ఎదురుగానె యెంగిలి పొగచుట్టలు
గోడమీద విపరీతపు నల్లులు
కొమ్మ పెదవిపై సున్నపు గురుతులు॥ ॥ఎంత॥

పల్లు కుత్తుకుని వేసిన పుడకలు
పైటకొంగు కడవెల్లా మరకలు
తెల్లవార్లు వింటెవిగా గురకలు
చెల్ల గడితివి యీూబై కరుపులు॥ ॥ఎంత॥

కానుగ నూనే బోసిన దీపము
గాదెమూల కుంపటి పొగ ధూపము
నాన బియ్యమంటె నిక్షేపము
నాతికెప్పుడు ముక్కుమీద కోపము॥ ॥ఎంత॥

వారానికి పందుల సాకింది
వల్లమాల్ని కోళ్లను పెంచింది
నీరాకకు దోసలు గాచింది
నిన్నుగూడి గర్వము మించింది॥ ॥ఎంత॥

## 120. పంతువరాళి – ఆది

పల్లవి – రావద్దటె నీవు జేసిన మేలుకు
రమణిరో యిపుడూ

అను... భావజు తూపుల కోర్వ నేనని నే
బతిమాలితే మూతి వోరగ బెడితివి॥ ॥రావద్ద॥

నూరు పనులు సుగ్గబెట్టి యెంతో
మేరువగా ఎంచి వచ్చి నందుకు
తేరు లేనిదైన సాకు బెట్టుక
తిరువళ్లూరి కిదిగో పైన మంటివి॥ ॥రావద్ద॥

మల్లెపూలు పండ్లు వక్కలాకులు
మంచివనుచు గుంజి లోన వెనుక
తెల్లవార్లు తలుపుదట్టి పిలచితె
పిల్లి దిన్న కోడి వలెనె యుంటివి॥ ॥రావద్ద॥

ఒక్కపూట విడచవేసి యెన్నో
లెక్కలాడితిరి యింటిలు పాది
యెక్కడి దబ్బలి సాంప్రదాయకమె
నిక్కమే వెలయాలిని భ్రమసితి॥ ॥రావద్ద॥

మంచి గుండెధైర్యము గాకుంటె
పంచ తిన్నెపై నే పవళించితె
కంచి పరుషమీద బెట్టి రాతిరి
వంచవేసి పాగ తస్కరింతువ॥ ॥రావద్ద॥

వెలది వేణుగోపాలుడనై నిను
గలసినదేనా బుద్ధికి మోసము

పిలువబోకు నాలుబొల్లి మాటలు
చెలియ మీా వీధికి యొక దండము॥　　॥రావద్ద॥

## 121. మధ్యమావతి - చాపు

పల్లవి - బారు బూరుమని పరుగులెత్తితే నిచట
　　పాట బాడ వద్దటే నగిరి
అను...నారాయణవనము చీర గట్టుకొని
　　నగిరి వద్దికి మన నాయకురాలి వలె॥　　॥బారు॥

తుమ్మి కూర చేలో తుంచుకొచ్చే వతి
దిమ్మరి యేడేడ దిరిగితివే
కమ్మకస్తూరిబొట్టు నెమ్మోమున దీర్చి
సొమ్ములు తగిలించి యెమ్మెకాండ్లు జూడ॥　　॥బారు॥

ఉసిరికాయలు నమిలి వూటనీళ్లుదాగి
కసువు మోపెడుగోసి అసురుసురై
పసపు నిగ్గు మెరయ పై తళుకులుజేసి
విసవిస నొకచేత విడెము బట్టుకొని॥　　॥బారు॥

ఏ మళ్లలో జిక్కె ఇన్ని నండ్రకాయలు
భూమి నక్కల కిక బుగ్గి వున్నదే
కోమలి అడిగితే కోపమెందుకె యిట్లా
భామరొ వేణుగోపాల రాయని గూడి॥　　॥బారు॥

## 122. ముఖారి - త్రిపుట

పల్లవి - నమ్ముదురటే తెలిసి తెలిసియుండి తిరుగా
　　నన్నేవా నీవూ

అను...కొమ్మరో వేణుగోపాలరాయడు దేశ
దిమ్మరై యిల్లిల్లు దేవరింపుచుండె॥ ॥నమ్మి॥

నత్తు జూతామని నను మోసబుచ్చి
తిల్లత్తూరీ రో తనలంజ ముక్కునబెట్టి
యుత్తర మియ్యకనుండే నే నడిగితే
ధుత్తరియని పట్టాకత్తి దూసిన వాని॥ ॥నమ్మ॥

ఏమమ్మా మరచితివో యిదె గన్యాక్షి గుండ
నామంపు పెట్టెలో నరసి రేకడి బిళ్ల
రామం జేరి జయరాగి బొడ్లో దోపి
నీ ముందరనె సత్యానికి బిలచే సామిని॥ ॥నమ్మ॥

సుమశరకేళి సొలసి నిద్దురబోవ
సమయము జూచి మంచము కింది జలపాత్ర
అమరికెగా బట్టి అరుణోదయానికెల్ల
తిమిరి కోటదాటి తిరిగి జూచినవాని॥ ॥నమ్మ॥

## 123. ధన్యాసి – ఆది

పల్లవి – మనసు నొచ్చుకొని అసురుసు రంటె
మంచిదేమె నీకూ యెందుకె

అను...నను మాతులు బాడిచేవు కార్వేటి
నగర వేణుగోపాలుడు వూరకే॥ ॥మనసు॥

ఎన్నాళ్లో నీ యింటికి దిరిగెను
యేమేమో ప్రియము లన్ని బలికేను

అన్నియు బాణములై విన సైచక
చిన్నాట్లకు రాక తర్లమంటిమి॥ ॥మనసు॥

నీ పాదములకు సాగి మ్రొక్కెను
కోపము సేయకు బతిమాలెను
పాపపు దైవము నీ మనసింత
పాషాణము జేసినందు కనవలె॥ ॥మనసు॥

దినము లెంచి చెక్కట పై బెట్టెను
నన విల్తుని కేమో మీదు గట్టెను
ఘన నాయకురాండ్లు లేరో అయినా
గాని యింత నిర్మోహితనమటె॥ ॥మనసు॥

పదముబాడి చిరునవ్వు నవ్వెను
పాలిండ్లను జూచి సొక్కి సోలెను
పదరి పైటచెరగు బట్టినాడని
భాషించక మోడి చేసుకొంటివి॥ ॥మనసు॥

ముద్దుబెట్టమని మోమటు వంచెను
మునుపు నిన్ను గూడిన దే దలచెను
పద్దుబట్టి మీ వారి ముందర
బైసి తీసుకొంటి వనుచు చిన్నబోయి॥ ॥మనసు॥

## 124. ధన్యాసి - ఆది

పల్లవి - ఇంటిమగడు కుంటెన గాడైతే
యెటులసేయ వశమే సంగతి

అను... వింటివలె వేణుగోపాలుడు
విడిచి రాక లెగ జల్లేవాడని॥ ॥ఇంటి॥

మిద్ద విడిది సేయ మన్నాడట
మిణుకు రవల సొమ్ము చూడ మనెనట
మెద్దుబరువు పాత్రలు బడియుండెట
యే వస్తువుకైన చింత లేదట॥ ॥ఇంటి॥

ఇకను తిరిగి తెచ్చి పెట్టలేడట
యీకాడికి చాలు చాలైందట
ఒక బిడ్డకు యే పోశిమి లేదట
వొప్పనంటె సన్యసించీనట॥ ॥ఇంటి॥

దారిద్ర్యము వెళ్లబోయ లేడట
తన ఆజ్ఞయితే పాపము లేదట
పీర పతివ్రత అని పిలచీనట
వెల వాణిగ వుంటె చూడవలెనట॥ ॥ఇంటి॥

పతిమాటకు మారుబలుక రాదట
ఇతిహాసము లిందుకు వెయి గలవట
అతివరో అరవై యేండ్లు జెల్లితె
అర్లు మర్లు గాదటవే ముదిమిని॥ ॥ఇంటి॥

వేణుగోపాలుని గూడేదట
వేశ్యవలెను సొగసు సేయవలెనట
ప్రాణ మెక్కువఁటె మానముకన్నను
పణతి రేపు తనకే దెలిసేని॥ ॥ఇంటి॥

## 125. సారంగ - త్రిపుట

పల్లవి - తప్పించుకొంటేని విడుతునా ఇక నీ
తల్లికైమైన నే ఝుడుతునా

అను...యిప్పుడేమే నీపప్పెల్ల చిమిడింది
చెప్పినంతమాట చెల్లి యుండగ॥ ॥తప్పించు॥

అర్జి వ్రాసి నగర బెట్టనా యిట్లా
గైతే కాలికి బొమ్మ గట్టనా
దరువులు వేసుకొంట వరహా లెంచుకోలేదో
సరసకు రమ్మంటె హరివాసరమనుచు॥ ॥తప్పించు॥

పంచాయితులను గూర్చనా నిన్ను
పదిమందిలో బైశార్చనా
అంచుకోక దెస్తె ఆలాగేనని
మంచ మెక్కమంటె మహాశివరాత్రనుచు॥ ॥తప్పించు॥

ఇల్లలికితే పండు గాయెనా నీ
విపుడే గెలిచిన ట్లాయెనా
తెల్లవారితే గాని చెల్లదు పొమ్మని
మల్లాడేకొ ద్దిటుల బొల్లి మాటలాడి॥ ॥తప్పించి॥

కూళ్లమారి యికనే తిట్టనా
కూడు గూడ్డపాతల గట్టనా
వేళ్ల వుంగరాలిస్తె వెనక చూతామని
కాళ్లకు మ్రొక్కితె కడకు బోయినా ననను॥ ॥తప్పించు॥

వేణుగోపాలుడ గానకే నిన్ని
వేళ రతుల గూడ లేనకే
ఆణి ముత్యము దెస్తె అడ్డి సేయనని
వీణె విందామంటె వెలిగోరుజూపించి॥ ॥తప్పించు॥

## 126. కళ్యాణి - ఆది

పల్లవి - చిటికెవేసితె నీవంటి
చెలులు లక్ష పదివేలే

విటుకులాడి యెవ డనుకొన్నావో
వేణుగోపాలుడు నాపేరు॥ ॥చిటి॥

అందగత్తెవనుచు వలచినందుకె
అలమి కౌగిటను జేర్చేవా
గందమలది విరులు సిగనుజుట్టి
కప్పుర బాగా లిచ్చేవా
బందరుకమ్మలు గదలగ రాగము
పాడి వీణె వాయించేవా
౨ మందెమేళమున యేమాటాడక
దండనతో ప్రొద్దులబుచ్చేవా॥ ॥చిటి॥

సరిగె పయిట దిగ్గున తొలగించి
చనులు అంటనిచ్చేవా
అరమర సేయక చక్కెరకెమ్మో
వాననిచ్చి లాలించేవా
మరుని భయము నీకెందుకు వలదని
మనసు దెలసి నడిపించేవా
తరియిదిగాదు యింటికి రమ్మని
తలుపుమూసి గడె వేయించేవా॥ ॥చిటి॥

చెలువరాయ నాసామిగ రమ్మని
చెక్కిల్లు నొక్కి ముద్దిచ్చేవా

మొలకనవ్వు లొలుక సారెసారెకు
మోము మోమునను జేర్చేవా
కలను కలసినది నిజమాటకు నను
గడియ రతుల తనియించేవా
కలదు లేదనుచు నిజముగ నాతో
పలికి యిపుడు సెలవిప్పించేవా॥ ॥చిట్టి॥

## 127. ఆనందభైరవి - ఆది

పల్లవి - ఈ కాపుర మెట్లాకృతి గూడునె
యికమీదటి కైనా తెల్పవె
అను...గోకుల వంశోద్భవుడైన వేణు
గోపాలస్వామి పోకిరాట్లకు॥ ॥యీ॥

ఇంటిజోలి అక్కర లేదాయె
హితపుమాట లెంతో కనరాయె
వంటతనకు ప్రత్యేకమాయె
కొంటెలతో ఆలోచనలాయె॥ ॥యీ॥

రాతిరి గుడిసెలలో పడకాయె
చేతికాసు లంజల పాలాయె
భూతికి అప్పులు గోకడమాయె
నేతిమెరుగు కలగనట్లాయె॥ ॥యీ॥

తందన పదాలు బహుమెండాయె
తగినట్లే కిన్నెర వకటాయె
పందానికి కోడిపుంజులాయె
బైశాట్లకు కిరుకిరు మెట్లాయె॥ ॥యీ॥

చూరుకు మొలకు వాకకోంగాయె
మారురవికె పేరెత్తక పోయే
పూరిపసవు అది బంగారాయె
ఉత్త చెవులతో నుండడమాయె॥ ॥యా॥

దినదినము పొందులు వినుటాయె
తిట్టినాను రోసము లేదాయె
నను రతిగూడి యేడేండ్లాయె
నాయీడుది బిడ్డల తల్లాయె॥ ॥యా॥

## 128. బిలహరి - త్రిపుట

పల్లవి - పిలచిన నాడెల్ల బింకాలపోయి నేడు
యిలుచుట్టు తిరిగేవేమే యిపుడు
అను...వలపుబుట్టినే మొగవయసు మించిన వెనుక
కులుకరాకు వేణుగోపాలరాయుడు

ముదిమిగాదటవే నీ
మొగము మునుపటి కిపుడు
పెదవులు తెలుపెక్కె
వదలిందే పలువరుస
చెదరెనే మైచాయ
చెలువు మందగించె
సదయుడు బతిమాలి
సాష్టాంగపడి మ్రొక్కె॥ ॥పిల॥

నేడుజూచితే తల
నెరశిందే సగబాలు

ఆ రూపే గాన మదిగాక చత్వారి
పాడలేవు గుక్కబట్టి మునుపటి కిపుడు
మోడిసేయ వద్దని మోహనాంగుడు నిన్ను॥
మకరధ్వజుని నగరు చికిలి వింతగచేసి
యొకతే వత్తురే యిట్లా వొంటిదోవ నీరాత్రి
ప్రకటించి వేణుగోపాలుని దయవచ్చి
యికనన్ను గూడితె యెవ్వరైన నవ్వరా॥

## 129. బిలహరి - త్రిపుట.

పల్లవి–తోలుతటి బ్రతుకెల్ల దోచదో యిప్పుడు దొరలు చేరదీయ
గానే మునుమీా

అను...తలితండ్రి తాతలు తమ్ములు నలుగురు నీవు
చలివేంద్ర బోసినది
సకలజను లెరుగరా॥ ॥తోలు॥

తలకు తైలము బోయ
దరువు లిద్దరు వేయ
నలుగు నలుగురు బూయ
నలుపు వదల దాయె
కడకండ కడవలాయె
కాయము బరువాయె
బలుసాకు విసమాయె
కలిచారు వెగటాయె॥ ॥తోలు॥

పరగడుపుతో పాచి
పండుతో మడమాయె

సరివారివలె దినము
సంధ్య వార్చాడ మాయె
పరి పరి రుచులుగా
బ్రాహ్మణార్థము లాయె
యిరికిపండ్లు జూచి
యీసడించడ మాయె॥ ॥తో॥

గోపాలకుని దయ
గొప్పజెందుట లాయె
యే ప్రొద్దు పండితుల
యెంత లేదను టాయె
దీప శెమ్మెలాయె
దివ్వె బెట్టడ మాయె
మోపుకట్టెలు తలను
మోసినది మరుపాయె॥ ॥తో॥

## 130. నాదనామక్రియ - ఆది.

పల్లవి-బడవాతనాల కేర్పటినావటె
బనికిమాలెన్న తొత్తా యికనాళ్ళ
నడుమ వుండతగదు
నగర వేణుగోపాలుని దగ్గర॥ ॥బడ॥

పెరటిదోవనే అది వచ్చేదట
పొరుగుననే యాఘునునకు విడిదట
సరసాలకు మీా చింపిరి గుడిసట
సభలో నిను మెచ్చుకొన్నారట॥ ॥బడ॥

అక్కడి కిక్కడికీ సారధివట
ఆలోచన కర్తవు నీవేనట
యెక్క డెక్కడనో ప్రస్తావాలట
యేమొగవారికి యిదేచదువట। ॥బడ॥

వింత వింతగా జడలల్లుదువట
వేకటిగమ్మని దీవింతువట
యింతలోనె ఆయన వచ్చేదట
యిద్దరి కొంగులు ముళ్లువేతువట॥ ॥బడ॥

మగడంటే దానికి తలనొప్పట
శగరోగము వొళ్లున యిమిడిందట
సొగసులు జేసుక మితారించునట
వగలాడికి ప్రాణపదము నీవట॥ ॥బడ॥

గొప్పవారి కడుపున బుట్టిందట
గోడలు బట్టుక నిక్కిజూచునట
యెప్పటికీ పుట్టింటనె వునికట
యింతికి వుపదేశ గురువు నీవట॥ ॥బడ॥

ఏవస్తువ నీకే దోపేదట
యేవేళా పోకిరి ముచ్చట్లట
వావివరుస అక్కర పనిలేదట
వనితను కాపురము సేయనీయవట॥ ॥బడ॥

చెరగుమాసెనని యది బొంకేదట
మరునాడే నీవు కడకు బోదువట
యిరువర్లకు వకతావున నునికట
యేమిజెప్పవలె సరిపోయినదట॥ ॥బడ॥

తుంటరి చేష్టలిక పోనీరాదటె
తంటలు తారాముళ్లు ప్రతిష్టటె
వంట వార్పు నేర్చితె కారాదటె
కుంటెనగత్తని పేరుబెట్టదటె॥ ॥బడ॥

ఎట్లా యీపని ఘటనచేస్తివో
యెన్నికొంప లీలాగు జెరిస్తివో
ఇట్లా ఆర్జన లెక్కడ చేస్తివో
యేమిండడి కిచ్చి దారబోస్తివో॥ ॥బడ॥

వారి కోర్కెలన్నియు పండిందట
వలరాయని మ్రొక్కులు చెల్లిందట
చీరకొనిస్తే కుళిపించితివట
చేతులో పైకము వేసికొంటివట॥ ॥బడ॥

## 131. గౌరి - ఆది.

పల్లవి—ఈ భాగ్యానికి రాణీ
వాస మెందుకే నీకూ

అను...ఓభామ వేణుగోపాలు
డొకరి గాలి కారాదంటె॥ ॥ఈ॥

తెల్లవారక మునుపే లేచి
కళ్లాపు చల్లుకుని అమడ
పిల్లలకు వుగ్గుబెట్టి
పిడకలు తట్టుకొనేదాన॥ ॥ఈ॥

వాడుకునే వాకబోకి సత్ర
వాడకు చేయించలంచి
మూడు నెలలాయె గదే
కుమ్మరవా డీవ్వాళ్ళో బంగారాయె॥ ॥ఈ॥

నల్లపూసలోకి వక్క
తెల్లపూస లేదిప్పటికి
ఇల్లు పురుపన్నందు కేగా
గిల్లింది లోతొడలో బట్టి॥ ॥ఈ॥

తల్లి నీకక్కర లేకుండ
తాటాకు వ్రాసేయమని
తెల్లవార్లు కొట్లాట వీ
ధెల్ల శివరాత్రిగ నుండె॥ ॥ఈ॥

గోడ నిక్కిచూచినా వని
యేడనో పొంచుండి చేం
త్రాడుతో నినుమొన్న యనం
త వ్రతము గావించెనట॥ ॥ఈ॥

యీడు జోడు చెలులకెల్ల
మేడ వుప్పరిగె లాయె
నాడేవద్దని మొరబెట్టితె
నను గురకాయించితివో లేదో॥ ॥ఈ॥

ఈతచాపమీద చింపి
గోతము బరచుకొని వాడు

రాతిరి నిన్ను గూడితె
యేతీరున సయిచుకొంటివో॥ ।ఈ।

## 132. శంకరాభరణం - చాపు.

పల్లవి- బారలుసాచుక జగడానికి రాకే
బయిశారి పోబోయ్యేవు మొలను

అను...చీరిగట్టుకొనేది సిగ్గుక యెందుకే
నోరుమూయవె మగధీరునివలె లేచి॥ ॥బా॥

బసివి యింటబుట్టి బందివద్ద బెరిగి
పసితనాన కన్నిపాట్లబడి
దెసజెడి వచ్చింది తెలియదా యెవరికి
అసలు బోగందాన వై తె వీడెక్కడువా॥ ॥బా॥

బ్రతికితే వచ్చెనా పంది వుండలేదా
వ్రతమా నోముల పూజ వొక్కప్రొద్దా
గతుకు దొరకగానె కండకావరముచే
అతివగుంట కాసులాడించె నేమొగా॥ ॥బా॥

మూలనీవు నడిచేది మునుపు నే నెరుగనా
యేల కారాదని యెంచితిగానీ
బాళితోనిన్ను చెయిబట్టి దగ్గరదీసి
యేలినవేణుగోపాలు ననవలెగాక॥ ॥బా॥

### 133. ఆఠాణా - త్రిపుట.

పల్లవి–సరిగచీర గట్టి కులికినట్టేగాదు
సభలో నిలవ వశే యింకొద్ద
మఱి రత్నాల సొమ్ము
లిరికించు కుంటెనే
మహారాజుమెచ్చ వే
మని వినిపించేవే॥ ॥సరిగ॥

పాటకు డేమొ సం
బళ మడిగి నాడని
చాట దెమ్మన్న నీ
మాటిగాదా
పేటనట్టుడు నీ
కాట చెప్పుచు తాళం
గూటాన తెగిలి సై
గుగ్గిళ్ళ దానికమ్మి॥ ॥సరిగ॥

చదువు లయ్యావారు
నిదుర బోవగ జూచి
పదరకుండ నెత్తి
పాగ మీటవా
అది మాత్ర మటె శాస్త్రి
లభినయము జెప్పుచు
మదన మందిరమంటె
బదులు కన్నదె వింత॥ ॥సరిగ॥

మద్దెల గవిసెన
మబ్బులో కత్రించి

పెద్ద దిండు గూర్చి
పెట్టు కోలేదా
కొద్ది దానవ వేణు
గోపాలుని గూడి
మిద్దె జేరుకోని యీ
మేరకు పై తాణి॥ ॥సరిగ॥

## 134. కాఫి - చాపు

పల్లవి–ఒచ్చేవో రావో దెల్పవే రెంట్లో నొకమాట
వలదే యీ నస నసలు నేనా
అను...విచ్చల విడి దిరిగె వేణుగోపాలుడ
యిచ్చేకాసిచ్చి తిరు గలడి యెందు కే॥ ॥ఒచ్చే॥

మెల్ల మెల్ల నే వచ్చి అల్లిబిల్లి జేసి
మల్లెమొగ్గలచీర శల్లా అంటుకోని
మల్లివచ్చేనని మాయలెన్నో బన్ని
యిల్లు జేరకుంటె యికనిన్ను విడచేనా॥ ॥ఒచ్చే॥

మదిరాకోట బెదరి పెదవులు దడుపుచు
ఒదిగిం దెవ్వారే యింత ఒళ్ళెరుగని శివమా
గదిమి పొమ్మని చెయ్యి మరుగు బెట్టుకోగానె
పదిమంది ముందర బైశార్చక మునుపే॥ ॥ఒచ్చే॥

గూడ కంబడి నిందవాడ బియ్యాము కరుకు
మాడరూకలు సంతనా డంపిం దెరుగ వో
కోడిగాల వేణుగోపాల రమ్మని
కూడియుందాము వాదాడక గట్టిగ॥ ॥ఒచ్చే॥

## 135. కాఫి - చాపు

పల్లవి–తిన్నయింటికి రెండుదలచే
ద్రోహిలంజపై తిరుగా ఆసవడురా నీవు

అను...వెన్నదీసి విసరి గుణపఱచి రాగాలు పాడించి
తేగమిచ్చుట బూడిదలోని హోమమయే॥ ॥తిన్న॥

యీగర్వితోత్తుల కేవతో ముందఱ
కాగలపనులను గంధర్వు లున్నారు॥ ॥తిన్న॥

చీలికగుడ్డలు చీరపోతులు వదలి
నాలుగేండ్లకె ఘన నాయకు సార్వైరి
వేలం వంచలేరని వెక్కిరించిన లేదా
కాలికి గానిచెప్పెక్కడ దొర్లి తేనేమి॥ ॥తి॥

కలినీళ్లు రాగిసంకటి చేలోగురుగాకు
నిలిచె శృంగారించి నీవు గూడిననాడే
తులువల కూడి బుద్ధులజెడితె బలాదూరు
తలకుబాసిన కురుజు తాక యోగ్యమెపో॥ ॥తిన్న॥

## 136. పంతువరాళి - చాపు.

పల్లవి–గొడ్డుబోతు వాకతె బిడ్డలకై నిన్ను
కోరియున్నదిరా గురుతు

అను...నడ్డిముక్కు మేనునలుపు మాటలు నత్తి
మడ్డిశరీరము మగువ బుగ్గలు సొట్ట॥ ॥గొ॥

వక్కలాకులువద్దు వరహాలంటదు సొమ్ము
లెక్కసేయదు చీరలక్కరలే
కక్కస గాండ్లిల్ల గాదని తొలగిరి
దక్కితిని యడుగు దండాలుబెట్టుచు॥ ॥గొ॥

గంధమేల పూలు గలవులక్కడ శానా
మందయానకు నేడు మారునీళ్ళు
సుందరముగ చాదు చుక్క దిద్దినది
అందగత్తెవిడిది అదిగో తేరకాడ॥ ॥గొ॥

రాణివాసములేదు రావచ్చు దొరవలె
ప్రాణము నీమీద భామామణికీ
యేణాక్షిని రతి నేలుకో యీరాత్రి
వేణుగోపాల నీకు వెకలైయ్యానని॥ ॥గొ॥

### 137. ఆరభి - చాపు

పల్లవి-సంకటియిది తిరు వీసము గాదు మ్రింగను
చవిజూడ వలదుసుమి

అను...పంకజభవనుత శ్రీవేణుగోపాల
ఇంకనన్న మీకండ్ల యెపుడుజూతు మోరాణి॥ ॥సం॥

సారె సారెకు ముద్ద సాధింప నోపక
బీరముడిగి యూళ్ళ బిచ్చమెత్తుచు విసికి
శ్రీరామ మంత్రము చిత్తము నందుంచి
ఆరగించడా శివుడు హాలాహాలము వట్టి ॥సం॥

నలుపు వర్ణము జూచి నమస్కారా లొనరించి
పలు దెరంగుల బయలు బ్రాకి దిక్కులు చెదరి
కలగి యంతటి గుముతై కాసారానివాసులై
కలహంసములు తమ్మి కాడలు నమలవ॥ ॥సం॥

ఇది సంభావితమాయ నేమి సేయుదునని
మదిలొ మాటికిచింత మగ్నుడై ధృతిదూలి
అదికారణము జేసి ఆది శేషుడీ భువిని
పదపడి యనిలము భక్షణ సేయడ॥ ॥సం॥

## 138. మోహన – ఆది

పల్లవి–కులకాంతలు విడిబడి నలుదిక్కుల
చెలరేగి రిదేటి పాపమో అయితె

అను... వెలయాండ్లకు జీవనమేమిక శ్రీ
వేణుగోపాలకు సంకరమైె॥ ॥కుల॥

ఉగదెలియని బిడ్డల నెడబాసి
వున్నమూల ముంత దాటవేసి
మగనిపేరు కారాదాదని రోసి
మన్నె కాపురము వ్యర్థము జేసి॥ కుల॥

అందెలు మెట్టెలు రవికెతొ జుట్టి
అత్తమామలకు దుద్దులు బెట్టి
బందరు పావడలో సద్దిగట్టి
పట్ణము జూతామని భ్రమలుట్టి। కుల॥

పిల్లెడుగుల చీర యెత్తికట్టి
చల్లవుగ్గ మొక చేతబట్టి
ఒల్లెయీడ్చి నడుమును బిగజుట్టి
నల్లశాజిన్ నిండు ముసుకు బెట్టి ||కుల||

తలిదండ్రుల మది తల్లడబెట్టి
తమజాతుల కపకీర్తి జుట్టి
తలపరాని నింకొడిగట్టి
ధర్మశాస్త్ర దెలముల రోచిక బుట్టి ||కుల||

జారుపైట చెరగు మెడకుజుట్టి
తేరలంజకాండ్ర చెట్టబట్టి
ఊరు దిక్కురోతబుట్టి
ఉబ్బితబ్బిబై తొడదట్టి ||కుల||

పగలు రేయి జాగ్రత్తగా నడిచి
బాపనిండ్ల పూటకూళ్ళ గుడిచి
తెగువచేసి ఠాణాలుగడచి
తగుదుననుచు సిగ్గుశర ముడిచి ||కుల|

ఇంతదూర మెవరు వెతక రారని
యెవరువచ్చి వేలు వంచ లేరని
అంతపనికి శేవిణి చిత్తూరని
చింతలేదు హూణుల దరబారని ||కుల||

### 139. ధనాస్యి - ఆది

పల్లవి–వాడైతే చేరనిత్తువు నిజమే

అను...సారెకు దొరగండ్ల జూచుదు
కూరిమితో ని న్ననుభవించే ||వా||

మీసాలెగుపా చేతులు తెలుపా
మీనాక్షయ్యవలె రొమ్మున
నీసాక్షిగ వీపునగూనా
వ్యాసాచార్లవలె నేమైన॥ ॥వా॥

పండ్లు పాడుగా మెడలో కణితా
పాపాపిళ్ళవలే అవటి
కండా పాపపుచెవుడ బోయ
కదిరిగానివలె నేమైన॥ ॥వా॥

దూడా కడుపా తిరువళ్ళూరి
ఆడిగానివలె ముక్కు
నడ్డా తలవణుకా మరగుజ్జా
నజ్జుపరెడ్డివలె నేమైన॥ ॥వా॥

నత్తా యిప్పుడు వచ్చిన సారాయి
గుత్త వనమరునువలె మూగచే
కొత్తచీర రాతిరి తెచ్చిన
కోమటి బోడివలె నేమైన॥ ॥వా॥

పడయక నినుగూడిగదా యెగ
తాళి సేయవలే యింతకు
పడతిరో వేణుగోపాలుని
పద్దుచెల్లవలె యేమైన॥ ॥వా॥

## 140. అపరూప - చాపు

పల్లవి-అట్లాగే కావలెదానికి
హైదర్శావాసు నాడు.

అను...కొట్లాడిం దెరుగవటే వేణు
గోపాలుని పిలువ వద్దంటే॥ ॥అ॥

వడ్డికి వేయమని రూకలు
గుడ్డతో గట్టియ్య గానే
పొద్దు నెత్తినవేసి యురికె
జిడ్డు మొన్నటితోనే విడిచె॥ ॥అ॥

కల భూషణములన్నీ ముడిచీ
తలమాటున పుంచుకుంటె
మెళుకువగా అంటుకొనీ జరిగె
బిలుము నిన్నటితోనె విడచె॥ ॥అ॥

పండుకు నేయుండి పక్కలో
పయిపనులన్ని చక్కబెట్టి
కుండలు చట్లన్ని జల్లగడిగి
వుండింది పండింది వ్రాద్భుకపోయె॥ ॥అ॥

## 141. ముఖారి - ఆది

పల్లవి—ఇంచుబోణిరో వినుమీ యింటినడతలు చూడ
యెంతచోద్య మయ్యానే యిపుడు
అను...పంచబాణుని నగరు
బలువింత గాజేసి
ముంచినట్టి గృహము
లెంచ నా తరమటే॥ ॥ఇం॥

వెలయాలనుచు ఘనుడు వెయ్యారులిచ్చితె
ఆలమేలు నీతల్లి యల్పబుద్ధి చేమరచి
కులహీనునితో రతులగూడి పెనగ గానే
తెలియనాయె నీసారు తేటతెల్లమిగాన॥ ॥ఇం॥

వారస్త్రీలై తేనె వావివర్తనలేదా
శ్రీరామ నీపిన్ని శింగిరేగి యొక్క-
తీరుగా యిల్లిల్లు దేవరించినదని
యీ్రా రై మీారెదురింటి యెంబారుమాావారనేనే॥ ॥ఇం॥

పటికె పర్ణముకేమి పడుచు రూపరియేమె
యెటుల జూడలేదే యీాయెట్టువెంద్రుకలేమే
అటునిదానించితే నావరూపేలేదే
నిటుల మది కిష్ణముగా వేరేమార్గమటనే॥ ॥ఇం॥

చవుశీతియుపములు సఖియపై కొనిచాల
అతిథిపడినేర్చితే నదిసిగ్గు బడిలేచియువిద
నన్నిటుసేయ యుక్తమానా యంటె
నాయకిపై యే పనులని దెలిపేవు॥ ॥ఇంచు॥

వేణుగోపాలున్నైన వేమారు గలసినా
వీణేనని దెలిసితి వేకటామువానీవు
రాణివాసమనుచు రాత్రిళ్లు దిరిగేవు
కాణాచివలె పగలు గడపదాటిరావు॥ ॥ఇం॥

## 142. కల్యాణి - చాపు.

పల్లవి-అచ్చయ బుట్టింది భూమికి బలుశబ్ద
రైణా దానమ్మసోణిదీ సూడెం

అను...పచ్చినూకలు నేలా
బడితె యిదీనేబ్బ డేలు
బిచ్చగాల్ల శేశిడిశ
బిపదు బంట్ల నీతూరి॥ ॥అ॥

మందలు గదిలె పరమటిశీమ కెగబడి
కందులేశిరిగా శెక్కౖౖఁరాక్క
పండేశిఅందులో సాంకోలేక మ్మొ శిరేబిడల
కుందనంబు పై డి కూట్లీల్ల కిలబోయె॥ ॥అ॥

శెట్టుమీాది పచ్చులట్టుత లేలే శె
మట్టుదొంగలు వగతట్టగిదేర
గట్టిగా బీనోల్లకు కలబం దేగా కూడు
బట్టమర కేడ దిప్పటి యాడమాసులకు॥ ॥అ॥

అలుమొగడుగూడెదది వోరో బగు రేగిచం
సాలాపుడకాడించె సప్పంనారాగాలు
యీాలోనా యేను గోపాలుని దయసేత
కాలువరసముగురిశ కరువు దెలిశగాక॥ ॥అ॥

## 137. మధ్యమావతి - ఆది

పల్లవి—అగ్గురోరం శేరు పెండ్లకాణ్ణె
ఆకడెల్లబాపన్నా రే రేత్రికి
అగ్గురోరపెంగయ్యకు బోబెణెం
పూరేయోర్ల కిందు శప్పాల్ నంటుంౖడి॥ ॥అ॥

ఈడ బొంగు సాసగ్గూకుంటె
యిర పరం లేదేంచెన్నె
నాడిపిస్తినే కొర్లొగసిట్టెడు
నెడిమ్మా ఆస కేబద్దము॥ ॥అగ్గు॥

వరగంజాయ గింజలేడబుట్టె
వాపోయినేగొర్లు పూరిశిక్కర

శరవు లెండిత నిచ్చ గెలె పచ్చులు
శే శెదంట దరము ధాణి పింగళి స్తి ॥అ॥

వుండింది బండింది బాయకళగానికి
వూడనపాయ కడమ దడమ అచ్చయ
కండలుదొలి శేవు సనేస్రపు జీంద్రం
గుండగొయ్యి నెడిపొడు బలు శెడగర ॥అ॥

యెగ్గ శ్శైలోన యేలుబెట్టుకొ
యెందరికంటని చందాగించను
పెగ్గేలుమరి శెప్పేదినిపోతె
పెద్దమాసుడంటనినూన్నా నీకె ॥అ॥

యేణుగోపాల చామి మమ్ముల
నెంశ్శై బోయి నింగమీన ముంగల
పాణాలు సక్కంగుండ లెనిపోం
పాగ మేడనక్కలె త్త పోదులె ॥అ॥

## 144. రేగుస్తి - చాపు

పల్లవి - కొండ సుట్టొచ్చే రంటె నారాలతూరి
కొండ సుట్టొచ్చేరంటే
అను. . .బండారిపాపీంద్ర లాలిదాసరిశన్ను
నండేరంటూరికూళ్లు వారస్తాణె పైణాలు ॥కొండ॥

ఊరూరియిగిణిల్ను - వూవుతొవాస్తాచన్నా
గారనూ రేమండి-జన-గంటవాపిదాపగానే
తేరుమూకై పరచైన - దెయేంద్ర యిలమాలె
గారడా జంటుండావా - కళిగ్గె వైకుంట మేనె ॥కొండ॥

నెగిరోరుగళమెత్తి - నగరాలేపినుకుంట
యిగతల్లెయేలాయ - యేనీగలీవుమీాన
చొగుచేయెండెంబారి - బగువాన్నెమింగోటి
మొగదంబ్ణెయాలి - యింతశేపించుండారు ॥కొండ॥

చూగాచిజనమాల - బోగమమ్మంగాండ్లు
రాగాలు గోణగుత - చాగెలనిలబడి
తేగాలింమంటేమొ - తైతతలాడేది
లాగున్నెశిన్నె న్నెం - బలిదాపిసన్నిస్తా ॥కొండ॥

పెద్దసార్లపులి - పద్దంనేశేరుండు
కద్దెమనకుసూపు - కానుగిరిచ్చాలుండాయి
వుద్దులుడకెగుండాయి - వుపవాప్యమేమిటికి
మద్దెన్నమీాణెయ - మడకాడెద్దల్నిడిశి ॥కొండ॥

కాశిసైకై కెడు - కగవాల్లపోడైనాను
ఆశకై నెగేగు - లంతకన్నగ్గవా
రాపొరిశెల్లోశి - ౹రేకుయెదిగున్నాంట
కోసపోరొయేను - గోపాలుదలసుతా ॥కొండ॥

## 145. మోహన – చాపు

పల్లవి - ఇసబోనమ్మోన యాదెంబడెల్లోచ్చే
దిష్టిగ్నమో యాస్పృడో
బామ్మో లేక-యిగనేసుడో సముడో॥

అను...నొసలిబూదిగొట్టి – నొష్టం గంద మెత్తి
కుసునీ కుండాడోడు – గుండాలె ముఃంగాల ॥ఇస॥

ఏకులబుట్టేలుం దేటిదో రాగిది చిరచూ
తాకించకే తక్కె తాంబూలా లియల్ నంట ॥ఇస॥

పోకారమద్దంత పదలచ్చెకుండువా
డాకుసుంతొంటియ్యవదంటే
కంబాణామూ గొడుగు లంట శాపి
గిడుగేల్నే యుండాయి-అడుగున
పబనో రల్ల బెట్టిందిట్టె తడిగేలేవ
గటుంది అగేపేరెటమను -
పడుసూపినోన్నె ల్లేందో పక్కలా యిగిట్టి ॥ఇస॥

బోగమాలాల్లే వాయాగాదుంటేల్లాదె
సూగాచిపుట్టికసూచ్చమెంతే
నాగేడీమండాదా నక్కిరసపోదులే
బేగిరాసూతాడి బేమ్మానారిడిసొచ్చె ॥ఇస॥

తాలాలువాసగ మేలాలాగుతొండాగ
సీడికలుసూడ శిత్రాలాడె
పూలంట శెడుగేలు పుట్టుగిచ్చాల్లోనో
తానగారిందాం యి తలదుంటేకంచోలె ॥ఇస॥

దీటి వెలుగుతొండా దోరణాలకిందూరి
యిూటీలెగబట్టుం డేద్దెమంటనో
యేటికే అయ్యోరకేదాలు పాటకిం
కోటిసూస్తె యేనుగోపాలు సెలుండాది ॥ఇస॥

## 146. మోహన - ఆది

పల్లవి - మాసలకిరీదికరంగాబదలక - మంచిగామంచలవీరండోయి

అను... యేసనదెల్దోయి కేతికిదొరద్ద
యీనగొట్టెయాల నిలబడడిగితే ||మాస||

నెగిరోర్లోసక్కంగ బట్టాల్న నే
నడిమద్దెపు నాకొండెల కిరితికెం
బగుమాణముసేసి దండపడుదురె
యుటికెల్నిచాముర్రోరియిద్దెకు ||మాస||

అచ్చయమల్దల యీరికిచన్నాదు
ఆరేండ్లాయ మడకకట్టెశెలో
యిచ్చిలెమ్మనిరె మగతారెణ్ణర
యింగనున్ని పింగళింపులణుభోగం ||మాస||

తారక సారక మంటనిగింజలు
యీరికెతిని సూపిరింత పొడగన
పేరుగనమె పోయిలోప్పిల్లెలో
పెందలంట శెప్పరే మీయెంట్లోడు ||మాస||

పొత్తలకాలెగవ్వారికి దీనికి
మొత్తొచ్చిరె దుడవకాడ దొంగితె
కొత్తకాపుల్నిడంటని మురి
కినాకొండెలు వునకల్జుపడనెయెగదల ||మాస||

వేణుగోపాళ చామిమిన్నే
యేకయింతంగల్నే అరుచోద్యం
చాణలెక్కపబళము యీచుద్దులు
చెంజికాడయింట్లోయి దబ్బరకడ ||మాస||

## 146. పంతువరాళి - చాపు.

పల్లవి - నగరాన తెప్పతిర్నాళ్ల మేడికె సూన్నవాగు నివురాలే
దంటే- అపిడె

అను...అగుమూడియర్లచ్చి - తొగటాయాటను బళివి
చిగమెత్తినట్రేళ్లి - వాగరితో సెప్పక నేరెయ్యి ॥నగ॥

పదమచరచుకాడ - పందిలేబ గినోదం
సదురేశిందే చోదెం - చామిదే యింతా
యెదురుమలుగకూ - డొండేశిరింటెలుపున
అదెశెయి సూపియ్యేళి - రాన్నె మాశికింతలైె ॥నగ॥

చోమాదిగు లయ్యో - ళ్లే మాయేటలసంపి
దోమా దుగ్గిలోయేసే - రొనము కాడా
యేమా బేమనటూక - యెక్కడియిషమరార్ఘం
రామానుజ పజలో - రాల్నంటె యిశికేస్తె ॥నగ॥

అంగల్ల దొరుతుకూల - అయ్య తోడేయేశగాల
బంగారుగరుకుమాంల - బారుమేలారా
చంగినాగుత్రాల ల - చ్చయిపల్లకేనుగల
జంగమాల్లా బేదె - మంగలోల్లు వాశేదే ॥నగ॥

తెప్ప జతణముసేసి - తేంగాణె పటులట్టై
తప్పక కుసునికుండ్రి - తమ బలగంతో
అప్పుడేగమా - లాడ్రే యిగ్గినాలొద్ద
గుప్పున చుట్టొచ్చి - రెప్పుడో గిరక్కున ॥నగ॥

యిట్టే కంబాలాల - కేమగ్గిబెట్టిరో
సుట్టేసుకోనె గబ్బు - సుంచేవులో

అప్పేణుగోపాలు - కాణ్ణే చెయిమొక్కేసి
శెటుసాంటుంటి గ - జేంద్రమోచ్చమెతెల్లె ||నగ||

## 147. పంతువరాళి - ఆది

పల్లవి – సంగనాయకమను బీమొడుండాయి
బింగరమెయి బాపనోల్లకు
అను...అంగల్లో అచ్చింత్లోగింజతె
చంగటి కిశిరిన పిండిసమైతే ||సంగ||

మొండిపీన్గె లేణ్ణుండి శడొచ్చిరో
మోగరించుకొని తెమ్మంటెలెయ్యారు
శండితనమిదు శత్రపీడుంటె
వుండొద్దను యింగుంటేవ్వూరోల్ల ||సంగ||

యేదాల్లోపరిచిచెంతుంటే
యెయిటికిణ్ణె గోరస్తపడుండవె
గోదార్లైతె గుడ్డెల్లిందేమీాడ
గొండపామ్మను పిండొల్నంటె నాతెంజ ||సంగ||

వోడయ్యుండిల్లుసూపించె నాయలు
యీాడనేపడి సాయల్నంటి పిసాసులు
బూడెదీశడై మొగానచోంపింగ
మేడదెత్తు యంగాలవ్వూరోల్ల ||సంగ||

సెప్పొచ్చినగుంజిగాని సారశెం
శాత్రికమాపి గూడెల్లగుక్కుడు
సోపణానా సూలేదంట మొరిగితె
శూశెరంట యూన్నోరొసెల్చేట్కొని ||సంగ||

యేనుగోపాలుని. కెరికెమూకాపిర
మేలుకొన్ని శాకురాయులతోతల
యీా నెల్లెల్ల గనికొరకొగ్గింజ్జలె
యుగతావుగతం తెలకుంబెనాలంజ ||సంగ||

## 148. పంతువరాళి - ఆది

పల్లవి - బౌపడాసుల్లోశినావుదబ్బిలి
పండువడునాడవిప్పిస్తినే-మా

అను...యేపెబెమ్మరాచ్చిశి కలబడెనా
యిసనకాయులు మొదటికి శప్పద్దనేవు ||బాప||

అసిరోదంపింగళిస్త్వసలైన్
అచ్చింతలుకొల్లేరక తిన్నె
కాశికిపొయ్యోస్తేం బొల్లెదో
కరవాడై యేటికొండేవుఆసొత్రి ||బాప||

పుంజమైవురిదాడెలెజంజం
బూతమూపేదిమొగాన
శెంజిదురగమై తెయేలుబెట్టుకొ
శెపి తెయింబెమాసలకొడుకినొచ్చు ||బాప||

చంచై చద్దొంటకమూ చిలలో
సాకవెంగ అంట్యా_గుంజిత్రైం
పంచాంగంయిపొద్దశినిత్తాం
పంగబగలయేస్తై కసిప్పడాలె ||బాప||

పిన్న పెద్దనంట మొరిగినకుక్కను
తిన్నకిర్చ్చిక రాసవరదు శేతాంయి
కన్న లెంజకొడుకులకు పరేశం
కానిమస్తి కొక్కరిస్కుంటసనేస్ర ॥బాప॥

ఏనుగోపాల చామితిరునా
ళ్లిల్లు కూడుబెడుమ రాడమస్తుగ
వాలెగేశ గింజలీనెకిరమాయె
దానదరమం తూటెల్నెట్టె శెయ్యొచ్చు ॥బాప॥

149. నాదనామక్రియ - చాపు

పల్లవి - మనుషా నమ్మబాకే-యిద్రేగాము కళేభారం-మనుషా నమ్మబాకే

అను...మనుషా యిాద్రేగాము - మట్టిసట్టెంటిది
పని శేటిలోనుండె - పరమాత్మ డెల్నంటె ॥మ॥

తోమ్మిది సారంఘాళతోళే నరమాశిగ
బెమ్మగాయించిది - బెష్టకారికట్టె ॥మ॥

ఎన్నెంటా యెంకేలు - యెంక ముంగ లెంటికేలు
కన్న యూమలబుట్టు - గడగ కుంటెగబ్బు ॥మ॥

పయి యెన్నె లడుగున - పరమ శాంధలము
మయిదు యిాస్మ్రదు శేశి - మబ్బి గప్పిండాడు ॥మ॥

తనదోషాణ శెత్తి - ధరమ ధాణంశేశి
యినవలె రామేంఢెం - కనమోచ్ఛము ॥మ॥

ఎంటవగీటి రావు - యేనుగోపాలుని
బంగై పాదకవళం - బట్టాలే ఘట్టిగ ॥మ॥

## 150. మోహన - చాపు

పల్లవి - ఇచ్చేదా యీాదికి లే - శొచ్చేవా

అను...రచ్చశాయకంట - రాశలేమోాయీాడ
ఇచ్చలేదరూాశ - యేనుగోపాల॥ ॥ఇ॥

సంతకాడ యీాతసాపలగ్గవంట
సనోరము నేడు
యెంతహాద్దెక్కేనే
యేమాలకాడొస్తి యేమమ్మయీాగోడు
శింతోనమొద్దమాా శిన్నోడడిగెతల్కి
శీహామ్మంటివానాడు
యంత శెప్పినయినవు యిగనేమాాశినిగాను
సుంతకల్లసూాడు-మంచోడు ॥ఇ॥

బగుమాణమిప్పించె బగిశేనాయీా మాాతి
పాతశీరుం దెంటివి
నగరదచ్చసశినాగ్ని చేతులోబోశి
ననుసూాశిదాగుంటివే
అగసాలదంతో అన్నెలమంట న
న్నాడీపాసుకొంటివి
యిగతాామాాకిరితప్పి యేళనంశేశి సా
మ్మెగయేతాామంటుంటివి-మస్తింటివి ॥ఇ॥

దోశాలముందఅనాశారినగ దో
దాశికిరమ్మంటివి
పాశము వరికూడు పాణకమింతిచ్చి
పాతికె లెక్కంటివి
వోశో నిమిాన నిన్నాగముప్పాతికె శెప్పి
వొద్దియ్యవొద్దంటివి
గాశిబెట్టి నాతో కలశుంటిచీచీ యే
బ్రాశిపోపొమ్మంటివి—లెమ్మంటివి ||ఇ||

## 151. మోహన - ఆది

పల్లవి - బాపనోండు శెప్పేదింటుంటె - పయికమేడదంష్ణాడు

అను...దీపాల్ రెయినాపక్కలె మునుకొని
కాపెంగిటిదేయిరింట్లోసాప్నిన ||బాప||

శిరతసినచ్చత్రం బొయ్యేనంటి
శిన్నో న్నెసుకొని
పరిసంబడికై పొద్దన్నెల్లో
పచ్చిబీమేపిస్కని
బొరుగులుగొరుకుంటా నెమలోనమిమ్మన
బొయ్యొనిసూనుకొని
పరిగెచ్చేనంటెదుగ్గాలేతల
శరయిడుపిసుమంట కై సాపడిగితే ||బాప||

ఆగిత్తేదు నేదిసొంటిదేమో
అయ్యోరంటీడు
యేగిలేస్తేయేదాలేసదతా
డెగేశనంటాడు

యీాగరీస్తు నా శేతులా శెయ్యో
శిపు డిగిలిస్నాడు
రాగ డేశినీ యిశోసమగ్గిబడ
రాశిగిరూకదాపెట్టింగో తెకు ॥బాప॥

కానాలగాడతంఁడిగాడీ
గాజులుయేపించ
తానేరాకల్లాలకు దీసపోయి
తైదలువొణ్ణించ
గానానికిమంగలెంగునెట్నించి
గామానిడిపించ-
కానియేనుగోపాలుడిశారి శెం
తానేయిాశినోన్నిన్నిడిపించి ॥బాప॥

## 152. ఆరభి - చాపు

పల్లవి - అగ్గితిరుణాలంట అజ్జునికతలంట
అవురాయెంతసొద్దమే
బారతకత-ఔరా యెన్నెన్నింతలే

అను...సుగ్గిజయముదీని సుట్టుబలాదూరు
అగ్గురోరపుఅయ్యోర్నెడిగేనీసొచ్చిగ ॥అ॥

యిగనేసు పయినెక్కి- యీాబీసనూడొచ్చి
బగుపేగ్గెలెన్నెన్నో - బలికి దుశ్శాసూని
మొగముచూడగానె - మొర్చనాయాలట్టె
గుగురుమిగురనకుండ - గుడ్లెల్ల గుక్కెనె ॥అ॥

అనుమంతెనకటోడు - అబిమన్ను డెంటనె
సనియునోలెబట్ట - సాము శెయుచుఅట్టె
యినయెయిారబద్రు - నిసన కాయలుదొక్కి
కనురెప్పె శేతల్కి - కర్ణునిశించనె ॥అ॥

యిరన్నె చ్చు చడ్డకు - డింద్రజిత్తొకరెయ్యి
దురివోదనుని శెయిలో - దూరి ముక్కున నెల్లి
అరశి పిసాశోలె - అశ్వద్దామనుమింగి
సురివోదమాయనే - సూడయేడిగున్నె ॥అ॥

బేరిబూరుగలింట - గారదేవలమొద్ద
యిారపతిమెకుమొక్కి - యిటుతలెత్తెతల్కి
మారుబాసోమెకడు - మొలతిత్తొదిలించుకొని
శారదై దీశెడిదా - జనులకిచ్చె నేనిపు ॥అ॥

తేనీగగుములోలె - తెండెతెండెగపంజ
కోనచముద్రం గుంట - కొననునల్బడిసూడె
నానాదించింగల్లె - నానారం చంతోలె
యేనుగోపాలుడు - యెటులగాయించెనె ॥అ॥

## 153. పంతువరాళి - ఆది

పల్లవి - నాన్నారముచంత్లొ నానాదించుందెంట
నయముగిచ్చేరంటనె-సూడే-

అను...ఈన్నె పొద్దెక్కెనే - యిాడేడుండా-దెంటె
కోణ్ణి గొండపోతె - కొందురే వొగురైన ॥నన్నా॥

ఇలనేడసూల్లైదె యిాసుల్లెమగ్గవే
మలుగుశాపలాడ మస్తంటనె

తలయొంటికెతాళ్లు నిలువుపొడుగై య్యానే
అలసొచ్చేతల్కాడ అంబలొంపుండెరే ॥నన్నా॥

అమ్మెరంటి త్తలి కమ్మలుంగరాలు దెమ్మనిస్తి కీల్లుతిమ్ముశాతా
కుమ్మరక్కదోట గురువుఅగుమూడెల్కిచో
చొమ్ముగసూడాలేచోద్దెంగుండాలె ॥నన్నా॥

మోడోల్లకీన్నంగు మెట్టెలకంటొచ్చి
ఏడిదోచలుతిన్నోరెండుకొని
అడనీల్లుదాగి అగ్గలేసురుకెత్తె
సూడలేదేవుల్ని సూడయేడిగున్నె ॥నన్నా॥

అబిడిప్పటికీదు లెంతచింగారమే
నబురుకొక్క మోలు నాన్నెముగా
పెబువేగాయించెనూ బెమ్మెనిమించెనో
నుబిలమైయుండు యీా సూనిదీయనిశాత ॥నన్నా॥

కాశిపొడుగెతికిన కలదాయిాగోపిరం
యెశశీలుగుల్లో యెగిరేరేమొ
వోశయోర్యల్లగుములై వాపాయిరేచిలపెద్ద
పాశపుకూడే గోపాలుని దయశాత ॥నన్నా॥

## 154. పున్నాగవరాళి - చాపు

పల్లవి - నచ్చత్రంబొయ్యొత్తామె - చంద్రూమాశీ
నచ్చత్రం సూశొత్తామె

అను...లచ్చుముశన్నారు ద్రరవు నేమాగొల్లెంగు
పచ్చిబీమిశిరిపుడే - పయిణా మంటుండారు— ॥నచ్చ॥

బోగమూ ల్లాడేరంటే-శిరతనిగాల్లో
వాగనా లేడికంటె
నూగింజై య్యెడముండ నూకటమిపరీతం
తాగసీలుందెంట దనలొట్టలేదంట ॥నచ్చ॥

గురుగులగ్ద వంటనే-శిన్నింద్రమూక్కు-
స్తారుగుపండేశంటనే
యెర మొక్కొ-స్తాదంట యేపిలెంటేస్కా-ని
అరిచంద్రకతగట్టి ఆడేరంటేశ్కా-లు ॥నచ్చ॥

తొగురుశీల్లురుంటనె కాశిశిరె స్తె
తగరపుంగర మోలెంణ్తే
ఇగ నేనుమండప మెనకలింటోరుందాంయి
నెగిరోరొచ్చెరంటబగుయె ॥నచ్చ॥

కొత్తచింబాళంటనే శేపించింది
శిత్తూరికాడంటనే
యెత్తుడురతమూమసూరలంటుండావా
నెత్తిపాగీడు తలెత్తిసూసేడిగ్దుణ్ణంట ॥నచ్చ॥

నందనలుందెంటనే-దుగ్గానికి
శందిర మింతంటనె
వుందెంటీత బెల్ల మేశిననిప్పట్లు
కొందాంరాయే యేనుగోపాలు దుండాడు ॥నచ్చ॥

## 155. నాదనామక్రియ - ఆది

పల్లవి - కిన్నవాస్తా నిలబడుకుంటె - గింజలేద దైతం-యాడ

అను. . .అన్నిలేవెయెందొల్లోడబెట్టిన
ఆగిత్తెమతెల్లారకతల్కా ॥కిన్న॥

వరచాలేమంటని యెగబెట్టెనొ
దరయూనిక్కొరం శేశిరినరకలు
శరవల్లో శాపలు సారేశిరి
శాలల్లోకర్రబయిటికెల్లలే ॥కిన్న॥

కొలువులంటసూస్తె అబముసుబములె
కొంపలిడిశియేల లేకుండడమే
చలిగివాగిరికైనంతపాతలె
సారశములేని నిగ్గుపాట్లుజెప్పితే ॥కిన్న॥

ఉప్పొగద్లెము త్తికేభలుపిరం
వుపాశమున్నా యేమంటడగరు
యిప్పుడేచంతలో యెగబగలైతె
యాంకాపిరెమెట్లాయెల్ దోయను ॥కిన్న॥

మూనాలయ శంగిడేశియేపికి
ముశిల్ దిలై లేసంటిద్దిగలే
పానంలేగొడ్లనూన్నశింగెం
పందెన్నోగూటిగూటిబొబ్బొభో ॥కిన్న॥

ఈడయెల్లుకుంటేగాదరమం
యిన్నాల్లలె పోసపో తెకులుకుదు
నాదిస్తినెసగబెట్టినతైదలు
నాశారతో మీ కి సోసమేడది ॥కిన్న॥

వోరా యిద్దర చందాగించను
నారాయనికీయాలకెంటికై

కూరాకంటెనె సదలయ్యోరికి
బారబోసుకొనె శిలికెశిక్కలె ॥కిన్న॥

ఏగిలేనై బుట్టిసంగ నేసక
బుట్లావుడకాడిస్తే మానల-
బోగమీదికొల్లబోలె యేలుని
రాగ మేనుగోపాలుడె యనాలె ॥కిన్న॥

## 156. ముఖారి - త్రిపుట

పల్లవి - తేరు శే శెనంట తెచ్చినపైకమీ- తెరువు శే శెగదవే-యిట్లా

అను...వోరుగంటికిపోగా - పొగమాశి బరువుగ-
బెరోలిచ్చి రేకరింబేటి యీసురునికిగా ॥తేరు॥

పసపునిగ్గుగాబూశి బైగలంట శెవునేశి
అసలుకాటుకరాశి అట్టేసోగలుదీశి
కసరుబుద్దురురోశి గౌరిపూజసేసి
వసుధలోనిటుచూశి వడుగుపెండ్లి జేసి ॥తేరు॥

సురుగీవునితోసమము సూసెనంటిదీజగము
తిరిగి తెచ్చినదనము దిగమింగేశదిందినము
శరపరములీయితము శేశిం తెల్పునరతము
అరయనీసాహసము అంటెబల్ రోసము ॥తేరు॥

సీనోసుబెంటోడు శెప్పిందింతోకనాడు
యీనెల్ కొడ్డికిపైడుయేశనంట నీతోడు
కానిమస్తై సూడు గనముగేపలమిపుడు
యేనుగోపాలుడు వోరిచ్చునోయిపుడు ॥తేరు॥

# చతుర్థ భాగము - కీర్తనలు

## 157. శంకరాభరణం - చాపు

పల్లవి - వేణుగోపాలుని విడువము-మరి
వేరే వక్కరిపేరు నుడువము

అను...వీణుగ కాశికి నడువము-ఖలుల
విత్తము కొంగున గట్టము మా ॥వే॥

పాపకర్మల కడప మెట్టము
పతితపావనుడే మాకు చుట్టము
గోపబాలుని భజనె దిట్టము
యమున గొడవెందు కిది వేరే ఘట్టము మా ॥వే॥

పరమభక్తుల దండ వీడము నర
పతుల మేమిక కొనియాడము
హరిని వినా వేరే పాడము దుర
హంకారులమోము జూడము మా ॥వే॥

కర్మపాశములు సల్లింతుము లోని
కలుషము కడిగి గాలింతుము
ధర్మ మార్గ మనుసరింతుము పరం
ధాముని మదిలో బంధింతుము మా ॥వే॥

నారాయణదివ్య నామము యె
న్నటికీ మరువమీా నీమము
తారక మిదిమాకు క్షేమము శ్రీ
ధరుని సేవే పూర్ణ కామము ॥వే॥

రక్షించు మని రవ్వ సేతుము యెదుట
రాకుంటె వక చెయ్యి చూతుము
పక్షివాహన యని కూతుము మారు
బలుకకుంటె సిగ్గు దీతుమా ॥వే॥

## 158. శంకరాభరణం - చాపు

పల్లవి – మాటాడరా వేణుగోపాలా యింత
మానమేమిర వేణుగోపాలా యిది

అను... ఏటిమర్మము వేణుగోపాలా యికమా
కెవరు దిక్కు వేణుగోపాలా ॥మా॥

మోము జూపర వేణుగోపాలా నీసా
మ్మేమి బోదుర వేణుగోపాలా
యేమి జెప్పవు వేణుగోపాలా ముం
దేమి బుద్ధి వేణుగోపాలా ఒక్క ॥మా॥

రక్షించరా వేణుగోపాలా నన్ను
పేక్ష సేయకు వేణుగోపాలా
కక్షిగట్టకు వేణుగోడులా సుంత
కరుణ జూడర వేణుగోపాలా ఒక్క ॥మా॥

చేరదీయర వేణుగోపాలా నన్ను
చెట్టబట్టర వేణుగోపాలా
వేరుసేయకు వేణుగోపాలా కా
ర్వేటినగర వేణుగోపాలా ఒక్క ॥మా॥

## 159. శంకరాభరణం — చాపు

పల్లవి — కొలచితే వేణుగోపాల దేవుని — కొలువు కొలువ వలెను

అను...తలచితే విష్ణు చారిత్రంబులు తలచుచుండ వలెను — ఓ
జనులార ॥కొల॥

నిలచితే శౌరిదాసుల సంగతి — నిలచి యుండవలెను
పిలచితే చిన్నికృష్ణా రమ్మని—పిలుచుచుండ వలెను—ఓజనులార ॥కొల॥

నడచితే వాసుదేవుని గుడిచుట్టు —నడుచుచుండ వలెను
విడిచితే హరిభక్తివర్జితుల—విడిచి—యుండవలెను—ఓజనులార ॥కొల॥

చూచితే వనజాక్షుని దప్పక — చూచుచుండ వలెను.
కాచితే వైకుంఠుని సన్నిధి — గాచియుండవలెను ఓజనులార ॥కొల॥

పాడితే జగన్నాథునిపై పదము బాడుచుండ వలెను
ఆడితే పురుషోత్తమునే కొని—యాడు చుండవలెను ఓజనులార ॥కొల॥

వ్రాసితే నేమముతోటి రామకోటి — వ్రాయుచుండ వలెను
చేసితే శ్రీమన్నారాయణ స్మరణ—చేయుచుండ వలెను—ఓజనులార॥కొల॥

## 160. ఆనందభైరవి — త్రిపుట

పల్లవి — నిన్ను దైవమనుచు యెట్లా నమ్మెదు నయ్యా
యిన్నాళ్లవలె యికను—మదిలో

అను...ఉన్న సంశయమె విన్నవించెద నిపుడె
వెన్న ముచ్చిలి దిన్న వేణుగోపాల దేవ ॥నిన్ను॥

చెల్లబో జమదగ్ని చెప్పిన సేవమున
యెల్లభూతమ్ములు తల్లడమందగ
నుల్లము చెదర కత్యుగ్రకోపమున
తల్లిని ఖడ్గమున తలద్రుంచితి వకటా ॥నిన్ను॥

వేదశాస్త్రముల ప్రవీణుడై యరుదెంచి
పేదవటుడై బలిని ప్రార్థించి వేడగ
పాదత్రయంబుర్వి పాత్రుడని యర్పించ
నాదట పాతాళ మణగబెట్టితి వయ్యో ॥నిన్ను॥

యేలోకముననైన యిట్టి వింతలు గలవా
యీలాగు సుగ్రీవు డితవు బల్కగానె
నీలావు దెలియుటకై నిరపరాధియైన
వాలినొక్కమ్మున వసుధ గూల్చితివహహా ॥నిన్ను॥

## 161. పంతువరాళి - చాపు.

పల్లవి - కరుణ నీకు నామీద గలుగుటకు
కారణ మేమయ్యా

అను...పరమాత్మ వేణుగోపాల నీదు నామ
స్మరణైన జేసితినే-యేవగనైన ॥క॥

అల కుచేలునివలె నటుకులు దెచ్చి మి
మ్మారగించుమంటినే
చలవ గంధము కుబ్జ వలె దేవర వక్ష
స్థలమున నలదితినే

విలసితముగ యా విదురునివలె మీకు
విందొనరించితినే
కులుకుచు నారదు వలె పారిజాత
కుసుమమర్పించితినే యేవగనైన ॥౪॥

పరికించి చూడ శబరి వలె మామిడి
పండ్లు గైకొమ్మంటినే
దరిలేక రావణు తమ్ముని వలె మిమ్ము
శరణువేడుకొంటినే
కరిరాజు వలె నీవే గతి యని పలుమారు
మొరలుబెట్టుకొంటినే
పరుల బాధలకై ద్రౌపదివలె హాకృష్ణ
పాహిపాహియంటినే యేవగనైన ॥౪॥

అతి బాలుడైనట్టి యల్ల ధృవుని వలె
వెదకుచు తిరిగితినే
మతిమంతుడగు హనుమంతుని వలె మమ్ము
సతతము గొలిచితినే
చెతురుడైన గుహుని గతి నావ దాటించి
చెయ్యెత్తి మ్రొక్కితినే
పతితపావనుడనుచు లోకములెల్ల
ప్రఖ్యాతి జేసితినే యేవగనైన ॥౪॥

### 162. గౌళిపంతు – చాపు

పల్లవి – నీకే సమ్మతి గాని యిటువంటి నడతలు
మా కెవ్వరికి సరిపోదయా

అను...తాకనాడిరని తప్పు లెంతురనీ వి
వేకానికి ముందు వేణుగోపాల ॥నీ కే॥

అబ్జముఖులు పదహారు వేలుండగ
కుబ్జను మరు కేళి గూడితివీ ॥నీ కే॥

మొలను పీతాంబరము చెలువొందుచుండగ
అలగోపికల చీర లందితివి ॥నీ కే॥

పాలకడలియందు పవ్వళించి యుండి
బాలుడై యు ల్లొగ(బాకితివి ॥నీ కే॥

తేజోరాశియైన దేవుడవై యుండి
రాజీగ నరుని సారధివైతివి ॥నీ కే॥

వాటమైన పరమ పదము వదలి కా
ర్వేటి నగరమున వెలసితివీ ॥నీ కే॥

## 163. పంతువరాళి - ఆది

పల్లవి - నీవారి నడతలన్నియు - నేనే మెరుగనా

అను...భావజజనక వేణుగో - పాలా నాతో దాచితేనే ॥నీ॥

తల్లి నిన్ను రోల గట్టె తండ్రి యావుల మేప బంపె
యిల్లాలు సడ్డసేయక - యిల్లిల్లు విహరించసాగే ॥నీ॥

అత్తగారు నరనాథుల - కందరికీ పొత్తులబాయ
ఉత్తముడా మీాయన్న నాగే - లెత్తుకొని తిరుగులాడె ॥నీ॥

కోడలందఱినోళ్ల నిలచె - కొడుకు తలగొట్లమా రాయె
నాడేని సోదరి యొకస న్యాసి నంటుకొనీ జరిగె ॥నీ॥

కూతురు పారుబోతాయ - నీతి నప్పి నడిచేను మరిది
భూతేశుడైన మీాబావ - చేత గాక బిచ్చమెత్తె ॥నీ॥

హింసకు వెరువని కాల - కంసుడు మేనమామ నీ
సంసార మిటువంటి దయ్యొ - స్వామి వేణుగోపాల ॥నీ॥

## 164. గౌళిపంతు - చాపు *

పల్లవి - పట్టవలె నయ్యా-గట్టిగ మనసు-పట్టవలె నయ్యా

పట్టవలె వేణుగోపాలు పదములు
కట్టవలెను వైకుంఠానికి మెట్లు
నెట్టవలెను సద్వృత్తితో దినములు
మెట్టవలె పుణ్యభూములు భక్తితో ॥ప॥

సేయవలెను గంగాజలములో స్నానము
తోయవలెను మదమోహమాత్సర్యము
వ్రాయవలెను హరికథలు గంటముబట్టి
కాయపలెను భాగవతుల సముఖము ॥ప॥

చూడవలెను సద్గతి దొరికే మార్గము
పాడవలెను శౌరి నామ సంకీర్తన
కూడవలెను సాధు సజ్జన సంగతి
నాడవలెను కృష్ణ గోవింద యనుకుంట ॥ప॥

---

* ఈ కీర్తనకు అనుపల్లవి పాతమయ్యెనని తోచెడి

చేరవలెను పలుమాఱు ముకుందుని
చేరవలెను శ్రీపతి నభయమిమ్మని
కోరవలెను యేవేళ మాధవు సేవ
నేరవలెను వాసుదేవుని మంత్రము ॥ప॥

## 165. భైరవి - ఆది

పల్లవి – భక్తితో పిలిచిపెట్టిన యన్నము
పట్టెడైన చాలు–చెవులకు

అను...రక్తిగా హితవైన పాట
పల్లవి విన్నా చాలు కృష్ణా ॥భ॥

భావము దెలిసిన నాయకు రాలితో
భాషించినచాలు– తెలిసిన
కోవిదులకు కరుణ నిచ్చు దానము
కొంచెమయిన చాలు కృష్ణా ॥భ॥

కులము వెలయ సత్కీర్తి వహించే
కొడుకొక్కడే చాలు–ప్రజలను
అలమట బెట్టక ఆర్జించిన ధన
మణుమాత్రమే చాలు కృష్ణా ॥భ॥

అచ్ఛిదలై తాత గట్టిన జాగా
అడిగెడైన చాలు యిది
గచ్చుగాదు సద్గురు వాక్యము లర
గడియ విన జాలు కృష్ణా ॥భ॥

వచ్చినప్పుడె యాచకునికి వకతృణ
మిచ్చినం జెచాలు - సతులకు
హెచ్చువలదు భర్త దైవమని భ్రా
హించిరైన చాలు కృష్ణా ॥భ॥

దురితము లణగేటందుకు దామో
దరుని భజన చాలు - మీదట
పరతత్వము దెలుపుటకు వేణుగో
పాలుడె చాలు కృష్ణా ॥భ॥

166 గౌళిపంతు - ఆది

పల్లవి—దాతను వాజులు జెరిపే దబ్బలి
తలమీదనె సొడ్డు — చెయ్యి
అను—ధాతువ దెలియని వైద్యము
జేసే — ధగిడి కొక సొడ్డు - గట్టిగ ॥దా॥

పనిలేకను పొరుగిండ్లకు తిరిగే
పణతికి వకసొడ్డు - చెప్పిన
మనవులు భూపతి కెరుగించని దు
ర్మంత్రికి వకసొడ్డు - గట్టిగ ॥దా॥

కలిగియుండి పొట్టకు దినజాలని
కఠినుని కొకసొడ్డు - తన
వెలదిని పరపురుషుల తార్చే మగ
వెధవకు వకసొడ్డు - గట్టిగ ॥దా॥

లంచము దిని పనులుచక్క సేయని
లండికి వకసొడ్డు - మాట

మించనాడి చైవెలకల వేసే
వంచకునికి సొడ్డు - గట్టిగ ॥దా॥

తనపద్యము విని బహుమతిసేయని
మనుజుని కొకసొడ్డు - పెద్దల
గనిదండము బెట్టక జుణిగే గణి
కాంగన కొకసొడ్డు - గట్టిగ ॥దా॥

మాపురే పన్నుచు నర్థుల ద్రిప్పే
మడియకు వకసొడ్డు - వేణు
గోపాలు భక్తుల దూషించే
కొంటెల కొక సొడ్డు - గట్టిగ ॥దా॥

## 167 పంతువరాళి - ఆది

పల్లవి - హరినామ స్మరణే సేయకుంటే
అవతలగతియేమి
అను - వెరవు దెలిసి సత్సంగతి వదలక
వేణుగోపాలుడై నశ్రీనర ॥హరి॥

అన్నదమ్ము లెడబాయక మునుపే
యాలు నిష్ఠురోక్తు లనక మునుపే
కన్నకొడుకు దండించక మునుపే
కాయము వ్యాధుల చివుకక మునుపే ॥హ॥

వృద్ధాప్యము ప్రాపించక మునుపే
వుత్సాహము బల ముడుగక మునుపే
నిర్ధనుడై దిగులు బడక మునుపే
నేత్రాలు పొరగప్పక మునుపే ॥హ॥

కన్నులానుకొని దిరుగక మునుపే
కంఠధ్వని తగ్గిపోక మునుపే
అన్ను ముందరికి వంగక మునుపే
అంగముతలవణుకెత్తక మునుపే ||హా||

దవడలు లోనికి బోవక మునుపే
దంత పటుత్వము తప్పక మునుపే
చెవులకు మందము దట్టక మునుపే
చెల్లబో నడవ జేరక మునుపే ||హా||

అప్పుల కాపులు కదియక మునుపే
అన్న మొకరు దినిపించక మునుపే
దొప్పలోన చై కడగక మునుపే
ధోవతి బరువై తోచక మునుపే ||హా||

## 168 పంతువరాళి - చాపు

పల్లవి — ఇంతకంటె చోద్యమిక వేరుయున్నదె
యెంత ఆశ్చర్య మయ్యా - చూడ
అను — వింతలు నీకథలు వినవిన వేడుకలు
కంతునిగన్న చక్కని వేణుగోపాల ||ఇం||

భృగురాముడై యల జగతికశ్యప మునికి
తెగువ నర్పించిన దేవుడవూ
మగటిమి చెడి బలిని మధుర భాషణముల
వగలేక ధర మూడడుగులు వేడినా వంటె ||ఇం||

అక్షయ వలువలు అల్ల ద్రౌపతి కిచ్చి
రక్షించినట్టి శ్రీరమా నాథుడా

కక్షీకట్టుక గోపకామినుల మైలలు
నిక్షేపమ్ముగ బట్టి వృక్షమెక్కి నావంటె ॥౩౦॥

శంకా టంకము లేక జలరాశి బంధించి
లంకేశు నణచిన రణధీరుడౌ
కంకపత్రము దొడిగి కాలయవనుడు దరుమ
బింకేలబొాయి కొండ బిలము జొచ్చినావంటె ॥౩౧॥

## 169 పంతువరాళి - త్రిపుట

పల్లవి - కదలి వచ్చెను జూడరే - వేణు
గోపాలుడు కనుల పండుగగాను

అను...పదిలుడై గరుడునిపై నెక్కి భక్తుల
ముదమంద జేయుచు ఇదిగో రాజమార్గమున ॥క॥

సురలు నుతింపగను వేదము లవనీ - సురులు పఠింపగను
ధరణీశు లతిభక్తి - తను సేవింపగాను
సరసీజాక్షులు నాట్య - సరణి నభినయింప గాను ॥క॥

పగలువత్తులు వెలుగగా - ఛత్రచామరలు
బాణవిద్యలు మెరయగా
మృగమద తిలకము - మోము కళ లూరగ
వగగా కీర్తన భాగ - వతులు పాడుచు రాగా ॥క॥

భేరి దుందుభులు మ్రోయ - వందిమాగధులు
చేరి హెచ్చరికె సేయా
వారణ హయములు వరుస గుంపులై డాయ
మీరి సంతోసమున మింట చందురుడు గాయ ॥క॥

## 170 పంతువరాళి - ఆది

పల్లవి - మంచివాడనుచు కీర్తి వహించే
మానవుడే ఘనుడు - ప్ర
అను - పంచమంత కొనియాడగ నీపద
భజన చే వేణుగోపాల ॥మం॥

తన కులాచారము బోవిడువక
తల్లిదండ్రిమాట నిగ్రహించక
మనసు తప్పుత్రోవల చొరనీయక
అనుదినంబు సత్సంగతి వదలక ॥మం॥

అప్పుతీసుకొని సొమ్మెగనాడక
ఆ ప్తజనులతో నన్నృతము లాడక
తప్పుసాక్షి బలికి యాఖ్య జెందక
ధర్మకార్యములు విఘ్నము సేయక ॥మం॥

ఆసజెప్పి చె వెలికిల వేయక
అన్యాయము చేసి తగవు దీర్చక
భూసురోత్తములతో వాదించక
మోసగాండ్ల గూడి చెలిమిసేయక ॥మం॥

అర్థులతో కఠినోక్తులాడక
నాడబిడ్డలను యుసు రనిపించక
వ్యర్థముగా ప్రొద్దులు పోగొట్టక
వాలాయము సతిని తప్పు లెంచక ॥మం॥

పరులమేలు జూచి లోన గుందక
బంధుకోటి మెచ్చని పనిబూనక

ధరణీశ్వరు కరుణ నమ్మి పొంగక
దాయాదుల క్రూరదృష్టి జూడక ॥మం॥

## 171 భైరవి - త్రిపుట

పల్లవి - నీపాదపద్మముల నిలిపేనంటే మనసు
నిముషము నిలువదయ్యా
అను... పాపకృత్యముల కే పరుగిడుచున్నది
నాపాలిశ్రీ వేణుగోపాల నిజముగ ॥నీ॥

నరహరి నీనామస్మరణంబె కనరయ్యా
పరమభక్తుల చెలిమి సరిపోదయ్యా
మురవైరి నీమూర్తి దరిశింపనీదయ్యా
గరుడగమన న న్నేగతి కడతేర్చేవో ॥నీ॥

కామక్రోధములు గర్వమ ధనమాయె
తామస మింతైన తరగదాయె
పామర మిప్పటికి పట్టువీడ దాయె
సామజవరద యేచందాన బ్రోచేవో ॥నా॥

వనజాక్షులమీాది వాంఛ వదలదాయె
తనువు లస్థిరమని దలచదాయె
జననమెత్తిన మొదలు మనుజుల సేవాయె
పనిబూని నన్ను నేపగిది రక్షించేవో ॥నా॥

## 172 గౌళిపంతు - త్రిపుట

పల్లవి - ఎంత పేదవాడే - వేణుగోపాలు
డెంత పేదవాడే

అను...అంత పేద గాకుంటె - అలనాడా కుచేలుని
అటుకులకు చేసాచునా - ఓచెలులార ॥ఎం॥

పండమంచమె యుంటె భావజనకు డీ
పాముపై నిద్రించునా
అండ వేరే యుంటె అచ్యుతుడా దనుజాని
అవని దాన మడుగునా
వుండ నిల్లే వుంటే పుండరీకాక్షుడు
యుదధి వాసము జేసునా ఓచెలులార ॥ఎం॥

కట్టవస్త్రమె యుంటె కంసవైరి గో - పాం
గన చీర లాశించునా
గొట్టు బడక యుంటె గోవిందు డీగతి
గోవుల తా గాచునా
పొట్టనిండితె శౌరి పొరుగిండ్ల జొరబడి
పొంచి వెన్న ముచ్చిలునా ఓచెలులార ॥ఎం॥

పరిపాటి వాహనమిా ప్రద్యుమ్ననికే వుంటె
పక్షి నెక్కి తిరుగునా
దరి వేరేవుంటే శ్రీధరు డనిశము నిజ -
దాసుల పంచ జేరునా
గురియైన సాయకమిా మురవైరికేయుంటె
గరికె పోచ బట్టునా ఓచెలులార ॥ఎం॥

## 173 కాంభోజి - ఆది

పల్లవి - పాపాత్ముని ధర్మాధికారిగా
బంపే దొాక రోత - ॥పా॥
అను ..కోపముజేసే నరనాథుకొలువు
గొలిచేదొాక రోతా - ఛీ ఛీ

వలసిన భాగ్యము లుండి భుజించని
వాని కలిమి రోత - యింట్లో
కులకాంతలు వుస్సురనగ వేశ్యల
గూడే దొకరోతా - ఛీఛీ ॥పా॥

జారస్త్రీ గర్భంబున సుతుడై
జనియించుట రోత - ధరలో
వారక యాచకవృత్తిని దిరిగే
వాని బ్రతుకు రోతా - ఛీఛీ ॥పా॥

పుట్టినింట ననవరతము భార్యను
బెట్టే దొక రోత - వగజెడి
పట్టెడు కూటికి చుట్టాల కడప
మెట్టే దొక రోతా - ఛీఛీ ॥పా॥

హీనుని పంచ మహాత్ములు గాచుట
యెంత తగని రోత - తన
మానిని వద్దికి నన్యపురుషులను
మాట్లాడుట రోతా - ఛీఛీ ॥పా॥

తాపసియై యరిషడ్వర్గంబుల
తగిలే దొక రోత - వేణు
గోపాలు పదములు నమ్మియుం
గోపి యగుట రోతా - ఛీఛీ ॥పా॥

### 174 సౌరాష్ట్ర - ఆది

పల్లవి - హరి నారాయణ గోవిందాయని
స్మరణ సేయవే వోమనసా

అను...పురుషోత్తమ దామోదర కేశవ
భోగిశయన వేణుగోపాల ॥హ॥

ధర్మమందు నిశ్చల మతి నుంచి
దయయు శాంత సత్యమున నటించి
నిర్మల జ్ఞాన మార్గ క్రమించి
కర్మఫలము రామున కర్పించి ॥హ॥

పరమ భాగవతుల సేవించి
భక్తి మార్గమున ప్రవర్తించి
అరిషడ్వర్గముల మొదలుద్రుంచి
అంతటను విష్ణు వని తలంచి ॥హ॥

ఇతరచింత లన్నియు తొలగించి
యిహసుఖంబు తుచ్ఛమని త్యజించి
ధృతిపీడక శౌరిని ధ్యానించి
దుష్టనరుల సంగతి వదలించి ॥హ॥

## 175 ఆనందభైరవి - ఆది

పల్లవి - ధర్మకార్యముల కడ్డము బలికే
దబ్బిలి దొక బ్రతుకా - శుద్ధ
అను...నిర్మలాత్మకుల మదినొప్పించే
నీచుల దొక బ్రతుకా - హరిహరి ॥ధ॥

మగనికి వంచన జేసి భుజించే
మానిని దొక బ్రతుకా నభలో
తగవారిని లంచముగొని మొరిగే
ధగిడీ దొక బ్రతుకా - హరిహరి ॥ధ॥

తనపతి సంపాదన కాసించే
మనుజుని దొక బ్రతుకా - గురువుల
మనమున దలచుచు పూజింపని యు
న్మత్తుని దొక బ్రతుకా - హరిహరి ॥ధ॥

న్యాయరీతిగా ధనమార్జింపని
నరపతి దొక బ్రతుకా - కలిగే
హాయిగ తాదిని యొకరికి బెట్టని
యధముని దొక బ్రతుకా - హరిహరి ॥ధ॥

తలిదండ్రుల బుద్ధుల విననొల్లని
తనయుని దొక బ్రతుకా — ఒక్కరి
బలిమి కలిమి జూడగ సైచని ని
ర్భాగ్యుని దొక బ్రతుకా - హరిహరి ॥ధ॥

తాపత్రయముల నంటించుకొనే
తపసిది యొక బ్రతుకా - వేణు
గోపాలుని భక్తుల దూషించే
కొంటెల దొక బ్రతుకా - హరిహరి ॥ధ॥

## 176 కల్యాణి - ఆది

పల్లవి — నిన్ను గొల్చి యొరుల వేడబోయితే
నీకపకీర్తి గాదా
అను... పన్నగవైరివాహ వేణుగో
పాలరాయ యాపన్న సహాయ ॥ని॥

ఎంచితీ యిష్టదైవమని భా
వించితీ ప్రణమిల్లి భక్తిగా
వించితీ త్వన్నామ మంత్రము జ
పించితీ పూజించితీ

పొంచితీ ప్రాపుదొరుకుట కనుస
రించితీ రక్షింతువనుచు నా
సించితీ దాసదాసులను వ
ర్తించితీ మిగులసంతసించితీ ॥ని॥

దేవరా మునుల కీప్సితార్థము
లీవరా అలద్రౌపతి మానము ...
గావరా గజరాజును సత్కృప
బ్రోవరా లక్ష్మీశ్వరా

సేవ రాజిల సేయగాను వర
మీవరా ధీవరా యనుచు సం
జీవరాయని బ్రహ్మగాను బహు
తీవరాన దేవరాజ వందిత ॥ని॥

చేరితీ శుభము లిమ్మనుచు చల
పోరితీ భూపతుల బొగడిగో
జారితీ అజ్ఞానుడనై బహు
దూరితీ వేసారితీ

కోరితీ హరికథ వీనులవిన
మీరితీ దుష్టనరుల సంగతి
దారితీ మాయదెలియుటకు మిము
జీరితీ భారతీశ నుతపద

## 177 గౌళిపంతు-చాపు

పల్లవి - నన్ను నీవిక నెడబాయకా నెర
నమ్మితి రా జగన్నాయకా
అను...కన్నతండ్రి వేరుసేయకా పాద
కంజములను మరువనీయకా ॥నన్ను॥

నరులసేవ సేయలేనయ్యా పద్మ
నాభ దండాలుబెట్టేనయ్యా
కరుణయెంచుక చూడ వేమయ్యా - యింత
కఠిన చిత్తము కారాదయ్యా ॥న॥

పాపాత్ముడని మది నెంచకా - చే
పట్టవయ్యా నిరసించకా
మాపురేపని జరిపించకా — నీ
మాయ వలల తగిలించకా ॥న॥

వేణుగోపాల విన్నావుగా - కా
ర్వేటినగరాన నున్నావుగా
ప్రాణికోటికి దిక్కు నీవేగా - పా
వన బిరు దందినావుగా ॥న

## 178 ధన్యాసి - చాపు

పల్లవి - నిన్ను నే విడువాను నీపేరు మరువను
నీ బంటుబంటైనాను
అప...అన్న యెన్నటికి ప్రసన్నుడవౌదువో
వెన్న ముచ్చిలి దిన్న వేణుగోపాలా ॥ని॥

నలుగురు బంధువులు దలచక యున్నను - నరనాథు డలగినాను
కులసతి మెండొడ్డు - కొని పలుకకున్నను
చెలికాండ్లు బుద్ధులు చెప్పవచ్చినాను ॥ని॥

పాపాత్ము డనుచు కృ - పా రహితుడైనాను
భాషించ కుండినను
కోపగించి లక్ష - కోదవ లెంచినాను
మాపు రేపనుచు యే - మరి యూర కున్నాను ॥ని॥

కామక్రోధాదు లె - క్కుడ వదలకున్నాను స్వాములు దూరిన నూ
లేమి వచ్చి యొకరు - లెక్క సేయ కున్నాను
ప్రేమ మరచి సుతులు - యేమరి యున్నాను ॥ని॥

## 179 గౌళిపంతు-ఆది

పల్లవి - భక్తిలేని పూజ లేమిటికి ప్రతిదొరక గానే
భక్తిలేని పూజ లేమిటికి
అను భక్తిలేని పూజ లేమిటికి
భాషించని మగడు డేమిటికి దుం
రక్తి ప్పాడని పద మేమిటికి గ/ని
రహిని వేణుగోపాలుని పాద ॥భ॥

జీతము ముట్టని కొలు వేమిటికి
చిలుక లేని పంజర మేమిటికి
దాతలు దొరకని యూ రేమిటికి
దైవము చేరని గుడి యేమిటికి ॥భ॥

ఆకలి గాని కూ డేమిటికి
అర్థము దెలియని చదు వేమిటికి
మూకలు గూర్చని దొర యేమిటికి
ముసలి రండలకు సొగ సేమిటికి ॥భ॥

మాట విననిు తనయుం డేమిటికి
మదిరా నడువని సతి యేమిటికి
చోటు చాలని యి ల్లేమిటికి
పొద్దు బెట్టు చుట్టా లేమిటికి ॥భ॥

అక్కర కొదగని సఖు డేమిటికి
ఆశలేని పుట్టి ల్లేమిటికి
సాక్కి సోలని వల పేమిటికి
సోమరి లంజల పొం దేమిటికి ॥భ॥

మ్రాళి చెవికి బావిలి యేమిటికి
ముక్కుడి తొత్తుకు నత్తేమిటికి
వేలతలకు కురువే రేమిటికి
పిరికి బంటు కాయుధ మేమిటికి ॥భ॥

## 180 గౌళిపంతు - ఆది

పల్లవి - పోరాని తావులకు పోరాదు - బుద్ధిమంతులైతే
పోరాని తావులకు పోరాదు ॥

అను - పోరాని తావులకు పోతే నీలాపనిందలు వచ్చు
వేరే యవమానము పని లేదు-వేణుగోపాలుని సాక్షిగ ॥పో॥

పగవానింట కుడువగ రాదు
బలవంతుల కెడ మియ్యగ రాదు
మగువల యాలోచన వినరాదు
మానఘనుల పోనాడగ రాదు ॥పో॥

అప్పులు మెండుగ సేయగ రాదు
ఆవల పండ్లిగిలించగ రాదు

మెప్పులు వకరికి దోపరాదు
మెచ్చని నడతలు నడవరాదు ॥పో॥

చేతగాని పని పట్టరాదు
చేసిన మేలు చెప్పరాదు
ఘాతకాని కొడిగట్టరాదు
కాయము సతమని నమ్మరాదు ॥పో॥

కలిమి గలిగెనని త్రుళ్ళరాదు
గాసి వచ్చెనని వగవరాదు
వలవని వాదుకు బిలువరాదు
వంచనగా వడ్డించరాదు ॥పో॥

పేదల కాస జెప్పరాదు
పెద్దల మది నొప్పించరాదు
బీదల హాస్యము సలుపరాదు
బిచ్చానికి అడ్డము పోరాదు ॥పో॥

## 181 ధన్యాసి - చాపు

పల్లవి - మనసా చపలము మానవా యీ
అను...తనువు నిత్యము గాదని యెంతచెప్పిన ॥మ॥

చయ్యన సుకృతము సంగ్రహించ లేక
అయ్యయ్యో మితిమీరి పొయ్యేవారిని జూచి ॥మ॥
మూడుదినంబుల ముచ్చటకై అనృత
మాడవలదనుచు వేడుకొన్నగాని ॥మ॥

పరకాంతల పొందు నరక హేతువని
పరిపరి విధముల మొరలు బెట్టినగాని ॥మ॥

ధర్మ చింత విడిచి దయ దాక్షిణ్యము లేక
దుర్మార్గ వృత్తినీదుట కోరగా దండే ॥మ॥

పనిబూని వేణుగో - పాల దేవుని పాద
వనజములకు నిన్ను - పెనవేయక గాని ॥మ॥

## 182 గౌళిపంతు - ఆది

పల్లవి - అన్నిటి కిది సులభ మార్గము సుమీ
హరి నామ స్మరణా
అను ..పన్నగశయనుడైన వేణుగో
పాలుని సన్నిధికి జేరేటందుకు ॥అ॥

చన్నీళ్లల్లో మునుగుట కంటె
చలిలో జపము జేసుటకంటె
మిన్ను జూచి ధ్యానించుటకంటె
మిగులజన్నములు సలుపుటకంటె ॥అ॥

వేదశాస్త్రములు చదువుటకంటె
అతివీరుడై యనిని ద్రెళ్లుటకంటె
భేదవాదముల పోరలుట కంటె
పెక్కు వ్రతముల సుక్కుటకంటె ॥అ॥

దివ్యదేశముల దిరుగుటకంటె
తీర్థయాత్రలు పోవుటకంటె
ద్రవ్యదానము లిచ్చుటకంటె
తాపసినై గుహాలు జేరుటకంటె ॥అ॥

## 183 మధ్యమావతి - ఆది

పల్లవి - భక్తి లేని వ్రతము లెన్ని జేసిన ఫలము లేదు సుమ్మీ మవి
అను...రక్తులమని వేసాలు ధరించుక
రహించి వేణుగోపాలుని పాద ॥భ॥

జడలు వెనక జీరాడిన నేమి
జాహ్నవి లోపల మునిగిన నేమి
కడుపు గట్టి నటియించిన నేమి
కాళ్ళ పాదుకలు మెట్టిన నేమి ॥భ॥

కావివస్త్రములు గట్టిన నేమి
కండ్లు మూసుకొని గొణిగిన నేమి
లావుగ తిరుమణి మెత్తిన నేమి
లక్ష తులసి నర్చించిన నేమి ॥భ॥

మేనినిండ భస్మ మలదిన నేమి
మెడల రుద్రాక్షలు పూనిన నేమి
నానాభూముల తిరిగిన నేమి
నదులు నిధులు గనుగొంటే నేమి ॥భ॥

## 184 అసావేరి - త్రిపుట

పల్లవి - నీదివ్య మంగళ మూర్తి ధ్యానము భక్తి
నిత్యము కృప సేయవే
అను...వేదోద్ధారకుడైన వేణుగోపాలుని
పాదద్వంద్వము నాహృత్పద్మమందున జేర్చి ॥నీ॥

పుట్టినది మొదలుగ భూపాలకుల గొలిచి పట్టెడన్నానికై పరుగులెత్తి
పొట్టనించుక మతిలో పొంగుచుంటిని గానీ
పట్టుగ నొకనాడు ప్రద్యుమ్న యననైతి ॥సీ॥

నరక హేతువులైన దురిత కృత్యములకున్
మరగి కండ్ల కావరమున
పరకాంతల మోము లరసి భ్రమసితి గానీ
పురుషోత్తమ నీపై బుద్ధినిలుపనైతిని ॥సీ॥

పరమ భాగవతుల ప్రల్లదములు బల్కి
గురువుల నిందించి కుటిలుడనై
అరయక తలిదండ్రు లాజ్ఞ మీరితి గాని
స్థిరచిత్తమున హరిని స్మరణ సేయనైతి ॥సీ॥

అపకారములకు నే నగ్రగణ్యుడనై
యుపకృతి మా టంటె నుగ్రుడ నగుచు
అపకీర్తులకు నే నర్హుడైతి గానీ
కపటవామన నీదుకథ చెవుల విననైతి ॥సీ॥

యతుల దూషణ చేసి యెదటి మేలోర్వక
కృతులు మానవుల కర్పితము జేసి
గతవాసరము లీగతిదాటించితి గానీ
పతిత పావన సద్గతి జూపు మననైతి ॥సీ॥

## 185 గౌళిపంతు - ఆది

పల్లవి — ఇట్టి పనులు సేతురా యెట్టి వారైన — యేమి యెరుగ
అను...నట్టు లున్నావు కార్వేటి నగర వేణుగోపాల ॥ఇ॥

అచ్యుతుడనుచు చాలా – వార్షించితి గాని వెన్న
ముచ్చిలించే దెరిగితే నేనీ – మోము జూతునా ॥ఇ॥

నారాయణు డనుచు నిన్ను – సారెకు వేడితిగాని
చీరెలు దోచిం దెరిగితే – చేర నిత్తునా ॥ఇ॥

భావజ జనకుడంచు – ప్రణమిల్లితిగాని వ్రూరి
యావుల మేపిం దెరిగితే – సేవ జేతునా ॥ఇ॥

వారిజనాభుం డనుచు – వర మిమ్మంటి గాని నరుని
సారథివైన దెరిగితే సడ్డ సేతునా ॥ఇ॥

పీతాంబరధరు డనుచు పిలిచితి గాని పాండవ
దూతి వని దెలిసితే యిల్లు దూరనిత్తునా ॥ఇ॥

## 186 గౌళిపంతు - ఏక

పల్లవి - హరిదాసులను పాపా
లంటవు సుమీ – మదిలో నర
అను.. కొర తెందు కిక వేణుగోపాలుడైన నర ॥హ॥

ఏదో పొమ్మని నవ్వి యెగతాళి జేసేది
గాదు బూడిదలోన – గచ్చకాయ పగిది ॥హ॥

పరికించి చూడ నబ్బురమా బురదమట్టి
దిరుగుచు నుండు కుమ్మరపురుగు చందాన ॥హ॥

తజబిజి సేయక దైవము సాక్షిగ
నిజము తామర పాకు – నీట ముంచి యెత్తినట్లు ॥హ॥

వింతగ జూచేవు — యింతే దీని కీలు
చింత బుఱ్ఱలో పండు - చేరి వొదిగినట్లు ||హా||

అంతరంగమున నీ — కనుమాన మేల వ
నాంతరమున నుండె తంతు కీటము భంగి ||హా||

## 187 యదుకులకాంబోజి - ఆది

పల్లవి — జలజాక్షుని చింతించని మానవ
జన్మ వ్యర్థము
అను...విలసిల్లు కార్వేటినగర
వేణుగోపాలకృష్ణా యని ||జల||

ఉపకారము దలచని కఠినాత్ముడు
వుండి వ్యర్థము మదిలో
చపలము విడువక వ్రతములు తపములు
జేసుట వ్యర్థము నిజముగ ||జ||

తలిదండ్రుల పోషించని కొడుకులు
గలిగీ వ్యర్థము రిక్తుడు
బలవంతుల నెదిరించి ప్రతిజ్ఞలు
బలుకుట వ్యర్థము నిజముగ ||జ||

సమరభూమి జొరని పిరికిబంటు
సాధన వ్యర్థము దశవిధ
గమకములతో వాయించని వీణా
గానము వ్యర్థము నిజముగ ||జ||

సరసులు విని శాబాసని మెచ్చని
చదువు వ్యర్థము షండుడు
వరుడై రతిసుఖ మెరుగని సతి
యౌవనము వ్యర్థము నిజముగ ||జ||

దానధర్మము సేయక దాచే
ధనము వ్యర్థము యేండ్లు
శానా చెల్లిన వృద్ధుకు పెండ్లి
జేసుట వ్యర్థము నిజముగ ||జ||

## 188 ధన్యాసి - చాపు

పల్లవి — హరి తానే వున్నా డన్నిటికీ — యే
అను... వెరపులేదిక మాకు — వేణుగోపాలుడౌ ||హ||

వేడుచు కుజనుల వెంట దిరిగితే నేమి
నాడు వ్రాసిన వాడు నేడువేరే వ్రాసున ||హ||

పట్టెడన్నానికై - పరితాప మెందుకు
పుట్టించిన వాడు — పూరి మేపున నర ||హ||

అదయు లోకుల్కరి భ్రమ — ఆశ్చేర తీర్చేర
మొదట బుట్టిన చావు — తుదనెందు గల్గున ||హ||

ఒరిగినంతే చాలు — నొక లక్ష త్రుణమైన
పదిలముగ ధృవరాజ్య పట్టమేలగవలెనా ||హ||

జంటబాయక ప్రభువు నంటి తిరిగిన రాదు
కొంచే రాసిసొమ్ము కొసరితే వచ్చున ||హ||

## 189 ధన్యాసి - ఆది

పల్లవి - అద్దెకొంప వంటిది యీ దేహ
మనిత్యమే మనసా
అను...మిద్దెమీది పరుగులు రెణ్ణాళ్లు సు
మీ వేణుగోపాలుని సాక్షిగ ||అ||

బండెగొడ్లవంటిది సంసారము
భ్రమయకే మనసా
యెవరున్న నడమంత్రమె జీవుని
కెవరులేరు మనసా ముమ్మాటికి ||అ||

పువ్వువంటిది యౌవనమనగా
పొంగకే మనసా
నవ్వుగాదు సిరులు మెరుపు వంటివి
నమ్మకే మనసా ముమ్మాటికి ||అ||

పతితపావనుని పదపంకజములు
పట్టవే మనసా
మదిని వేణుగోపాలుని మంత్రము
మరువకే మనసా ముమ్మాటికి ||అ||

## 190 పంతువరాళి - ఆది

పల్లవి - గుత్త లంజలను మరిగిన వారికి
దుత్తే కడపటను వరాల
అను...తిత్తి వుత్తదైన వెనక బోతే
బెత్తెమె వేణుగోపాల ||గు||

కావలసిం దిచ్చే దినముల
కాళ్ళు రెండు కనుల నొత్తు కొందురు
యీవు లడిగి యిలుదూరితె గౌరీ
దేవి వాయనము దవ్వుకొందురు ॥గు॥

బేరసారము లుడిగి బికారై
బిక్కికాయ దిన్న కోతి వలెబోయి
కారుబారు సేయవచ్చెనా శృం
గారకట్ట దెమ్మని దిగతీతురు ॥గు॥

కడకుబోయిన మూడు దినములైనా
యడముగా పవళించక గూడి
విడువలేక వొదిగిళ్ల బారితె
మెడ అర్ధచంద్రుని నియమింతురు ॥గు॥

## 191 పంతువరాళి - చాపు

పల్లవి - కడుపా నీవింత ఘనమైతివా యే
అను...కడ గురుతు లేదాయె కల కాలమునందు ॥క॥

పాతకాలు జేసేది ప్రజల బాధించేది
నీతి యేట కలిపేది నిష్ట మానేది
జాతకాలు వ్రాసేది జలధిలో మునిగేది
కోతి నాడించేది నీ కొరకే గదవే ॥క॥

పేటలు గట్టేది బేరము లాడేది
మూటలు మోసేది ముచ్చిలించేది

పాటలు పాడేది పయిరుపచ్చ జేసేది
కోటివిద్యలు నీ కొరకే గదవే ||క||

ఎలిక బొక్కలు ద్రవ్వి యెన్ను వ్రేళ్లదీసేది
శిలలు ఛేదించేది శివమాడేది
పులుల బట్టుకొని పురములు దిరిగేది
కొలువు గొలిచేది నీ కొరకే గదవే ||క||

యేవేళ ధనికుల యిండ్లచుట్టు దిరిగేది
నావ దాటించేది నవ్వించేది
తావు విడిచి దేశాంతరమున నుండేది
గోవుల గాచేది నీ కొఱకే గదవే ||క||

ధారుణి యేలేది దండు దాళ్లు దిరిగేది
వారిజాక్షుల విటుల వలపించేది
భారకుడౌ వేణుగోపాలుని దూరేది
గోరిముష్టెత్తేది నీ కొరకేగదవే ||క||

## 192 గౌళిపంతు - ఆది

పల్లవి - పాపాత్ముల కెక్కుడి దీ కాలము
పారమార్థికము వేణు
అను.. గోపాలా దోవగాన్ని దొంగలు
గొట్టరా సన్యాసులనైన ||పా||

కులకాంతల వ్రతము భంగము జేతురు
బలిపీఠము గొట్టేమని లేతురు
పిలువనంపి నెత్తిన పదివేతురు
పులి దాసర్లకు బెట్టిన కథగా ||పా||

శంకించక పనులు వరగ దోతురు
శంబర మాయలు కల్పన జేతురు
జంకక లంచానికి చైసాతురు
రంకుమగడు కడుపునొప్పి జూచున ॥పా॥

పెద్దల సొమ్ముపహరింప జూతురు
సద్దులేక నడిగితె తలయూతురు
రద్దిజేసి రచ్చలోకి దీతురు
యెద్దు పుండు కాకికి ముద్దౌనా ॥పా॥

తప్పులోని దండగ దెమ్మందురు
తమ ప్రజ్ఞలు తామె పొగడు కొందురు
అప్పటముగ సొట్లు వెతకు చుందురు
కుప్పలు కాలిచి పేలాలుతినే ॥పా॥

ఇరుగు పొరుగు వారిని వేధింతురు
యెగరవేసి మాట్లాడి జయింతురు
వురగమువలె నేపగ సాధింతురు
గురువుకు పంగనామము బెట్టే ॥పా॥

పోటిజేసి యొకరి కూడు దీతురు
పొంచులుండి విని జాబులు వ్రాతురు
పీటమీద పెండ్లి నొరగ దోతురు
మోటుగాలి కెందైనా వెరచున ॥పా॥

కన్నతల్లి యనుచు జేరవత్తురు
కల్ల పసిడి జూపి హేసమెత్తురు

చిన్న చిన్న పనులకు లోజొత్తురు
తిన్న యింటికే రెండు దలంచె ॥పా॥

మగనికి పెండ్లానికి పగజేతురు
తగులుకొంటి రని కేకలు వేతురు
తగవు దీర్చుకొమ్మని వెలి దోతురు
యిగురు బొడిచి నెత్తురు ద్రావెడి ॥పా॥

వండి వండి తోడితె కబళింతురు
వచ్చి వచ్చి వాసాలే యెంతురు
పుండువలెనే ప్రజలను బాధింతురు
యెండిన నోటికి నీళ్లు లేవనే ॥పా॥

పిలువని విందుకు బిరబిర లేతురు
బిచ్చగాండ్ల తరిమి తలుపు మూతురు
చలువపాగాజుట్టి చికిలి జేతురు
చలిపందిరి కుండల బగలగొట్టె ॥పా॥

కుటిలభావ మొకనాటికి మానరు
కుంభీ పాకమున బడుట గానరు
యెటుజూచిన సత్క్రియలకు బూనరు
యిటు రమ్మంటే యిల్లు జేకొనే ॥పా॥

వాసిదెలిసి విహితము నడిపించరు
డాసి వేడుకొన్నా మన్నించరు
చేసిన మేలొక్కటి మది నెంచరు
కోసిన వేలికి సున్నము బెట్టని ॥పా॥

ఒట్టుబెట్టుకొని మోసము జేతురు
వంచనచే కొంప ముంప జూతురు
జుట్టు చేత చిక్కె ననుచు యేతురు
నట్టేటికి దీసి పుట్టి ముంచె ॥పా॥

చిట్టెలు గట్టుక యోచన సేతురు
పట్టిన పని సాధింపనె జూతురు
గుట్టు బైటవేసి సిగ్గుదీతురు
చెట్టుకెక్కమని నిచ్చెన దీసే ॥పా॥

సుడిగాటికి పన్ను దీసు కొందురు
గుడిమేర రాశి నిలుపమందురు
తడయక బ్రాహ్మణుల బోరుచుందురు
తడిబట్టలతో గొంతులు గోసే ॥పా॥

రట్టుబడితి మని మదిలో దట్టదు
రవలేశము దాక్షిణ్యము బుట్టదు
చుట్టుపట్టు నొకరి మేలు గిట్టదు
పుట్టిన బుద్ధులు పుడకల తోసరి ॥పా॥

## 193 సౌరాష్ట్ర - చాపు

పల్లవి - అక్షయపాత్రకు పోతే కదలనివొక
భిక్ష వేయ రయ్యా ! - మూల
అను...నిక్షేపము త్రవ్వి నెత్తిని బెట్టెదరా
కుక్షింభరులు వేణుగోపాలస్వామి ॥అ॥

తెచ్చుకోవలెనని కొందరు రాలే
తేబోనా రంటుకొందరు ఒట్టి
గచ్చులకై నాను కడకుబోయినానని
ముచ్చవలెనె తలుపుమూలకు వొదిగేరు ||అ||

లేవ పాలుమాలి కొందరు లోన
దేవర వుందని కొందరు నడవ
దోవ కడ్డమై యెట్టి దోసిలి మునుచుక
నీవొల్లోని గింజలేవి సూపమినేరు ||అ||

తెల్లవారలేదంట కొందరు యిదిమా
యిల్లుగాదనే వారుకొందరు అయ్యో
మళ్ళిరమ్మని తడికె మరుగు బెట్టుకొని,
గిల్లి విదళించరు గీపెట్టినగాని ||అ||

నిండుకొన్నదని కొందరు అరువు
నీ యబ్బతోడని కొందరు వైెంద
పిండిసరాలె శి త్తయండలో నిలబడి
వుండొద్దు మాయేపి పుదురు మిడుకనేరు ||అ||

వాపొద్దు వద్దని కొందరు సూతాం
తీసపొయ్యేదని కొందరు యీా
దాసరోల్ల వల్చతరమా కాపిరెంసేయ
యిసుల్లపుట్టేనోనై యిరబడిందనె రహహ ||అ ||

చెయ్యి తీరదని కొందరు నేడు
వెయ్యనే రాదని కొందరు బిగ్గ

కుయ్యావద్దు నోరుముయ్యనుచు రాగ
గయ్యాళి బైటికి గదిమిపొమ్మనె కృష్ణా ॥అ॥

పెద్దలు లేరని కొందరు నేడు
తద్దిన మనేవారు కొందరు నిలువు
టద్దములో కొప్పుదిద్ది చూడనె గాని
కద్దులేదనరు యీ కలికాల మహిమేమో ॥అ॥

మించింది వేళని కొందరు వద్దు
మీకు బెట్టాదనికొందరు ఆబెడె
సంచినిండవచ్చె సైరాసైయని అనుచూ
నించి రేపురమ్మనే వింతయిదియేమో ॥అ॥

పూజవేళయని కొందరు యేమి
పూడ్చిపెట్టావని కొందరు సరినె
గాజడాళ్ళు బిచ్చగాళ్లకీ యితమాయ
గోజారకేశింది కొంపొమ్మనే రకటా ॥అ॥

ఈప్రొద్దు పొమ్మని కొందరు కాని
యింకోనాడైనాని కొందరు యిట్టి
పాపాత్ముల యముడు పట్టి కట్టకమునుపే
కాపాడే దేలా గోపాల నాస్వామి ॥అ॥

## 194 శంకరాభరణం - ఆది

పల్లవి - ఉంఛవృత్తితో బ్రతికేవారికి
వుగ్రము కారాదు
అను...పంచసాయకుగన్న వేణుగో
పాలదేవ యెందున వగలేక ॥ఉం॥

అమ్మా! అక్కా! అయ్యా! యనవలె
పొమ్మంటే తలవంచుక పోవలె
రొమ్మున తంబుర మీటుచు బాడుచు
రోసము పడక యిల్లిల్లు దిరుగవలె ||ఉం||

ప్రొద్దెక్కక మునుపే రారాదు
పొంచులు విని బైట చెప్పరాదు
హద్దు మీరి లోనికి పోరాదు
ఆణంగుల జూచి నవ్వరాదు ||ఉం||

వెంటనొకని బిలుచుక రారాదు
వేయకుంటె హాటము సేయరాదు
కొంటెలతో వాదుకు పోరాదు
కోరనికోరికెలు కోరరాదు ||ఉం

కొంచమనుచు గోజాడగ రాదు
కొట్లాడేచోట నిలువరాదు
సంచిజూచుకొని యెదబడరాదు
చాలదనుచు తిరుగ రారాదు ||ఉం||

చెయ్యాడుడుకు సాహసము కారాదు
చేత తలుపుతట్టి పిలువరాదు
బియ్యమమ్మేది తెలియరాదు
భీష్మకరించుక పోరాదు ||ఉం||

ఇచ్చిపెట్టినది దొరికిం దనవలె
యిప్పటికిది పదిలక్షలన వలె

తెచ్చినందులో ముష్టివేయవలె
దేవుడే రక్షకు డనుకోవలె ॥ఉం॥

## 195 భైరవి - ఝంపె

శ్రీరమారమణీ మనోహర
చిరకృపాన్వయ భూషణా
నారదాది మునీంద్ర వందిత
నవ్యమణి గణభూషణా
శారదాభ్రశరీర దానవ
జనమదాంబుధి శోషణా
భారతాన్వయ పాల వేణుగో
పాల దీనజనావనా

కాంత నిన్నెడబాసి దినమొక
కల్పకముగ భావించురా
చింతచే పవళించురా చై
చెక్కిటను గీలించురా !
కంతుబారి చెలించురా నిను
కౌగలించగ నెంచురా
పంతమేలర రార వేణుగో
పాల దీనజనావనా !

వెలది గంధము విరులటన్నను
వెగటుగా తిలకించురా
కలికి చిలుకల పలుకులకు మది
దలకి యులికి భ్రమించురా

పలుకరించిన చెలులతో ప్రతి
భాష లుడిగి తపించురా
పలుకరా చలమేల వేణుగో
పాల దీనజనావనా !

చిన్నపాయము నాడుచేసిన
చెలిమి దలచక యుందురా !
కన్నె బంపిన పూలబంతులు
కానుకలు వలదందురా !
విన్నపము వినవైతి విక మా
వెలదితో నేమందురా !
పన్నగాధిపశయన వేణుగో
పాల దీనజనావనా !

పక్కజేర్చుక నాడొసంగిన
బాసలవి యేమాయెరా
నిక్కముగ పరికించిచూచిన
నీది రావణ మాయరా
యెక్కువైన విలాసవతిపై
యేల యిటు కనరాయెరా
పక్కిజక్కినిరెక్క వేణుగో
పాల దీనజనావనా

రాకయిటుల పరాకుజేసి ని
రాకరించుట న్యాయమా
యీ కరణి సాధింపగా నీ
కేమయిన నాదాయమా

మా కలికి నీపొందు సేయక
మానియుండే పాయమా
పాకశాసనవినుత వేణుగో
పాల దీనజనావనా

సాటిబోటులలోన మాటికి
చౌకజేసితె దూరమా
మాటిమాటికి మ్రొక్కి వేడితె
మరిమరీ గంభీరమా

ఆటపాటల మేటియగు మా
బోటి యిలు బహు దూరమా
పాటలాధరి నెనయ వేణుగో
పాల దీనజనావనా

ఎన్నడైనను నీదు కూటమి
నెనయుటకు మై దాచెనా
నిన్న మొన్నటి చెలుల నేస్తము
నీకు హితమై తోచెనా

అన్నిటను నెరజాణ వన తగి
నందుకా యీ మోచనా
వన్నెమీరగ రార వేణుగో
పాల దీనజనావనా

## హెచ్చరికె

### 196. కేదారగౌళ - ఝంపె

పల్లవి - హెచ్చరికె పరా - కిందిరారమణా
అను... హెచ్చరికె జతనంపు హేమాబ్జచరణా
పచ్చవిల్తుని గన్న భవపాశ హరణా ॥హెచ్చరికె॥

పాలుపొంద తిరువిసము పొందుగ భుజించి
తిలకించి మణుల వేదికను వసియించి
కలపంబు మైనిండ కలయ నలరించి
విలసిల్లు కర్పూర వీడెము గ్రహించి ॥హె॥

బంగారు చాయ దుప్పటి చుంగు జీరా
శృంగారమగు మోము చెలువు కళలూరా
రంగలకు విడిదికతి రాజసము మీరా
పొంగుచును వచ్చేవు భువనైకవీరా! ॥హె॥

మగువ లిరుగడల చామరలు వీవగనూ!
సొగసుగా వేరొకతె సురటి వేయగనూ!
గగనముననుండి సురగణము పొగడగనూ!
వగలు గులుకుచును దేవముని బాడగనూ! ॥హె॥

మొలక లేనగవు వెన్నెలల నిరసించా
చెలరేగి యప్సరలు చేరి నటియింపా!
తులలేని వైభవముతో సందడింపా!
వలచి త్రిదశులు విరులవాన గురియింపా॥ ॥హె॥



" మగువ లిరుగడల చామరలు వీవగనూ ! "

— పేజి 186 - పదము 196

వాణీశు కరుణించి వర మొసగినావు!
ప్రాణికోటుల నెల్ల ప్రబల జేశావు

నాణెమున కార్వేటి నగరమున నీవు!
వేణుగోపాలుడై వెలసి యున్నావు!॥ ॥హే॥

## -: హెచ్చరిక :-

## 197. సావేరి - రూప

శ్రీలలనామణి రమణా। శ్రితపోషణ సుగుణా!
శీలాఖిలమయ వేణుగో। పాల హెచ్చరికె!

మురళీరవలోలా సుం। దరలలిత కపోలా!
పరమాత్మా శ్రీ వేణుగో। పాలా హెచ్చరికె!

దివిజార్చితచరణా సమధిక దివ్యాభరణా!
భవపాశహరణా వేణుగోపాలా హెచ్చరికె!

నవకాంచనచేలా దా। నవ గర్వ విఫాలా!
భవసన్నుత శ్రీ వేణుగో। పాలా హెచ్చరికె!

కరుణారస భవనా! మురహర। శూరత్రిభువనా!
పరిపాలన శ్రీ వేణుగో। పాల హెచ్చరికె

వ్యాళాధిపశయనా స్ఫుట। వారిజదళనయనా!
బాలేందువదనా వేణగో। పాలా హెచ్చరికె॥

దోషాభ్రసమీరా హిత। భాషాచలధీరా!
భాషాధిపనుత వేణుగో। పాలా హెచ్చరికె!

హరినీలనిభాంగా వి । హంగరాజ తురంగా !
పరమోత్సవ శ్రీవేణుగో । పాలా హెచ్చరికె !

సాగసా శ్రీకార్వేటి । నగరమున వెలసిన
భగవంతుడవగు వేణుగో । పాలా హెచ్చరికె !

## 198. నవరోజు - దివ్యజాతి లఘువు

లాలెనుచు వూచేరు । లలన లింపునను
శ్రీలచెన్నలరు ను । య్యాల పాన్పునను
గోల రుక్మిణిదేవి । కోరి సొంపునను
బాళితో వచ్చె నీ । పై తలంపుననూ ॥లాలీ॥

జోలపాడెద మనుచు । జోడు గూడుకొని
బాలికలు తమలోన । పంతమాడుకొని
మేలిమిగ నిన్నుయే । వేళ పొగడుకొని
తాలిమితో వచ్చేరు । దయను వేడుకొని ॥లాలీ॥

కరమునను రత్నాల । కంకణము మ్రోవా
హరిణాక్షి మరువంపు । సురటి గొనివీవా
మరిప్రొద్దు బోయె నె । మ్మది నిదురబోవా
పరమ పావనుడైన । పరవాసుదేవా ॥లాలీ॥

చిన్ని బాలులతోటి । చెలిమి సేయకురా
కన్నికా మణుల ద । గ్గరికి బిలువకురా
మన్ననతో మీతల్లి । మాట మీరకురా
వెన్నయిచ్చేను నీ । వెందు దిరుగకురా ॥లాలీ॥

ధరలోన వసుదేవు । తనయుడై పుట్టి
శరణాగతత్రాణ । బిరుదు చేపట్టి
వరుస సద్భక్తులకు । స్థిరమొసగినట్టి
దొరవనుచు సుజను లెం । తురు గంటగట్టీ ॥లాలీ॥

జారచోరత్వముల । చతురుడైనావు
ధీరుడై యిల్లిల్లు । దూరి వచ్చేవు
వారు కోపించితే । వగల బొయ్యేవు
దూరగావలె ననుచు । దుడుకు జేసేవు ॥లాలీ॥

అసురలను శిక్షించి । అవని రక్షించి
మసలకను కౌరవుల । మదము లణగించి
పొసగ ధర్మజుచేత । భూమి నేలించి
రసికుడై చెలగితివి । రాజసము మించి ॥లాలీ॥

వాణీశ రుద్రాది । వందితుడ వీవు
ప్రాణికోటుల నెల్ల । ప్రబల జేసేవు
నాణెముగ కార్వేటి । నగరమున నీవు
వేణుగోపాలుడై । వెలసి యున్నావు ॥లాలీ॥

## 199. భైరవి - ఝంపె

పల్లవి - జయమంగళము - నిత్య - శుభమంగళం.

ఇందిరారమణునకు । నిభరాజవరదునకు
మందరోద్ధారునకు । మాధవునకూ
నందనందనుడైన । నవనీతచోరునకు
కందర్పశతకోటి । సుందరునకూ ॥జయ॥

అసురసంహారునకు । నంభోజనాథునకు
అసహాయునకు చక్ర । హస్తునకునూ
వసుమతీకాంతునకు । వనజాత నేత్రునకు
కుసుమాస్త్రగన్న యదు । కుంజరునకూ ॥జ॥

ఖగరాజగమనునకు । కనకమయచేలునకు
సుగుణాలవాలునకు । సుచరిత్రుకూ
అగణితవిలాసునకు । అఖిల దేవాత్మునకు
జగ దేకవీరునకు । జయ శాలికీ ॥జ॥

దీనమందారునకు । దివ్యమణిహారునకు
మానితాఖిలలోక । మాన్యునకునూ
గానలోలునకు నా । గమనిగమ వేద్యునకు
దానవారికితులసి । ధామునకునూ ॥జ॥

దరహాసవదనునకు । దారిద్ర్యశమనునకు
పురుహూతవంద్యునకు । పూజితునకు
కరుణాసముద్రుడై । కార్వేటినగరమున
పరగు శ్రీ వేణుగో । పాలునకునూ ॥జ॥

## 200. రాగమాలిక - ఆది తాళము

పల్లవి – కన్న తల్లి కరుణించి బ్రోవుమిక
నన్న్యుడని మనసా వే రెంచక
అను...సన్నుతింతు నరుణాద్రి పురి వెలయు
సాంబశివుని ముద్దు మోహనాంగి ॥కన్న॥

శాంతగూపి శరదాదుకళాధరి
చండభైరవి త్రిశూలిని
సంతోషముగ ముద్దుగా నభీష్టమొసగు
సన్నుతాంగి సాధుపోషణి
సంతముగను రంభాది కాంతలు
సంతువరాళి పదచాళిని
వింతగాను కొలువుండు వేళలో
వేడ్క మీర నానందభైరవి ॥కన్న॥

సంబుకంఠి కలహంస గామిని
కౌమారి పరమ కళ్యాణి
అంబుజాక్షులెల్ల వేగ సురటి విసరే
టందము గనుగొని
తుంబురు నారదు లెల్ల నీ మహిమ
తొలి జామున వీణను బిలహారిని
గంభీరముగ శంకరాభరణమును
గానములను సేయుదు రనుదినమును ॥కన్న॥

నగరాజకుమారి నీతోడి
నాణెముగల దైవము లేదనుచు
జగతిలోన జనులెల్ల పొగడగను
జలజనేత్రి మధ్యమావతి

సొగసుగాను సారంగనయనలు
సొంపుమీర సారంగమీటుచు
బాగుగాను పాడ నసావేరి
బాలవేణు గోపాల సోదరి ||కన్న||

సంపూర్ణము